# ఆ స్వచ్ఛమైన మనోహరమైన తెల్ల తనానికి

LION BRAND
VICTORIA BLUE OOB
(Best Ultramarine)
MADE IN INDIA WITH WEST GERMAN COLLABORATION BY
ULTRAMARINE & PIGMENTS LIMITED, AMBATTUR, MADRAS-53

లయన్ బ్రాండ్

## విక్టోరియా బ్లూ ఒ ఒ బి (OOB)

(ప్రశస్తమైన ముదురు నీలం)

అవును, కొంచం విక్టోరియా బ్లూ ఒఒబి మీ తెల్ల బట్టలకు అద్భుతమైన ప్రత్యేకత నిస్తుంది! వాటికి మిలమిట్లు కొలిపే తెల్లి తనాన్ని చేకూర్చుతుంది. మీ చొక్కాలకు, చీరెలకు, దుప్పట్లకు ఆటీవచ్చే విధంగా అదనపు తెలుపునిచ్చే పద్ధతి!

తయారుచేయువారు: అల్ట్రామరైన్ అండ్ పిగ్మెంట్స్ లిమిటెడ్ అంబత్తూర్, మద్రాస్-53.

సోల్ సెల్లింగ్ ఏజంట్లు: జెంమ్ డైస్ ట్రేడింగ్ కంపెనీ, 318, లింగి చెట్టి స్ట్రీట్, మద్రాసు-1.



VAPI: UP: 553 TEL

## సినిమా

శ్రీ శ్రీనివాస్ తన పొరపాట్లు నెవరైనా ఎత్తి చూపితే, అవి సహేతుకమ్మెనవిగా సంపాదకులు భావిస్తే, సరిదిద్దుకోవాలి, మరల చేయకుండా యుండాలి. ఆయన ఆంధ్రసచిత్ర వారపత్రిక సినిమా విలేఖరి. అక్కర కనబరిచేందుకు కారకులు శ్రీ రామారావు కాని, శ్రీ శ్రీనివాస్ కాని కాదనడంతో అంతర్యం వారుభయులూ వ్యక్తిగతంగా బాధ్యులు కాదని. పత్రికలో ప్రచురితమయే అంశాల బాధ్యత సంపాదకులది! క్రమశిక్షణ పాటిస్తూ పత్రిక గౌరవ ప్రతిష్ఠలకు భంగకరంగా వర్తించకుండా విలేఖరులు మెలగుకునేట్లు చేయవలసినది సంపాదకులు. అందువల్లనే నాకు శ్రీ శ్రీనివాస్ అభినందనలతో కాని, కృతజ్ఞతతో కాని పనిలేదని మొదట్నుంచీ వ్రాస్తూ వచ్చాను. లేఖకులకు అభినందనలు తెలిపే అవకాశం రచయితల కిచ్చే సాంప్రదాయాన్ని సృష్టించడం సబబు కాదు.

మం. సత్యం జైహింద్ స్టూడియోస్, మద్రాసు.

## కథలు

11—10—68 సంచికలో ప్రచురింపబడిన

# ఉత్తరాలు

'మమత' కథ వన్నెంతో ఆకర్షించింది. ముగింపు బాగుంది.

డి. సరళ (విజయపురి నార్తు)

*　　*　　*

11—10—68 వ తేదీ ఆంధ్రపత్రిక వ్రాసిన "మమత" కథ చదువుతున్నంత సేపు అవ్యక్తమైన వేదనని అనుభవించాను. కాని అఖరికి నాటికలో తల్లికొడుకులు కల్సుకొంటారు. అట్లాగే (పూర్ణ) రాంబాబు తపన తెల్సుకొని తల్లిని క్షమాపణ వేడుకొంటే కథ ఇంకా ఎంత బాగానో రాణించేది. ఒకవారం విపరీతంలో, నగ్నంగా ఉండి నడి బజారులో నృత్యం చేయుటము అలవాటయి నట్లుంది హంతకులకు. నరరూప రాక్షసులకు, చదువుతుంటే భలే భయము, ఆశ్చర్యము, బాధ కల్గుతున్నాయి మాకు.

జి. శాంత (చిత్తూరు)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 25—10—'68

కీలకనామ సం॥ కార్తికమాసం శుద్ధ చవితి

సంపుటము : 61　సంచిక, 0

స్థాపితము
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
I, తంబుచెట్టి వీథి, మద్రాసు-1


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన శ్రీ గెనిశెట్టి

**పాఠకులందరికీ మా దీపావళి శుభాకాంక్షలు.**

1968 దీపావళి కథల పోటీలో ఉత్సాహంతో పాల్గొని పోటీని జయప్రదం చేసిన రచయిత(త్రు)లందరికీ మా కృతజ్ఞతలు. మొదటి బహుమతి పొందిన రచయిత్రి శ్రీమతి టి. విజయలక్ష్మి కారణాంతరాల వల్ల ఫోటో పంపలేమని రాశారు. వారి ఉత్తరం, రెండవ బహుమతి పొందిన రచయిత శ్రీ రంగధామ్, మూడవ బహుమతి పొందిన రచయిత్రి శ్రీమతి వేదుల శకుంతల రాసిన ఉత్తరాలు, ఫోటోలు వేస్తున్నాము.

పోటీలో బహుమతి పొందకపోయినా మామూలుగా తర్వాతి సంచికలలో ప్రచురించడానికి స్వీకరించిన కథల జాబితాని ఈ సంచికలోనే మరోచోట వేస్తున్నాము. వీటి విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపలేమని మరోకసారి మనవి చేసుకుంటున్నాము. —సం॥

## శ్రీమతి టి. విజయలక్ష్మి

"స్వగ్రామం ఒంగోలు తాలూకా కొత్తపల్లి. జననం: 1943. శ్రీవారూ, నేనూ, మా చిరంజీవి ఇదే మా కుటుంబం. పరిహాసానికో, సరదాకో— రచయిత్రీ అని అప్పుడప్పుడు నన్ను సంబోధించినా, నేను వ్రాసిన ఈ కథ చదివి, తగు సలహా లిచ్చి, పోటీకి పంపమని ప్రోత్సహించింది మా శ్రీవారే. కథలు వ్రాయడం కంటే చదవడమే నా కెక్కువ యిష్టం. ప్రచురిత మవుతున్న నా మొదటి కథ యిదే. నాకీ అవకాశం కలిగించి ప్రోత్సహించిన ఆంధ్రసచిత్ర వారపత్రికకి కృతజ్ఞురాలిని."



## రంగధామ్

"పూర్తి పేరు కొల్లూరు రంగధామరావు. విద్య: బి.ఎస్‌సి., బి.ఎస్‌సి.(టెక్), వయస్సు 38 సంవత్సరాలు. రచనలు చెయ్యడం ప్రారంభించి ఏడేళ్లయింది. నవలలు నాలుగూ, కథలు నలభై దాకా ప్రచురిత మయ్యాయి. ఉద్యోగం: ప్రస్తుతం గుంటూరులోని ఒక ఫ్యాక్టరీలో కెమికల్ ఇంజనీరుగా ఉంటున్నాను. సంగీత, సాహిత్యాలంటే అమితమైన ఆసక్తి. ఇంత కన్నా చెప్పుకోదగిన దేమీ లేదు."



## శ్రీమతి వేదుల శకుంతల

"జన్మస్థలం తూ.గో. జిల్లా ద్రాక్షారామం. కాని చిన్నప్పటి నుండీ తెలంగాణాలో పెరిగేను. ఖమ్మం, వరంగల్‌లలో విద్యాభ్యాసం. వచ్చిన భాషలు తెలుగు, హిందీ, ఇంగ్లీషు. వచ్చిన కళలు (కొద్ది ప్రవేశమున్నవి): సంగీతం, చిత్రలేఖనం, కుట్లు—

"ఎట్టి పరిస్థితులలోనైనా వ్యక్తిగత అభిప్రాయాన్ని వదలించుకోడానికి యిష్టపడలేని తత్వం! మధ్యతరగతి కుటుంబం, శ్రీవారి ఉద్యోగ రీత్యా హైద్రాబాదు కాపరస్థులం. ముగ్గురు పిల్లలు."

---

# ఉత్తరాలు

ఆంధ్రసచిత్ర వారపత్రిక (11—10—68) చదివితిని. సినిమా నాయికానాయకుల ముఖచిత్రములతో విసిగిన మాకు యీ వారం గెటప్ చాల బాగుంది. "ఒక పువ్వూ — మూడు ముళ్లూ" కథ చాల బాగుంది.

డి. రాజారావు (ఖర్గపూరు)

* * *

'మమత', 'ఒకపువ్వు మూడు ముళ్లు" కథలు చాలా బాగున్నవి.

మమత కథ రచయిత్రి విజయమారుతి, తల్లి ప్రేమను చక్కగా సమకూర్చారు. రాంబాబు లాంటి, తల్లిని కాదనే కొడుకులకు ఈకథ ఒక చక్కని గుణపాఠం.

—యం. డి. మసూద్‌అహమ్మద్,
యం. అంకయ్య, (మండ్య)

* * *

"మమత" అన్నకథ చాలబాగుంది. ముఖ్యంగా "పూర్ణ" పాత్రచిత్రీకరణ బాగావచ్చింది. కథ చదువుతూవున్నంతసేపూకథపై ఆసక్తి "పూర్ణ"పై జాలి వేసింది. సీరియల్ "జీవిత వలయాలు" వరేసరి అది మీపత్రికకే వెలుగు.

—కరివేటి మోహన్ (రాజమండ్రి).

### ముఖచిత్రం

4—10—68 ఆంధ్ర సచిత్ర వారపత్రిక దసరా సంచికలో ప్రచురించిన "ఆడజాతికే అవమానం" అన్న వ్యాసం చదివాము. ఎంతో బాగుంది.

రచయిత్రి శివకుమారిగారి అనువాదం చాలా చక్కగా ఉన్నా ..... అందులోని పాత్రల పేర్లను తప్పుగా సూచించినందుకు చింతిస్తు మనవి చేస్తున్నాను.

పేజి 64, మొదటికాలం క్రిందనుండి రెండవ పేరాలో మిస్‌కమల్ విద్యా అని వ్రాశారు. కాని, ఆమెపేరు "మిస్ కమల్ వైద్య"గా గుర్తింపగలరు.

మరియు రెండవకాలం మొదటిపేరాలో హంతకుని పేరు 'మగ్యా'గా పరిచయం చేశారు. కాని, "మంగ్యా"గా ఉండాలి. అని సహృదయ పూర్వకంగా తెలుపుతున్నాను. అంతేగాని, విమర్శించాలన్న ఉద్దేశంతో కాదు.

చివరిలో ప్రజలు ప్రభుత్వాన్ని ప్రశ్నించిన నాలుగు ప్రశ్నలు చాలా సమంజసంగా వ్రాశారు. కాని ప్రభుత్వం ఏం సమాధానం చెప్తుందని.....,

"కంచే చేనుమేస్తే......?" అన్న సామెత ఉండనే ఉందిగా.....

ఇంత చక్కటి వ్యాసాన్ని అందించిన శివకుమారి గారిక్కి మా యొక్క ప్రత్యేకాభినందనములు.

కే.నరేంద్ర, కే. శ్యాంరావు, (బొంబాయి-1).

### వ్యాసాలు

11—10—68 తేదీ సంచికలో శ్రీ దేశిరావుజీగారి ఉత్తరం, దానికి మీరిచ్చిన సమాధానం చదివాను. మన పురాణాలు మహాసముద్రాలే. కాని ఆ సముద్రంలోకి కుళ్ళు కాలవలని ప్రవహింపచేయడం వలన ఎవరికీ ప్రయోజనం లేదు. పెద్దనగారిలాగ ఆ సముద్రంలోని రత్నాలని పైకితీసి సాన బెట్టడం వలన పురాణాలకీ, పాఠకులకీ కాక హాస్య రసానికి కూడా ప్రయోజనం ఉంది.

అపహాస్యాన్ని హాస్యంగా ప్రచారం చేయడంకోసం 'నవీనత'ని 'శిలంపీకరించడం' ఏమీ బాగులేదు. వినాయకుడి గురించి పురాణాల్లో గల చారిత్రక వృత్తాంతానికి సంబంధించిన విషయాలని చమత్కారంగా చెప్పి హాస్యం ఒప్పించిఉంటే బాగుండేది. పెద్దనగారు గారు చేసిందంతే. అంతేగాని శ్రీ కృష్ణుడు అరటి తొక్కమీద కాలుజారి పడ్డటు, కాలేజీ అమ్మాయి వినాయకుడి చెవులు మలిపినట్లు చిత్రీకరిస్తే ఎబ్బెట్టుగానే ఉంటుంది. అటువంటి చవకబారు హాస్యం తోపత్రిక స్థాయిని తగ్గించవద్దని నా కోరిక.

మరువాడ రాజేశ్వరరావు (విశాఖపట్నం).


కొన్ని వందలమంది ఉరికంబం ఎక్కాక స్వాతంత్ర్యం వస్తుంది
— అబ్దుల్లా
ఉరితీయించుకొని స్వాతంత్ర్యం సంపాదించుకో


జమ్మూకాశ్మీరు ప్రజల సమావేశం
కుక్కతోక ఎప్పుడూ వంకరే
అబ్దుల్లా ఉపన్యాసం
కేంద్రాన్ని ఎదిరించి పోరాడ గలను
కేంద్రం


భారత్ అభిప్రాయానికి మాస్కో వ్యతిరేకత
దీనికిదే చోటు!
చిత్తుబుట్ట
OOMMEN

# అమాత్య శ్రేష్ఠుల విలాస యాత్రలు

యాత్రికులు ఇళ్లకి తిరిగి వచ్చేస్తున్నారు. శ్రీ మొరార్జీదేశాయి సోమవారం నాడు ఢిల్లీ చేరారు. ఇక ప్రధాన మంత్రి 17 అక్టోబరు నాటికి ఇంటికి తిరిగి రావాలి. ఆ వెంటనే దీపావళి సెలవలు మొదలవుతాయి. 22వ తేదీ దాకా ప్రభుత్వం పని చెయ్యదు.

**అందరికీ తెలిసిన రహస్యం**

శ్రీ దేశాయి, రాగానే అమెరికా సంయుక్త రాష్ట్రాలు అధ్యక్షుని ఎన్నికలో మునిగి ఉన్నాయి కాబట్టి ఏ రకమయిన సహాయమూ (ఆహార ధాన్యాలతో సహా) జనవరి 1969 దాకా పుట్టదని అన్నారు. శ్రీ దేశాయి తమ పర్యటనలో కనిపెట్టిన పెద్ద రహస్యం దేశంలో ఎందరికో తెలుసు. అమెరికా అధ్యక్షుడు పదవి నుంచి విరమించబోతున్నాడు. ఆయన మాట అక్కడి శాసనసభ (కాంగ్రెసు)వారు వినరు. ఆయన తమ పరిపాలనలోని వారినే విమర్శకి అతిగా గురికాకుండా రక్షించలేక పోతున్నారు. ఎన్నో ముఖ్యాంశాల విషయమయి తమ పార్టీ అభ్యర్థి (శ్రీ హంఫ్రీ) కూడా ఆయనతో ఏకీభవించటంలేదు.

ఇవన్నీ అందరికీ తెలిసిన సంగతులే. ఉపప్రధాన మంత్రి యాత్రచేసి కనిపెట్ట వవసరంలేదు.

**మంత్రివర్గం—ప్రపంచదర్శనం**

మునుపు ఒక నినాదం వినిపించేది; 'విమానదళంలో చేరి ప్రపంచం చూడండి!' అని. ఇప్పుడు, 'శ్రీమతిగాంధీ మంత్రివర్గంలో చేరి ప్రపంచం పర్యటించండి!' అనే నినాదం అవసరం అయ్యేలాగ ఉంది.

పార్లమెంటు ముగియగానే మాజీ కాశ్మీరు మహరాజా శ్రీ కరణ్‌సింగ్ రెండో సారి పశ్చిమ దేశయాత్ర వెళ్లారు. అంతకి ముందే ఆయన భూప్రదక్షిణం చేసి వచ్చారు.

చట్ట— సంఘ క్షేమం శాఖ మంత్రి శ్రీ హాతీ జపాన్ వెళ్లారు.

డా. వి. కె. ఆర్. వి రావుగారు తూర్పు యూరోపు దేశాలకి నావలు బేరం చెయ్యటానికి వెళ్లారు. (వాటిని న్యూఢిల్లీలోనూ అమ్మకానికి పెట్టారనుకోండి.)

ప్రస్తుతం స్టేట్‌మంత్రి శ్రీ బలీరామ్ భగత్ న్యూయార్క్‌లో ఉంటున్నారు. అక్కడ అయిక్యరాజ్యసమితిలో తమ ప్రతిభ చూపిస్తున్నారు.

**విదేశయాత్రల పెట్టుబడి**

ప్రధానమంత్రి సంహోదారులు ఆమె మరీ ఎక్కువకాలం దేశంలోనే ఉండిపోయి విదేశయాత్రలనే పెట్టుబడి చెయ్యటం లేదంటారు. శ్రీ సుకర్నో ఇటువంటి పెట్టుబడి చేశారు దాని ఫలితాలేమిటో అందరికీ తెలుసు. అయినా, ఆయన దేశమూకూడా బాధలకి లోనవటం చూస్తున్నాము. ప్రస్తుతం జరుగుతున్న శ్రీమతి గాంధీగారి పర్యటన భారతప్రజలకి రెండు విధాల కర్చులకి కారణం; ఒకటి, ఆమె పర్యటన కర్చు! రెండు, ఆమె ఆహ్వానిస్తున్న దక్షిణ అమెరికా ప్రముఖులు భారతదేశానికి వచ్చినప్పుడు జరగబోయే కర్చు.

**సంయుక్త ప్రకటనలు**

భారతదేశం కొన్ని దక్షిణ అమెరికా దేశాలతో చేసిన సంయుక్త ప్రకటనలలో దేశ భూభాగ స్వాతంత్ర్యం గురించిన ప్రస్తావన ఉంది; ఒకదేశం మరొకదేశపు ఆంతరంగిక వ్యవహారాలలో కలుగచేసుకో రాదనీ ఉంది. ఈ సిద్ధాంతం అయిక్యరాజ్యసమితి ఛార్టర్‌లో ఒకఅంశం. శ్రీ నెహ్రూ పంచశీల సిద్ధాంతాలలోనూ ఒక అంశం. శ్రీమతి గాంధీ ఇతరులతో కలిసి చేసిన ప్రకటనలలో రష్యా చెకోస్లొవాకియాలో చేసిన పనిని విమర్శిస్తున్నారో, లేక దక్షిణ అమెరికాలో అ. సం. రా. ప్రభావం గురించి ప్రస్తావిస్తున్నారో మనకి అర్థంకాదు.

శ్రీమతి గాంధీ ఎన్నో సాంస్కృతిక ఒప్పందాలు చేస్తున్నారు. ఆమె ఆప్త మిత్రమయిన రష్యా ఈ ఒప్పందాలని ఖండిస్తున్నది.

**ధోరణిలో మార్పు**

1968 లో మాస్కోలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ సర్వ సభ్య సమావేశం జరిగింది. ఈ సమావేశంలో మాస్కో వివిధ విదేశాలతో చేస్తున్న సాంస్కృతిక ఒప్పందాల విమర్శ వినబడింది. మొత్తంమీదసాంస్కృతికసంబంధ బాంధవ్యాలు మంచివే అయినప్పటికీ అవి చెడు పరిణామాలకి కూడా దారితీస్తాయనే ధోరణి సోవియట్ పత్రికలలో కనిపిస్తుంది. ఇటీవల 'ప్రావ్దా' పత్రికలో 'సామ్రాజ్య వాదం నడిపే రహస్య యుద్ధం' అనే వ్యాసం పడింది. ఇందులో అమెరికావంటి పాశ్చాత్యదేశాలు 'గూఢచారుల కేంద్రాలు' కొన్ని సృష్టించారనే ఆరోపణ ఉంది; సాంస్కృతిక సంబంధాలద్వారా రష్యావంటి సోషలిస్టు దేశాలలోకే గూఢచారులు చొరబడుతున్నారని వ్యాసరచయితలు ఆరోపించారు.

ఈ కారణాలవల్ల ఎందరో విదేశీయులని సోవియట్ రష్యానుంచి పంపించివేస్తున్నట్లు వార్తలు వెలువడ్డాయి. విద్యార్థులని కూడా బహిష్కరిస్తున్నారుట.

**సంస్కృతి–గూఢచారులు**

ప్రజలని విదేశ యాత్రికులని గురించి హెచ్చరిస్తున్నారు. 'కమ్యూనిస్ట్' అనే పత్రికలో, 'టూరిస్టులు, వ్యాపారులు, శాస్త్రజ్ఞులు, విద్యార్థులు, వివిధ యాత్రా బృందాల సభ్యులు—వారందరినీ సోవియట్ అభిప్రాయాలకి ప్రతికూల ప్రచారం చెయ్యటానికి వాడుతున్నారు...నిలకడలేని వ్యక్తులలో అసంతృప్తి ప్రబలేట్లు చేస్తున్నారు. ఈ అసంతృప్తిని గూఢచార వృత్తికి, దేశ శ్రేయస్సుకి ప్రతికూలంగా పనిచేసేందుకు వాడుతున్నారు'

ఈ సాంస్కృతిక వినిమయ పద్ధతిని గురించి ఆలోచించాలి. ఒక భారతీయ సాంస్కృతిక బృందంగాని మరేదయినా దేశపు బృందంగాని కమ్యూనిస్టు జీవిత విధానాన్ని మార్చగలిగి దానికి హాని కలిగించి నట్టయితే రష్యన్ బృందాలు ఇతర

సంస్కృతులకి హాని కలిగించగలవని ఎందుకు అంగీకరించరాదు?

**ఉమ్మి—సంస్కృతి**

ఇదంతా అప్రస్తుతం, భారతీయ సంస్కృతి అంటే కేవలం నాట్యం. సంగీతం మాత్రమేకాదు. (ఉత్తర భారత దేశంలోనేమో తమలపాకు, పుగాకుని, ఎక్కడపడితే అక్కడ ఉమ్మి వెయ్యటం పెద్ద సంస్కృతి అయిపోయింది.)

ఏది ఎలా ఉన్నా ఈ మిషమీద ఎందరో భారతీయులు విదేశాలని బేవార్సుగా పర్యటించ గలుగుతున్నారు.

ఇక మంత్రుల పర్యటనలవల్ల వచ్చే లాభం ఏమిటి? శ్రీ దేశాయి ఆహార సహాయంకూడా రాకపోవచ్చు నంటున్నారు. లాటిన్ అమెరికన్‌దేశాల విధానాలు శ్రీమతి గాంధీ పర్యటనవల్ల ఏమాత్రం మారవు. వెనుకబడ్డ దేశాల విధానాలకి సంబంధించిన పెద్ద సమావేశం ఒకటి ఇటీవలే న్యూఢిల్లీలో జరిగింది. దానికి తగినట్లు వాణిజ్య బృందాలు పర్యటించాలి కాని మంత్రుల బృందాలు కాదు.

భారత వ్యాపారులని లాభాలు చేస్తున్నారని దూషిస్తారు. సోషలిస్టు దేశాలే లాభాలు ఉండాలంటున్నాయి. రష్యాతో జరిగే ఎగుమతి వ్యాపారాన్ని పరిశీలిద్దాము.

**వెలలు పెరగటానికి కారణం**

ఎగుమతి, అంటే దేశంలోని ఉత్పత్తి కొంత బయటికి వెళ్ళినట్లే. దేశంలోనే కొరత ఉన్నప్పుడు ఎగుమతికి అవకాశాలు తక్కువ కదా? వెల, నాణ్యత, సకాలంలో బట్వాడాలు—ఇవీ ఎగుమతిని పెంచేవి. భారతీయ ఉత్పత్తిదారులు, వ్యాపారులు మోసాలు చేస్తూనే ఉంటారు. కాని, భారతదేశపు సరుకు వెలలు అత్యధికంగా ఉండటానికి ముఖ్యకారణాలు అధిక కార్మిక వేతనాలు, ముడిసరుకు ఎక్కువ వెలలు. కార్మికుల వేతనాలు ఎక్కువగా ఉండటానికి కారణం ఆహార వస్తువుల వెలలు అధికం కావటమే. ప్రభుత్వం చవక ఆహార విధానాన్ని వదిలి అధిక వెలల ఆహార విధానాన్ని అవలంబిస్తోంది. 1967 లో మంచి పంటలు పండాయి కాని వెలలు తగ్గలేదు. వ్యవసాయ వెలల కమిషన్ సలహాని ప్రభుత్వం లెక్కచెయ్యలేదు. ఆహార ప్రదేశాలని సృష్టించి (ఫుడ్ జోన్స్) ఆర్థిక సిద్ధాంతాలు సరిగ్గా పని చెయ్యకుండా చేశారు. ఆహారవస్తువుల వెలలు అధికం కావటంతో పారిశ్రామిక శాంతి తగ్గింది. ఉత్పత్తి పెరగటం మాని వేసింది. ఇక ఆస్ట్రేలియా, లాటిన్ అమెరికాలకి ఎగుమతులు ఏమి సాధిస్తాము?

తమ తండ్రిగారితో చూడని కొన్ని దేశాలు చూడటంతప్ప శ్రీమతి గాంధీ లాటిన్ అమెరికా పర్యటనతో సాధించినది శూన్యం. ●

# దీపావళి



దీపాలవెలుగులో పాపాయి బొమ్మ (ఫొటో: ఎస్. గిరిధర్)

సంవత్సరంలో వరుసగా మూడురోజులు జరుపుకునే పండుగల్లో దీపావళి ఒకటి. ఇదే మొదటిది కూడా. సామాన్యంగా మొదటి రోజు నరకచతుర్దశి, రెండోరోజు కేదార గౌరీ వ్రతం జరుగుతూ వుంటాయి. సాధారణంగా కేదార గౌరీవ్రతం దీపావళి తోనే కలిసిపోతుంది. ఆ మర్నాడు గుజరాతీలకు సంవత్సరాది. అదే విక్రమశకానికి ప్రారంభదినం. వ్యాపారులు కొత్త లెక్కలు అప్పటినుంచీ ప్రారంభించడం ఆచారం.

లోకకంటకుడైన నరకాసురుడు చతుర్దశి నాటిరాత్రి భగవానుడైన శ్రీకృష్ణునిచే సంహరించబడ్డాడు. ప్రాణిలోకానికి నిర్వృతి కలిగింది. ఆ సంతోషంకొద్దీ జనం అంతా అభ్యంగస్నానం చేసుకుని పిండి వంటలతో విందుభోజనాలు అరగించి పండుగ చేసుకున్నారు. నాడు మొదలు ప్రతి సంవత్సరం—చతుర్దశినాడే నరకుడు చనిపోయాడు కాబట్టి ఆదినం తెల్లవారు జామునే యుద్ధాన్ని సూచించే టపాకాయలు కాల్చడం, నరకుని బొమ్మను దహించడం, తలంటి పోసుకుని విందు భోజనాలు చెయ్యడం ఆచారమయింది. స్వాతి నక్షత్రంలో అభ్యంజనం విధించబడింది. అది సాధారణంగా చతుర్దశినాడే పడుతుంది.

బలిచక్రవర్తి కథతోకూడా దీనికి సంబంధం వున్నది. తాను యాగం చేసిన సందర్భంలో యాచకుడుగా వచ్చిన వామనమూర్తికి మూడడుగుల నేలనూ వాగ్దానం చేసి, బలిచక్రవర్తి రాజ్యదానం చెయ్యడమూ, తన బలగంతోసహా పాతాళలోకానికి వెళ్ళిపోవడమూ దీపావళిరోజుననే జరిగిందని చెప్తున్నారు.

ఈ విధంగానే రామాయణకథతో కూడా దీపావళి పండుగకు ముడిపెట్టడం వున్నది. రావణుని వధించిన తర్వాత శ్రీరామచంద్రుడు అయోధ్యకు రావడం, భరతుణ్ణి కలుసుకోవడం ఈరోజునే జరిగిందట. దీనికి చిహ్నంగా 'భరత్ మిలాప్' అనే పేరుతో నేటికిన్నీ ఉత్తర భారతదేశంలో యీ పండుగ జరుగుతున్నది. విజయదశమినాడు జైత్రయాత్రకు బయలుదేరిన రాజులు శత్రువులతో యుద్ధంచేసి విజయాన్ని సాధించి దీపావళినాడే తిరిగిరావడం ఆచారమైంది. ఇది యీ 'భరత్ మిలాప్'ను అనుసరించే ఏర్పడి వుండవచ్చును.



కాకరపువ్వులూ—పాప నవ్వులూ (ఫొటో. ఎస్. రామకృష్ణ)

అయితే, దీనికి రామాయణ కథతో సంబంధం కల్పించడం కుదరదు. ఏమంటే



శ్రీరాముడు తిరిగి అయోధ్యకు వచ్చినది చైత్రశుద్ధంలోననీ, నవమినాడు పట్టాభిషేకం జరిగినదీ చెప్పడానికి తగిన ప్రమాణాలు కానవస్తున్నవి.

ఒకప్పుడు ఉత్తరాయణం మేషంతోనూ, దక్షిణాయనం తులతోనూ ప్రారంభమయేదట. దేవతలకు మేషంనుంచి తుల వరకూ పగలు: రాత్రి తులతోనే ఆరంభం. అందువల్లనే దీర్ఘరాత్రి ప్రారంభంలో దీపాలు వెలిగించడం మొదలౌతుంది. అది మొదలు కార్తికమాసం కూడా ప్రతిదినం దీపాలు వెలిగించడం సంప్రదాయం: కొంత రాత్రి వరకూ దీపాలు వుండాలి గదా!

ఆషాడబహుళ అమావాస్యనాడు తాము న్న స్థానాలనుంచి విడుదలపొందిన పితరులు ఈ దినం తమ పూర్వస్థానాలకు వెళ్తారు. అందువల్ల పండుగ చేసుకుని వైభవంగా వారిని పంపడం జరుగుతుంది. ఇట్లు ఈ దీపాలు పితరుల సద్గతికి మార్గదర్శకాలని కూడా కొందరి అభిప్రాయం.

దక్షిణాయనం తమోమయమైన రాత్రిభాగమనీ, ఉత్తరాయణం దివాభాగమనీ, దీపావళి ఉషఃకాలమనీ కొందరి అభిప్రాయం. ఆ సమయంయొక్క కాంతిని సూచించడానికే నాడు దీపాలు వెలిగించబడతాయట!

దీపావళి పండుగకు కూతుర్నీ, అల్లుడినీ పిలిపించుకుని పండుగ చేసుకుని కట్నాలూ, కానుకలూ యిచ్చి పంపడం ఆచారంగా ఉంటున్నది. దీనికే కౌముదీ మహోత్సవమనే పేరు ప్రసిద్ధంగా వున్నది.

జైనమత ప్రవర్తకుడు మహావీరుడు దీపావళీ ·మావాస్యనాడు నిర్వాణాన్ని పొందాడనీ, దేవతలు ఆయనను పూజించి పావానగరమంతటా దీపాలు వెలిగించారనీ, అప్పటినుంచీ దీపావళి వచ్చిందనీ జైనులంటున్నారు.

క్రీస్తుకు పూర్వం కొన్ని శతాబ్దాల క్రిందటినుంచీ ఇలా పండుగ పాశ్చాత్య దేశాల్లో వుండేదనీ; అప్పుడుండే కెల్టు జాతివారు 'సామోనా' అనే పేరుతో దీన్ని జరిపేవారనీ, ఇదే క్రమంగా యిప్పటి 'ఆల్ సెయింట్స్ డే' గా మారి, నవంబరు ఒకటోతేదీ జరపబడుతున్నదనీ తెలుస్తూ వున్నది.

దీపావళి పండుగ అంగంగా ప్రసిద్ధమైన నరకాసురవధ కథకూ, జ్యోతిశ్శాస్త్రానికీ ఎక్కువ సంబంధం వున్నదని చెప్తారు. ఇది ఆశ్వయుజ బహుళ చతుర్దశినాడు ఆకాశంస్పైని రాసులువుండే స్థితిని వివరిస్తున్నది. తులారాశి తూర్పు క్షితిజం మీద ఉదయిస్తూ వుండగా, పడమటి క్షితిజంమీద మేషరాశి అస్తమిస్తూ వుంటుంది. ఈ మేషరాశి భౌమరాశి. నక్షత్రానికి దేవత వాయువు. దాన్ని అధిష్ఠించి నరకుడిమీదికి యుద్ధానికి వెళ్ళిన కృష్ణుడు—విష్ణువు సూర్యుడే! చంద్రుడు సత్యభామ! నరకుడు పడిపోగానే ఆకాశపు అంచులమీద దీపచ్ఛాయలతో వున్న కన్యారాశి నరకుని బందిఖానానుంచి విడిపోతుంది. అలా విడువడ్డ కన్యల గుంపునకు, దాన్ని విడిపించిన సూర్యుడు నాథుడౌతాడు. ఈ



వెలుగులూ...తారల జిలుగులూ (ఫొటో: ఎస్. గిరిధర్)

నరకుడు భూదేవికి కొడుకు గదా! సాధారణంగా మేషం సాధువైనదే అయినా, అది సూర్యుడ్ని కంటేనే సౌమ్యమౌతుంది. నరకుడు సూర్యుడ్నే! అందువల్లనే అతని వరిపాలన అంధకారబంధురమైపోయింది. అంటే - ఆ దినాల్లో మేషరాశి సూర్యాస్తమయ సమయంలో ఉదయిస్తుంది. అది అస్తమించేవరకూ చీకటిగానే ఉంటుంది. మేషరాశి అస్తమించే వేళకి తులారాశి తూర్పు క్షితిజంమీదికి వస్తుంది. స్వాతి విషయాన్నే పురాణకథతో సమన్వయించి మనవారు చెప్తున్నారని జ్యోతిశ్శాస్త్రవేత్తల అభిప్రాయం!

దేనితో ముడిపెట్టినా, దీపావళి ఏదో విధంగా ప్రపంచ వ్యాప్తమైన పండుగలలో ముఖ్యమైనది! ఉత్తరాది, దక్షిణాది భేదాలు లేకుండా భారతీయులందరూ జరుపుకునే ప్రధానమైన పర్వం!

—బులుసు వేంకటరమణయ్య ●






'డాక్టర్‌గారూ! డాక్టర్‌గారూ!'

'ఏమ్మా!...'

'ఏంలేదండీ!...నాకు పై కడుపులో అదోకమాదిరి మంటగా వుంటుంది. తల కొస్త విసురుగా వుంటుంది...కాళ్ళు దడ... ఒళ్ళు ఒణుకు ... పైకడుపులో అదోక మాదిరిమంట...తల విసురు...గొంతునరాలు నొప్పి...తల కొస్తనొప్పి...పక్కలు నొప్పి... వీపులోపోట్లు...కాళ్ళుతిమ్మిర్లు...చేతులు కూడా తిమ్మిర్లు పైకడుపులో అదోక మాదిరిమంట...తలకొస్త...'

'ఏమ్మా!...చెప్పిందే చెపితే ఎట్లా! మీకు మందులు రాసిచ్చి నాలుగు రోజులైంది...రెండురోజులైనా వాడారా!...'

'లేదండీ! మొన్ననే తెప్పించాను. నిన్న గ్రహణం రోజు... బాగాలేదు ... యీరోజు రాహుకాలం యింకా వుంది.

'ఏమ్మా!... యింకా మందులు తిన కుండానే బాధపడతా మీరు చెప్పిందే చెపతా వుంటే ఏం ప్రయోజనం!...

'డాక్టర్‌గారూ నాబాధ మీకు తెలీడం లేదు...నాకేదో భయం. రాత్రుళ్ళు నిద్ర లేకుండా ఆలోచిస్తూ వుంటాను ... పగలు ఆకలి లేదు...తింటే జీర్ణంకాదు.'

కార్పెట్‌క్లీన్ చేసే బ్రష్‌లాంటి బొద్దు మీసాల డాక్టరు రావణాసురిడిలా ఒక్కసారి బిగ్గరగా నవ్వాడు...రూమంతా ప్రతిధ్వనించింది ... అతనిపక్కనేవున్న లేడీ 'రిసెప్షనిస్టు' అతని నవ్వుకు చిరునవ్వు జోడించింది.

'ఏమ్మా! ... యిప్పు డెవరికిదా ఆకలేస్తా వుంది! జీర్ణం అవుతా వుంది! ... ఆకలికొక మందు జీర్ణాని కింకొకమందు వాడితే సరి...మీకు ఆకలీ, జీర్ణంవుంటే నా దగ్గిరి కెందుకొస్తారు...భయపడకుండా మందులు తినండి...'

'అవును డాక్టర్‌గారూ నాకు మందులు తింటానికి ఎందుకో భయం. నిజం చెపుతున్నాను...నాకా భయం ఎట్లా పోతుంది!'

'అద్దా!... మందులు తింటే పోతుంది.' మళ్ళీరావణాసురుడిలా నవ్వాడు...నా భయాన్ని బాధనూ డాక్టర్ అంత అలక్ష్యంగా తోసెయ్యడం నాకు కష్టం కలిగించింది ... డాక్టర్ నోటితో నాకేం ఫర్వాలేదని చెపితే నాకు కొంతధైర్యం వస్తుం దనిపించింది...కాని ఆయన అదేం చెప్పకుండా తను రాసిచ్చిన మందులు తినమనే చెపుతున్నాడు...తింటానికి భయం...తినకుండా వుండేందుకు ధైర్యం చాలదు...



'అది కాదండీ నరాల స్పెషలిస్టు అదేదో మందు తీసుకోమన్నారండీ భయం పోవడానికి...'

డాక్టర్ నుదిటిమీద మీసాలంత కనుబొమలు ముడిపడ్డాయి.

'ఏమ్మా!...నరాల డాక్టరు నరాల మందు చెప్పాడు...కడుపులో వ్యాధికి ఎట్లా సరిపోతుంది!...వాళ్ళేదో రాసిస్తుంటారు ... అదింకా కడుపు చెడగొట్టును ... వాళ్ళకేం తెలుసు కడుపులో సంగతి!... మీరు నే రాసిచ్చిన మందులు వారంరోజులు వాడి తర్వాత చెప్పండి...' అంటూ మరో పేషంట్ వైపు తిరిగాడు డాక్టర్ ...

డాక్టర్ నాకు ధైర్యం చెప్పనందుకు బాధపడుతూ బయల్దేరాను.

* * *

'డాక్టర్‌గారూ!...'

'యస్ మేడమ్...'

'నాకు కడుపులో మంట...కాళ్ళు దడ ...తల విసురు...ఒళ్ళు ఒణుకు ... గొంతు నెప్పి...కాళ్ళుతిమ్మిర్లు...చేతులుతిమ్మిర్లు ...గుండెదడ...వీపునొప్పి...పక్కలునొప్పి... ఏమిటో భయం...'

'అదే అదే...యివన్నీ మొన్న చెప్పారు గదమ్మా! ... ఆభయానికే మందు రాసిచ్చాను తీసుకున్నారా!...'

'లేదండీ...తెప్పించాను...నిన్న గ్రహణం యీరోజు రాహుకాలం...'

...కొత్త 'యమ్. డి. డాక్టర్ నాజూగ్గా నవ్వాడు.....

'వాట్ మేడమ్...'

రాహుకాలానికి మందుకూ సమ్మంధం ఏమిటీ!... ముందు మీరు నే రాసిచ్చిన మందు తీసుకోండి... మీకు నరాల బలహీనతవల్ల ఆభయం ఏర్పడ్డది ... 'యిక వాలంట్రీ' నరాలు సరిగా 'ఫంక్షన్', చేయనందువల్ల మీకు 'డైజషన్' అప్‌సెట్ అయింది...ఆ మందు తీసుకుంటే సరి పోతుంది...

'మరి కడుపుకు సంబంధించిన ట్రబుల్ అన్నారే 'స్టమక్ స్పెషలిస్టు!...'

డాక్టర్ నవ్వాడు...

'ఆయన అదే అంటాడమ్మా...ఆయన కేంతెలుసు నరాలసంగతి!...

ఆయన ఏదో చెప్తారు...మీరు అదంతా పట్టించుకోకండి...వెంటనే నే రాసిచ్చిన మందు వాడండి...అంటూ మరోపేషెంట్‌వైపు తిరిగాడు...

నేను వికలమైన మనసుతో ఏం



చేయాలో తోచక ఏమందు తినాలో తెలీక వెనక్కు తిరిగాను.

*          *          *

'డాక్టర్‌గారూ!

'రాండమ్మా రాండి...

'నాకు కడుపులో మంట...కాళ్ళుదడ...తల తిరుగుడు...గొంతునొప్పి...'

'ఆ ఆ...అదే అదే మొన్నవచ్చి చెప్పారుగా!...కాస్త వేడి చేస్తే గొంతులో యిరిటేషన్ వుంటుంది... నే రాసిచ్చిన 'లాసెంజస్' వాడారా!

'లేదండి తెప్పించాను...నిన్న గ్రహణం... యీరోజు రాహుకాలం యింకా వుంది...'

డాక్టర్ లంబోదరం బిగ్గరగా నవ్వాడు.

'దీనికి రాహుకాలం ఏంటమ్మా!'

'అదికాదు డాక్టర్‌గారూ మా ఫామిలీ డాక్టర్ చెప్పారూ...'

'ఆయనేదో చెప్తాడులెండి... ఆయనకేం తెలుసు గొంతు, ముక్కు సంగతి!...మీరు నే రాసిచ్చిన మందు తీసుకోండి...తగ్గకపోతే 'ఎక్సరే తీస్తాం...'అంటూ మరో పేషెంట్‌వైపు తిరిగాడు...గుండె జారిపోయినట్లయింది... ఒకవిధమైన బెంగతో యింటిముఖం పట్టాను.

మా ఫామిలీ డాక్టర్ అప్పుడేవచ్చారు.

'డాక్టర్ గారూ!...'

'చెప్పమ్మా!...'

'ఏం లేదండీ...నాకు కడుపులో మంట ... కాళ్ళలో దడ ... ఒళ్ళుదడ ... తల విసురు...'

డాక్టర్ నవ్వాడు.

'ఎందుకు డాక్టర్ నవ్వుతారు!...'

'మీకేం లేదమ్మా! మీకేం జబ్బు లేదు...మీరంతా యిమేజిన్ చేసుకుంటున్నారు...అంతే...'

సడన్‌గా నా కెక్కడలేని ధైర్యం వచ్చేసింది ... నాకు కావలసిన మందు ఆ సమాధానమే అనిపించింది...

'నిజంగానా డాక్టర్‌గారూ!

'అవునమ్మా!...సత్యంగా చెపుతున్నాను...మీకేం జబ్బులేదు...అనవసరంగా భయపడుతున్నారు... మీకు చేయించిన టెస్టులన్నీ 'రిజల్ట్స్' లొచ్చాయి — మీరు ఆరోగ్యంగా వున్నారు ...'

'మరి నాకేదో బాగా లేనట్లు, నాకేదో దిగులుగా, ఎప్పుడూ భయంగా అస్తమానం డాక్టర్లు చూసి ధైర్యం చెప్పాలి అన్నట్లు వుంటుందే! ఎంచేత డాక్టర్ గారూ!...'

'దాన్నే సైకో సొమేటిక్ న్యూరోసిస్' అంటాం...మీరు బాధపడే జబ్బు అదే ... మీకే జబ్బూ లేదు ... మీ కేదో జబ్బు వుందనుకుని గోరంతలు కొండంతలు చేసుకుని బాధపడుతున్నారు ... మీకిప్పుడు కడుపులో మంట వుందా! చెప్పండి!—'

ఉందేమో అని కాస్త ఆలోచించాను... నాకప్పుడు కడుపులో మంట అనిపించలేదు.

'యిప్పుడు లేదు డాక్టర్‌గారూ...ఒక్కోసారి వున్నట్లుంటుంది...'డాక్టర్ నవ్వాడు.

'అది ఎప్పుడూ లేదమ్మా ... మీరు అనుకుంటే వుంటుంది...మీకు నరాల బలహీనత వుంది...అంచేతే మీరు నిద్ర లేకుండా ఆలోచిస్తున్నారు...లేని జబ్బులు వూహిస్తున్నారు...మీకు యింతమంది స్పెషలిస్టులు మందులు రాసిచ్చారే, తిన్నారా!—

'లేదండీ...డాక్టర్‌గారూ నిజం చెప్పా [illegible] మందులు తింటానికి నాకు



భయంగా వుందండీ...ఏమందు తినాలో తెలీలేదు...తింటే ఏమవుతుందోనని భయం ...దిగులు...'

'ఆ మందు మీద నమ్మకం లేదు ఆ డాక్టర్లమీద నమ్మకం లేదుకదూ!...'

'అవునండీ! కరెక్ట్ డాక్టర్‌గారూ...

'మీకెట్లా తెలుసు డాక్టర్‌గారూ!'

డాక్టర్ నవ్వాడు.

'తెలుసమ్మా... మీరు మందులకోసం ఆ డాక్టర్లందర్నీ వెళ్ళిచూట్టంలేదు... మీకు ధైర్యంకావాలి...అది వాళ్ళు చెపుతారేమో నని వెళ్తున్నారు ... వాళ్ళు మందులు రాసిస్తున్నారు...మీతత్వం నాకు తెలుసు గనక చెపుతున్నాను...మీకేజబ్బు లేదు...మీరు మామూలుగావుండండి. మీకే మందులూ వద్దు...నామాట నమ్మండి.'



'నిజంగానా డాక్టర్‌గారూ!' ... నాకా క్షణంలో నాకేజబ్బులేదనిపించింది...ఎక్కడ లేని హుషారొచ్చింది' నాలో వున్న తెలీని భయం పారిపోయినట్లయింది... 'అన్నట్లు డాక్టర్‌గారు నాకున్న జబ్బుపేరేమిటో చెప్పారు తమాషాగా! దాని పేరేమిటండీ!'

'సైకో సొమేటిక్ న్యూరోసిస్' అంటారమ్మా.

'మరి యిదీ జబ్బేగా!...'

డాక్టర్ విరగబడి నవ్వారు...

'యిదుగో మీరిప్పుడు అనుకున్నారే దానిపేరే అది...మీకే జబ్బులేదు... మీకే మందూవద్దూ ... ధైర్యంగా వుండండి... అంతా సరిపోతుంది ...' అంటూ జయ శ్రీ రారు.



ఒకవారం విపరీతం

# భార్యపీక పిసికిన భర్త

36 ఏళ్ళ నటరాజన్ అనే అతను 32 ఏళ్ళ తన భార్యను పీక నులిపి చంపేశాడట. 32 ఏళ్ళు వచ్చినా, ఆరుగురు పిల్లలతల్లయినా, అతని భార్య కన్నియంబాల్‌కు ఒక ప్రియునితో సంబంధం వుందట. ఈవిషయాన్ని పసిగట్టి భర్త వారించాడట. కానీ ఆమె పెడచెవిని పెట్టిందట. దాంతో అతనికి ఆవేశం వచ్చి ఆమెను పీక నులిపి చంపి, పారిపోయాడట. పోలీసుల దర్యాప్తులో ఒక వుత్తరం దొరికిందట. "నాభార్య ప్రవర్తన ఏహ్యంగా వుంది. అందుకని ఆమెను నేనే చంపాను. ఓ వారంలోగా నేనే వచ్చి పట్టుబడిపోతాను. ఆరుగురు పిల్లల తల్లయినా — నా భార్యకి పరాయి వ్యక్తితో సంబంధం వుండడంవల్ల నాకు ఆవేశం వచ్చింది" అని రాశాడట అతను.

* * *

25 ఏళ్ళ ఎతిరాజన్ అనే అతనిని అతని భార్య పరిమళం నల్లులమందు కలిపిన వుప్మా పెట్టి చంపిందట. ఈ దారుణం దక్షిణ ఆర్కాటుకు చెందిన కర్లాపూరులో జరిగింది. కాన్పుకు పుట్టింటికి వెళ్ళిందటామె. ఎతిరాజన్ అత్తారింటికివెళ్ళి భార్యను పిల్లను పంపమంటే అత్తమామలు నిరాకరించి, "నీ ఆస్తి అమ్మేసి నువ్వే ఇక్కడ వుండిపోకూడదూ" అన్నారట. దానికి అతను సమ్మతించలేదట. "పోనీ యీ వుప్మా తినండి" అని అతని భార్య పరిమళం వుప్మా పెట్టిందట. నల్లులమందు కలిపిన వుప్మా తిని, అతనక్కడే చనిపోయాడట. అంత క్రూరంగా దారుణంగా భర్తని ఆ యిల్లాలు ఎందుకు చంపిందో, ఏ వుద్దేశ్యంతో చంపిందో మాత్రం తెలలేదు—స్త్రీణాం......బుద్ధిశ్చాపి చతుర్గుణః.







## స్త్రీలకి సహాయం చేయడం నేరం!

బోర్నియోకి సమీపంలో వున్న పాంటియానాక్ ద్వీపంలో సముద్రపు ఒడ్డున, స్నానాలు చేసే చోటా ఓ వింత ప్రకటన వుంటుందట. "మునిగిపోతున్న స్త్రీలకు సహాయం చేయడం, ఘోరమైన నేరం' అని బోర్డులుంటాయట—ఆశ్చర్యంగా లేదూ?! ఇలా రాసినా, అక్కడ స్నానాలు చేసి, యీతలు కొట్టి ఒక్కస్త్రీ కూడ మునిగి చనిపోవడం యింతవరకూ జరగలేదట.

* * *

## కంచే చేనుమేస్తే

ఆలేరు (భువనగిరి తాలూకా) గ్రామంలో ఒక యువకుని శవం ఓ చెట్టుకు వ్రేలాడుతోందట. ఆరాలు తీయగా, దొంగతనం చేశాడన్న నేరం మీద నరసింహులు (హతుడు) అనే యితన్ని, మరో నలుగుర్ని అరెష్టుచేసి, జైల్లో పెట్టి ఆ గ్రామ పోలీసు పటేలు, మరి కొందరూ కలిసి, చిత్రహింసపెట్టి, చావబాది, ఒక్కొక్కరి దగ్గరా పదేసి రూపాయలు లాక్కుని పంపారట. ఆనక యీ నరసింహులు శరీరం దొరికిందట. ఎవరతన్ని వురి తీశారు? హత్యా ఆత్మహత్యా అని అనుమానిస్తున్నారు. కంచె చేనుమేస్తే అన్న సామెతగా వుంది. అనకూడదు మన కేల— గానీ పోలీసుల దవుర్జన్యాలకు నూటొక్క నిదర్శనాలు దొరుకుతున్నాయి. అయినా వాళ్ళూ పాపం మనుష్యులేగా! అయితే మరీ యింత పశుప్రాయంగా ఎలా ప్రవర్తిస్తున్నారట! ఆహా! ఆశ్చర్యం!

* * *

## నరబలి!

రాజస్థాన్‌లో ఒక గ్రామంలో ఒక కంట్రాక్టరు తన పని నిర్విఘ్నంగా జరగాలని నరబలి యిచ్చాడట. ఒక పంట చెరువు త్రవ్వకం ప్రారంభించే ముందు తన వద్దపనిచేస్తున్న 12 ఏళ్ళ కుర్రాడిని బలియిచ్చాడట. కుర్రాడు యింటికి రాలేదని, తండ్రి పోలీసులకు తెలియజేస్తే, పోలీసులు బయటకులాగితే తేలినఘోరం యిది. ఈ శతాబ్దంలో కూడా కాశీమజిలీ కథల్లోలాటి ఈలాంటి ఘోరాలు జరిగితే, ఆ నరరూపరాక్షసులకు వేసేశిక్ష ఎలాటిదుండాలి? —ఫాలాక్షుడు

# పేరులోనే కలదు పెన్నిధి

ఈ పేరుతోనే ఒక వ్యాసాన్ని యిదివరకు వ్రాసాను. అది 11—9—1964 తేదీ ఆంధ్ర పత్రిక వారపత్రికలో ప్రచురింపబడింది.

దానితర్వాత మరొక వ్యాసాన్ని వ్రాయడానికి ప్రారంభించినప్పుడు నాకు కొన్నిసందేహాలు కలిగాయి. జాతకభాగంలో ఆధిపత్యం వల్లను స్థితివల్లను శని మంచివాడూ కావచ్చును. చెడ్డవాడూ కావచ్చును. కాని సంఖ్యాశాస్త్రంలో మాత్రం శని యెప్పుడూ చెడ్డవాడే. అయినా యిదివరకు యిచ్చిన విలువల ప్రకారం తమ పేరుకు 8 (శనియొక్క సంఖ్య) వచ్చిన వ్యక్తులు, సంస్థలు కొన్ని అభివృద్ధిలో ఉండడం కన్పిస్తుంది.

ఉదా: B A T A
2 1 4 1 = 8

'బాటా' అనే పేరుకు యిదివరకు యిచ్చిన విలువల ప్రకారం 8 వచ్చింది. ఇది చెడ్డసంఖ్య. అయినా, ఆ కంపెని దినదినాభివృద్ధిని చెందుతూంది. దీనికి కారణం యేమిటి? ఈ పేరుకు యేదైనా ప్రత్యేకత ఉందా? లేకపోతే 8 కూడా లాభదాయకంగా ఉంటుందా? ఈ పరిస్థితిలో అసలు అక్షరానికి సంఖ్యకుగల సంబంధం యేమిటనే ప్రశ్న వచ్చింది.

'దేవుడు ఉన్నాడు' అనే విషయంలో కొంతమందికి సందేహం ఉండ వచ్చును. కాని పాము మంత్రం, తేలుమంత్రం వంటి మంత్రాలు పని చేయడం సర్వజన విదితం కాబట్టి, శబ్దానికి ఒకశక్తి ఉందనే విషయంలో యెవరికీ సందేహం ఉండనవసరంలేదు. శబ్దతరంగాలకు ఒకవిధమైన శక్తి ఉందని ఆధునిక శాస్త్రజ్ఞులుకూడా అంగీకరించి ఉన్నారు.

ఒకే అక్షర క్రమాన్ని మనం విడువకుండా ఉచ్ఛరిస్తున్నట్లయితే దానివలన మంచిచెడ్డలు కలుగుతాయనేది మంత్రశాస్త్రం యొక్క మూలం. అదే విధంగా ఒకవ్యక్తిగాని ఒక సంస్థగాని ఒక పేరుతో పదేపదే పిలువబడుతున్నట్లయితే ఆ పేరుయొక్క మంచిచెడ్డలు ఆ వ్యక్తికిగాని ఆ సంస్థకుగాని కలుగుతాయి. ఇదే సంఖ్యాశాస్త్రానికి ఆధారమైన సూత్రం,

పై సూత్రాన్ని అనుసరించి, ఒకవ్యక్తి పేరుకు విలువను నిర్ణయించవలసి వచ్చినప్పుడు ఆవ్యక్తి యెక్కువమంది చేత యెలాగ పిలవబడతాడో, ఆ పేరునే తీసికోవాలిగాని అతను వ్రాసుకొనే పేరును బట్టి విలువను నిర్ణయించకూడదు.

ఉదా:—సాధారణంగా అందరూ 'గోపాలరావు' అనే పేరును గోపాలరావు అనే వ్రాస్తారుకాని పిలిచేటప్పుడు మాత్రం 'గోపాల్రావ్' అని పిలుస్తారు. అలాగే వెంకటరావు అని వ్రాసి వెంకట్రావ్ అని పిలుస్తుంటారు. 'సుభద్ర'ను 'సుబద్ర' అని పిలుస్తారు.

అందుచేత సంఖ్యాశాస్త్రంతో పేరుకు విలువను నిర్ణయించవలసి వచ్చినప్పుడు ఆపేరు ఉచ్చరింపబడే రూపానికే విలువను నిర్ణయించాలిగాని వ్రాయబడే రూపానికి కాదు.

ఇంగ్లీషు అక్షరాలతో వ్రాసిన పేర్లను పలకడంలో ఒక చిక్కు వస్తుంది. ఆ భాషలో ఒక అక్షరాన్ని రెండుమూడు విధాలుగా పలకడానికి అవకాశం ఉండడమే దానికి కారణం.

ఉదా:— A ను అ, ఆ, ఏ లుగా పలకవచ్చును.
U ను ఉ, అ, గా పలకవచ్చును.
R A M A ను రమ, రమా, రామ, రామా అని నాలుగు విధాలుగా పలకవచ్చును.

పలకడం యెలాగ ఉన్నప్పటికీ, వ్రాత ఈ నాల్గు పేర్లకు సమానమే కాబట్టి యీ నాలుగు పేర్లకు యింగ్లీషు అక్షరాలను అనుసరించి ఒకే విలువను నిర్ణయించవలసి వస్తుంది. అది సహేతుకం కాదు.

తెలుగుభాషలో అక్షరాలకు యిటువంటి చిరాకు ఉండదు. ప్రతి శబ్దానికీ ఒక్కొక్క అక్షరం ఉంది. అందుచేత పూర్వం చాల్డియనులు నిర్ణయించిన పద్ధతిని అనుసరించి తెలుగు అక్షరాలకు విలువను నిర్ణయించాను. ఇవి సంతృప్తికరమైన ఫలితాలను యిస్తున్నాయి.

'అంకానాం కటపయ' అనే జైమిని సూత్రాన్ని అనుసరించి తెలుగు అక్షరాలకు విలువలను యిదివరకు కొంతమంది నిర్ణయించారు కాని అవి సంతృప్తికరంగా లేవు.

పూర్వం చాల్డియనులు చెప్పిన పద్ధతిని అనుసరించి తెలుగు అక్షరాలకు విలువలు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ
1 2 1 2 6 7 5 6 2 6 7 7
క్ ఖ్ గ్ ఘ్ ఙ్ చ్ ఛ్ జ్ ఝ్
2 7 3 8 7 8 8 1 6
ట్ ఠ్ డ్ ఢ్ ణ్ త్ థ్ ద్ ధ్ న్
4 9 4 9 10 4 9 4 9 5
ప్ ఫ్ బ్ భ్ మ్ య్ ర్ ల్ వ్ శ్ ష్ స్ హ్
8 13 2 5 4 1 2 3 6 8 8 3 5

సున్నకు తరువాతవచ్చే అక్షరాన్నిబట్టి సున్న విలువ మారుతుంటుంది. ప, ఫ, బ, భ, య, ర, ల, వ, శ, ష, స, హ, లకు ముందు వచ్చే సున్నకు విలువ, 4. మిగిలిన అక్షరాలకుముందు వచ్చే సున్నకు విలువ 5. పేరుకు ఆఖరున వచ్చే సున్నకు విలువ 4.

ఉదా: —హంస ఈ పేరులో సున్న 'స' కు ముందు వచ్చింది కాబట్టి యీ సున్నకు విలువ 4.

గంగ— ఈ పదంలో సున్న 'గ' కు ముందు వచ్చింది కాబట్టి యీ సున్నకు విలువ 5.

**పేరుకు విలువను నిర్ణయించే విధానం.**

పేరుకు విలువను నిర్ణయించడానికి ముందు పేరును హల్లులు అచ్చులుగా విడగొట్టాలి.

ఉదా:—గోపాల్రావ్ అనే పేరును హల్లులు, అచ్చులు విడగొట్టగా—గ్ ఓ ప్ ఆ ల్ ర్ ఆ వ్ గా, మారుతుంది.

హల్లులు అచ్చులుగా విడగొట్టిన తరువాత వాటికి విలువలను వేయాలి.

ఉదా:—గ్ ఓ ప్ ఆ ల్ ర్ ఆ వ్
3 7 8 2 3 2 2 6 = 33

(2) బాటా అనే పేరును హల్లులు, అచ్చులుగా విడగొట్టగా బ్ ఆ ట్ ఆ అవుతుంది.

దీనికి విలువ బ్ ఆ ట్ ఆ
2 2 4 2=10

(3) అంబిక అనే పేరుకు
అ మ్ బ్ ఇ క్ అ
1 4 2 1 2 1=11

ఈ పేరులో సున్న 'బి' కి ముందు ఉంది కాబట్టి 'మ్' గా భావించి 4 వేయాలి.

(4) వెంకట్రావు అనే పేరు
వ్ ఎ న్ క్ అ ట్ ర్ ఆ వ్
6 5 5 2 1 4 2 2 6—35

ఈ పేరులో సున్న 'క' కు ముందు వచ్చింది కాబట్టి 'న్' గా భావించి 5 వేయాలి.

(5) భరణి అనే పేరును పలకడంలో 'బర్ణి'గా మారుతుంది.

దానికి విలువ బ్ అ ర్ ణ్ ఈ
2 1 2 10 2=17

ఈ పేరు వ్రాయడంలో 'భరణి' అని వ్రాసినా ఎక్కువమంది జనులు 'బర్ణి' అనే అంటారు, కాబట్టి దీనికే విలువను నిర్ణయించాలి.

పేర్లకు వచ్చిన సంఖ్యలకు ఫలితాలను యిదివరకు వ్రాసిన వ్యాసంలో వివరించాను.

**సంఖ్యలకు అధిపతులు**

1. ఈ సంఖ్యకు సూర్యుడు అధిపతి. తమ పేరుకు ఒకటవ సంఖ్యకు సంబంధించిన సంఖ్యలు అనగా 1, 10, 19, 28, 37, 46, 55 వగైరా వచ్చిన వారును యే నెలలోనైనా 1, 10, 19, 28 తేదీల్లో జన్మించినవారును ఒకటవ సంఖ్యకు సంబంధించిన వ్యక్తులుగా పరిగణింపబడుతున్నారు. ధైర్య సాహసాలకు, రాజకీయాలకు అధికారానికి యీ సంఖ్య చిహ్నం.

2. ఈ సంఖ్యకు చంద్రుడు అధిపతి. తమ పేరుకు రెండవ సంఖ్యకు సంబంధించిన సంఖ్యలు అనగా 2, 11, 20, 29, 38, 47, 56 వగైరా వచ్చిన వారును యే నెలలోనైనా 2, 11, 20,29 తేదీల్లో జన్మించిన వారును రెండవ సంఖ్యకు సంబంధించిన వ్యక్తులుగా పరిగణింపబడు తున్నారు. ఊహలకు, ఉదారత్వానికి, కరుణకుయీసంఖ్యచిహ్నం.

3. ఈ సంఖ్యకు గురుడు అధిపతి. తమ పేరునకు మూడు సంఖ్యకు సంబంధించిన సంఖ్యలు అనగా, 3, 12, 21, 30, 39, 48, 57 వగైరా వచ్చిన వారును యే నెలలోనైనా 3, 12, 21, 30 తేదీల్లో జన్మించిన వారును మూడు సంఖ్యకు సంబంధించిన వ్యక్తులుగా పరిగణింపబడుతున్నారు. క్రమ శిక్షణకు, అధికారానికి, మతానికి యీ సంఖ్య చిహ్నం.

4. ఈ సంఖ్యకు రాహువు అధిపతి. తమ పేరునకు నాలుగు సంఖ్యకు సంబంధించిన సంఖ్యలు అనగా 4, 13, 22, 31, 40, 49, 58 వగైరా వచ్చిన వారును యే నెలలోనైనా 4, 13, 22, 31

తేదీల్లో జన్మించినవారును నాలుగు సంఖ్యకు సంబంధించిన వ్యక్తులుగా పరిగణింపబడుతున్నారు. ఈ సంఖ్యకు కూడా సూర్యుడే అధిపతి. అని కొందరి అభిప్రాయం. అందుచేతనే ఒకటి సంఖ్యవారికి, నాలుగు సంఖ్యవారికి మధ్య మైత్రి బాగా ఉంటుంది. నాలుగు సంఖ్య అంతగా అదృష్టకరమైన సంఖ్య కాదు. కాబట్టి యీ తేదీల్లో పుట్టిన వారు తమ పేరునకు ఒకటి సంఖ్యకు సంబంధించిన సంఖ్య వచ్చేలాగున మార్చుకోవడం మంచిది. పట్టుదలకు, శ్రమ మీద విజయానికి యీ సంఖ్య చిహ్నం.

5. ఈ సంఖ్యకు బుధుడు అధిపతి. తమ పేరునకు అయిదు సంఖ్యకు సంబంధించిన సంఖ్యలు అనగా 5, 14, 23, 32, 41, 50, 59 వగైరా వచ్చిన వారును యేనెలలోనైనా 5, 14, 23 తేదీల్లో జన్మించినవారును అయిదు సంఖ్యకు సంబంధించిన వ్యక్తులుగా పరిగణింపబడుతున్నారు. చాతుర్యానికి, హాస్యానికి, సూక్ష్మబుద్ధికి యీ సంఖ్య చిహ్నం.

6. ఈ సంఖ్యకు శుక్రుడు అధిపతి. తమ పేరుకు ఆరు సంఖ్యకు సంబంధించిన సంఖ్యలు అనగా 6, 15, 24, 33 42, 51, 60 వగైరా వచ్చిన వారును యే నెలలోనైనా 6, 15, 24 తేదీల్లో జన్మించినవారును ఆరు సంఖ్యకు సంబంధించిన వ్యక్తులుగా పరిగణింపబడు తున్నారు. కళలకు, విలాసాలకు, సుఖాలకు యీ సంఖ్యచిహ్నం.

7. ఈ సంఖ్యకు కేతువు అధిపతి. తమ పేరునకు ఏడు సంఖ్యకు సంబంధించిన సంఖ్యలు అనగా 7, 16, 25, 34, 43, 52, 61 వగైరా వచ్చిన వారును యే నెలలోనైనా 7, 16, 25 తేదీల్లో జన్మించినవారును ఏడు సంఖ్యకు సంబంధించిన వ్యక్తులుగా పరిగణింపబడు తున్నారు. ఈ సంఖ్యకు కూడా చంద్రుడే అధిపతి అని కొందరి అభిప్రాయం. రెండు సంఖ్యకు సంబంధించినవారికి, యేడు సంఖ్యకు సంబంధించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. ఏడు సంఖ్య ఆకర్షణకు, కార్య దక్షతకు, వేదాంతానికి చిహ్నం.

8. ఈ సంఖ్యకు శని అధిపతి. తమ పేరునకు ఎనిమిది సంఖ్యకు సంబంధించిన సంఖ్యలు అనగా 8, 17, 26, 35, 44, 53, 62 వగైరా వచ్చిన వారును యే నెలలోనైనా 8, 17, 26 తేదీల్లో జన్మించిన వారును ఎనిమిది సంఖ్యకు సంబంధించిన వ్యక్తులుగా పరిగణింపబడుతున్నారు. ఈ సంఖ్య చాలా అరుదుగా యోగిస్తుంది. కాబట్టి యెనిమిదవ తేదీన పుట్టిన వ్యక్తులు తమ పేరుకు మరొక మంచి సంఖ్య వచ్చేలాగున తమ పేరును మార్చుకోవడం మంచిది. వ్యర్థ ప్రయత్నాలకు యీ సంఖ్య చిహ్నం. విజయం చాలా అరుదుగా లభిస్తుంది.

9. ఈ సంఖ్యకు కుజుడు అధిపతి. తమ పేరునకు తొమ్మిది సంఖ్యకు సంబంధించిన సంఖ్యలు అనగా 9, 18, 27, 36, 45, 54, 63 వగైరా వచ్చిన వారును, యే నెలలోనైనా 9, 18, 27 తేదీల్లో జన్మించినవారును తొమ్మిది సంఖ్యకు సంబంధించిన వ్యక్తులుగా పరిగణింపబడు తున్నారు. ఉద్రేకానికి, పౌరుషానికి, అభివృద్ధికి యీ సంఖ్య చిహ్నం.

—మహేష్ ●



# క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు

అనువాదం: తిరుమల రామచంద్ర

## చంద్రప్రభుడు దానవుడుగా మారిన కథ

చంద్రప్రభుడు మొదలయిన వారంతా తమ అనుచరులతో పాటు పాతాళ గృహం చేరారు. పాతాళ గృహం చంద్రప్రభుడు ప్రవేశించగానే, అతని తేజస్సుకు మరింత ప్రకాశించింది. పాతాళం చేరగానే మయుడు ఈ విధంగా అన్నాడు:

"మీరంతా ఇక్కడ దానవరాజుల దేహం వంటి వజ్రకఠినమైన దేహం పొందండి. అప్పుడు ఈ దేహం చాలా బలం కలిగి వుంటుంది, ప్రత్యేకమైన ప్రతి పనిని చేయగలుగుతుంది. ఇక్కడ ఉనికితో ప్రాణాలు ఎప్పుడూ సందేహంగా వుంటాయి. మరొక ఉనికిలో స్మృతి ఉంటుంది. ఈ దేహ పరావృత్తి అనేది చంద్రుని చుట్టూ ఉన్న ఆవరణలు వంటివి. పూర్వకర్మ వాసనను బట్టి ఈ శరీరధారి ఒక ఇంటి నుంచి మరొక ఇంటికి వెళ్లినట్లు దేహాంతరం పొంది శుభాశుభ కర్మలు అనుభవిస్తాడు. స్వదేహంతో గాని, దేహాంతరంతో గాని ఈ జీవి నశించడు. అలా నశించేట్లయితే, గోదానం, స్వర్ణదానం మొదలయిన దానాల ఫలభోగం ఎక్కడిది? అందువల్ల, రాజా, నీవు జపధ్యానమయమైన యోగం ఇప్పుడు అనుష్ఠించు. జపమనేది భోగ ప్రాప్తికి, మోక్ష ప్రాప్తికి, సంకల్ప సిద్ధికి కల్పవృక్షం వంటిది.

"పూర్వం జపం చేసి మహాసిద్ధి పొందిన ఒక జపరాయణుని కథ చెబుతాను. ఒకానొకప్పుడు కాలకుడనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు జపపరాయణుడు. అతడు అలాగే సంవత్సరాల కొద్దీ జపం చేస్తుండగా, ప్రజాపతి అయిన బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకో మన్నాడు. కాని, కాలకుడు నిశ్చలంగా జపం చేస్తూ, నాకు జపమే కావాలన్నాడు. మరే వరమూ అక్కర లేదన్నాడు. ఇతర వరాలేవీ కోరనందున అతని జపం మాహాత్మ్యం పెరిగింది. ఇంద్రుడు మొదలయిన దేవతలు భయపడి పోయారు. అతని జపానికి విఘ్నం చేయడానికి సంకల్పించారు. కాని, అతని జప ప్రభావాగ్నికి తపించిపోయారు. అందరూ కట్టకట్టుకుని అతని ఎదుటికి వచ్చి నిలబడి అడిగారు. వరమేదైనా కోరుకోమని. కాని, అతడు తన పట్టుదల వదల లేదు. అయితే, వారు అతనిని మరొకచోటికి వెళ్లి జపించుకోమని కోరారు. అతడు వారి ప్రార్థన మన్నించి చల్లని హిమాలయానికి వెళ్లితే, దేవతలకు అంత వేడి కలుగదని హిమాలయానికి వెళ్ళి ఒక గుహలో జపం చేయ సాగినాడు.

"కాలకుడు అక్కడ తపస్సు చేస్తూ వుంటే బ్రహ్మ ప్రేరణతో ఇక్ష్వాకు నరపతి అతని వద్దకు వచ్చి, "బ్రాహ్మణుడా, నా వరం తీసుకో. లేకపోతే నా కన్నా వరం ఇవ్వు." అనా డు. కాలకుడు అభిమానధనుడు. నేనే నీకు వరమిస్తాను అని ఇక్ష్వాకు మహారాజుతో అన్నాడు. అతని మాట విని రాజు 'నీ జప ఫలంలో సగం నాకు ఇవ్వు?' అన్నాడు. అన్నాడే కాని, సహస్రాంశుడయిన సూర్యుని కులంలో, పుట్టానే! నా చేయి ఇదివరకు పైనే వుందిగాని కింద లేదు. ఇప్పుడు సిగ్గు విడిచి యాచకుణ్ణి ఎలా కావడం?' అని సంతాపం పొందాడు.

"అప్పుడు, అక్కడికి దారిని పోయే ఇద్దరు బ్రాహ్మణులు వచ్చారు. వారు అంతవరకు ఒక విషయమై వాదులాడుతున్నారు. అతనిని తీర్పిమ్మని కోరారు. 'మహారాజా, ఇతడు నా కొక ఆవును దానమిచ్చాడు. నేను అతనికి దానిని వెనక్కు ఇస్తానంటే, పొగరు పట్టినవాడు తీసుకోడంలేదు. నేను ఇవ్వడం న్యాయమా, కాదా నీవే చెప్పు" అన్నాడు. రెండవ బ్రాహ్మణుడు "ఇచ్చిన దానిని మళ్లీ తీసుకోగూడదు. అందువల్ల నేను తీసుకోను" అన్నాడు.

"ఇక్ష్వాకు ఆలోచించాడు. 'ఇచ్చేదానిని తీసుకోనివాడు దుర్నీతిపరుడు' అని న్యాయం చెప్పాడు. అప్పుడు దేవతలు 'రాజా, నీవు కూడా అలాటి దుర్నీతిపరుడివే కాదా! కాలకుడు తన జప ఫలంలో సగం ఇస్తానంటే తీసుకోకపోతున్నావే? ప్రతివాడూ పరులకు ఉపదేశించడంలో పండితుడే' అని దెప్పిపొడిచారు. దేవతల మాటలకు లొంగి అప్పుడు రాజు కాలక బ్రాహ్మణుని జపఫలంలో సగం దానం పుచ్చుకున్నాడు.

"రాజు అర్ధ జపఫలం పొందిన త్వరాత విమానంలో సురాసురులకు నమస్కారయోగ్యమైన ఎన్నడూ చ్యుతిలేని మంగళకరమైన స్థానం చేరాడు. ఇక్కడ కాలకుడు వ్యయమైపోయిన తన అర్ధ జపఫలాన్ని మరల జపం చేసి త్వరలో పూరించుకొని, అనంత తేజోనిధి అయ్యాడు.

"అందువల్ల, మహారాజా, నీవు కూడా ఉత్సా

మైన జపం చేయి. జపయోగంతో దుర్లభ వస్తువులు లభిస్తాయి."

చంద్రప్రభ మహారాజా మయదానవుని మాటలు విన్నాడు. మంత్రులు, పుత్రుడు, రాణి కాంతిమతి మొదలయిన వారందరితో పాటు అసుర లోకం ప్రవేశించాడు. అక్కడ ఒక మహాకాయుడైన అసురుడు వెల్లకిలా పడుకొని వున్నాడు. ఆ సమీపంలోనే చంద్రప్రభుడు జపయోగం ప్రారంభించాడు. చంద్రప్రభుడు వాయువును స్తంభనం చేసి తన దేహం వదలి పక్కన వెల్లకిలా పడుకొని వున్న మహాకాయుని దేహంలో ప్రవేశించాడు. ఆ పడుకొన్న వాడు మయదానవుని కుమారుడైన సునీథుడు. ఏ కారణం వల్లనో సుషుప్త్యవస్థలో వున్నాడు. చంద్రప్రభుడు అతని దేహంలో ప్రవేశించగానే సునీథుడు నిద్ర నుంచి మేల్కొన్నవాడివలె లేచి కూర్చున్నాడు.

చాల కాలానికి బతికిన సునీథుణ్ణి చూచి మయుడు మొదలయిన దానవులంతా ఆనందించారు. మయుని భార్య లీలావతి నేత్ర కమలాలు సంతోషామృతంతో నిండాయి.

అప్పుడు మయుడు సూర్యప్రభునితో, అతని తల్లి కాంతిమతి ఎదుట ఇలా అన్నాడు—"రాజకుమారా, ఇతడు నా కుమారుడు సునీథుడు. చంద్రప్రభుడుగా జన్మించాడు. నీవు పూర్వం అతని తమ్ముడివి. పేరు సుముండికరుడు. సూర్యప్రభుని మంత్రులు మదించివట్టినారు మహోత్సుడు మొదలయినవారు. ఈ దానవులందరూ ఒక పని కోసం భూలోకానికి వెళ్ళారు."

మయుడు సూర్యప్రభునితో ఇలా మాట్లాడుతుండగా, బలిదైత్యుడు, ప్రహ్లాదుడు మొదలయిన వారితో పాటు సంతోషంతో అక్కడికి వచ్చి చేరాడు. దానవుల హితమే నిరంతరం ఆలోచించే శుక్రాచార్యుడు వచ్చాడు. అతనికి దానవులంతా తమ కిరీటరత్నకాంతులతో చిత్రవిచిత్రంగా మెరిసిపోయే తలలు వంచి నమస్కరించారు. తర్వాత అందరూ, వారి వారి అర్హతలను బట్టి రత్నపీఠాలు అలంకరించారు. సూర్యప్రభుని విజయం గురించి మంతనాలు జరిపి, యుద్ధసన్నాహాలు ఆలోచించారు.

ఆ సమయంలో ఇంద్రుడు పంపగా నారదుడు అక్కడికి వచ్చాడు. నారదునికి దానవరాజు అతనికి ఆదరంగా స్వాగతమిచ్చాడు. నారదుడు ఇలా అన్నాడు:

"ఇంద్రుని మాట మీరంతా వినండి. మాకు మీతో చిరకాలంగావున్న పగ ఇప్పుడు చల్లారింది. ధర్మయుక్తమైన పదవి, పరిస్థితి ఏర్పడ్డాయి. ఈ పరిస్థితిలో శత్రువులు మిత్రులుగాను మిత్రులు శత్రువులుగాను అవుతారు. కాలం మారిపోతే, సర్వమూ మారిపోతుంది. మన వైరం చల్లారి చాల కాలమైంది. మనం పొందవలసిందేమీ లేదు. పరస్పరం స్నేహంతో వున్నాము. అకారణంగా ఇప్పుడు మనకు పోట్లాట ఎందుకు?

"విద్యాధరపతి అయిన శ్రుతశర్మ ప్రస్తుతం దేవతలవైపు వున్నాడు. అతనిని మీరు జయించడానికి పూనుకున్నారు. ఈ సూర్యప్రభుడు మానవ మాత్రుడు. శ్రుతశర్మ ఖేచరుడైన విద్యాధరపతి. సూర్యప్రభుని పక్షాన మీరు లేకపోతే, అతనికీ, శ్రుతశర్మకూ స్పర్ధ ఎలా కలుగుతుంది? దానవశ్రేష్ఠులు సురులతో దానంతట అదే ఒక విధమైన ఐకమత్యం—ఏకభావం—ఏర్పడింది. మానవ మాత్రుల స్వార్థంతో దీనిని నాశం చేయకండి."

నారదుని మాటలు దానవులు విన్నారు. వీరుడు, దానవశేఖరుడుఅయిన బలి ఇలా అన్నాడు:—"భగవాన్, మీరు చెప్పినదంతా నిజం. సందేహం ఏమీలేదు. ఇంద్రుడు వృత్రాసురుణ్ణి చంపిన వాడనే సంగతి లోకానికి తెలియనిదా? మనం పరస్పరం ఎంత ప్రీతితో నతో ఉన్నదీ వామనునికి తెలుసు. మన పగకు కారణం ఇప్పుడు పూర్తిగా పోయినదన్నదీ నిజమే. మీ సంపద మీకు ఎప్పుడూ మాత్రం సుఖం కలిగించలేదు? విద్యాధర చక్రవర్తి మీ పక్షం చేరి తన సంపదను అనుభవిస్తున్నాడన్న సంగతిలోను ఎవరికీ మరొక అభిప్రాయం లేదు.

"అయితే, సూర్యప్రభుని అభ్యుదయం కోసం, దేవదేవుడైన త్రిలోచనుడే పూనుకున్నాడు. దేవతల

ఐశ్వర్యమంతా అతని ఇచ్ఛా మాత్రం వల్లనే కలిగి వచ్చేది కదా! మేము, ముక్కంటి అనతితో సూర్య ప్రభుని హితానికి పూనుకున్నాము. అందువల్ల దేవతలకు అప్రియం చేసినట్టా? శచీపతి అయిన ఇంద్రుడు, అజ్ఞానంతోనో, ఐశ్వర్య మదంతోనో, పొరపాటుతోనో అనాలోచితంగా ఏదో మాటలు చెప్పి పంపితే, ఎవరి మనస్సుకు తాకుతాయి? మహర్షీ, మీకే శివుని ఆజ్ఞ తెలుసు కదా! దీని ఆంతర్యం ఆలోచించి, ఏది ఉచితమో మీరే సెలవీయండి."

బలి చక్రవర్తి మాటలకు నారదుడు ఏమీ సమాధానం చెప్పలేకపోయాడు. మౌనంగా వెళ్ళిపోయాడు. సూర్యప్రభుడు దానవులు సకలోపచారాలూ చేస్తుండగా, సుఖంగా దానవలోకంలో వున్నాడు.

మయాది దానవులంతా చాలా కాలంగా ఒక చోట కలుసుకున్నారు. కనుక గొప్ప విందులు వినోదాలలో కాలం గడిపారు. పెక్కుయోజనాల మేర గుంపులు గుంపులుగా చేరారు. రంగురంగుల మాంసాలు, స్వచ్ఛమైనవి— జాంగలం, శూలం, కుక్కుటం, మొదలయినవి వండారు. పెక్కుకూరలు అమూల్యమైన ఓషధులు కలిపి వండారు. తెల్లని శాల్యన్నం, నేయి సిద్ధమయాయి. పెరుగులో లవంగపు పట్ట, ఏలకులు, కుంకుమపువ్వు, కర్పూరం వేసి, గుమగుమలాడే ఖాండవమనే రసాయనం చేశారు. ఊరుగాయలు, పచ్చళ్ళు, మండిగలు, మోదకాలు, మొదలయిన భక్ష్యాలు వండారు. పానకాలు, మార్జితాలు, చక్కెర వేసి చిక్కగా కాచిన పాలు సిద్ధమయాయి. దానవులు ఈ భక్ష్యభోజ్య లేహ్య చోష్యాలూ ఆరగించి చందనం అద్దుకుని, పూల దండలు వేసుకొని, మేడ ఎక్కి, పరస్పరం తాంబూలాలు పుచ్చుకొని, వేసుకొంటూ, కర్పూరం, అగరు ధూపంతో పరిసరాలన్నీ సుగంధంతో గుమగుమలాడుతుండగా, దానవ వనితల నృత్యం చూచి, ఆనందించారు. ఆ నృత్యం నయనానందకరంగా వుంది. నృత్యానుగుణంగా వేణువీణాది వాద్యాల మేళవమూ ఆనందం కలిగించింది.

ఆ వినోద సమయంలో దానవ కన్యలు సూర్యప్రభుణ్ణి చూచి, మోహం పట్టలేక, మన్మథ బాధ తట్టుకోలేక అతని వద్దకు వచ్చి, స్మరభిక్ష వేడారు. సూర్యప్రభుడు నీతి తప్పనివాడు. వారిలో ఏడుగురిని, వాళ్ళ తండ్రులు నియమ పూర్వకంగా వివాహ విధితో దానం చేయగా స్వీకరించాడు. వారిలో ఒక్కతె హలీలుకుని కుమార్తె కలావతి. మరొకతె ప్రహ్లాదుని కుమార్తె పిల్లలేడి కన్నులది మహల్లిక. ఇంకొకతె దురారోహుని కుమార్తె కుముదిక. వేరొకతె తంతుకచ్ఛుని కుమార్తె మనోవతి. తర్వాత, బలిచక్రవర్తి కుమార్తె, సంపూర్ణ చంద్ర వదన అయిన సుందరి. వీరిని, మరికొందరు సుందరాంగులను సూర్యప్రభుడు పరిణయమాడి, వారితో క్రొత్త క్రొత్త సుఖాలు అనుభవించాడు.

కొంతకాలం ఇలా సుఖంగా గడిచింది. మయుడు విజయ యాత్రను అతనికి జ్ఞాపక పరిచాడు. సూర్యప్రభుడు మయునితో పాటు పాతాళలోకం నుంచి భూలోకానికి బయలుదేరాడు. విజయ యాత్రకు సన్నాహం చేయదలచి దారిలో కశ్యపాశ్రమం చేరాడు. దితి, అదితికి, దనువుకు, తపోనిధి అయిన కశ్యపునికి నమస్కారం చేశాడు, వారి ఆశీర్వాదాలు పొందాడు.

కశ్యపముని ఆశ్రమంలో మయుడు, సూర్యప్రభుడు వున్న సంగతి విన్నాడు ఇంద్రుడు, కశ్యపుని ఆశ్రమానికి వచ్చాడు. అతడు భుజావిడి అనించి పట్టుకున్న వజ్రాయుధం కాంతులకు భుజాలకు పెట్టుకున్న అంగదాలు మరింత మెరిసిపోయాయి. కశ్యపునికి నమస్కరించాడు. కాని, మయుణ్ణి చూడగానే కోపంతో మండిపోయాడు. "మా పక్షంలో వున్న వీరుడు శ్రుతశర్మకు అహితం తలపెడతావా? ఎన్నిసార్లు వద్దన్నా కుటిలత మించిపోయి వినకుండా వున్నావు." అంటూ, కోపంతో వజ్రాయుధం ఎత్తి మయునిపై విసరడానికి దానిని అలాగ చేతితో తడిమినాడు.

ఇంద్రుడు అంతగా కోపంతో మండిపడినా, మయుడు ఎంత మాత్రమూ మనోవికారం లేక మందహాసం చేస్తూ వున్నాడు. కశ్యపుడు, అతని భార్య ఇంద్రుని అసభ్య ప్రవర్తనను నిందించారు. ఇంద్రుడు, వారి మాటలు విని వజ్రాయుధాన్ని ఉపసంహరించుకున్నాడు. అంత సంరంభం కలిగినా మయుడు జంకుకొంకులూ లేక తియ్యగా మాట్లాడుతూ ఒక్కనవ్వు నవ్వాడు. ఇంద్రుడు స్వర్గానికి తిరిగి వెళ్ళిపోయాడు. మయుడు కాశ్యపముని వద్ద ఆయన భార్య వద్ద శ్రేష్ఠమయిన వరాలు పొంది, సూర్యప్రభునితో పాటు ఇరావతీ చంద్రభాగా నదీ సంగమ స్థలం చేరాడు.

అక్కడ చేరగానే, సూర్యప్రభునికి మహాశ్చర్యం, దుఃఖం కలిగాయి. తన ప్రియురాండ్రను శత్రువర్గం వారెవరో అపహరించారనే అప్రియవార్త విన్నాడు. ఆ వార్త అతనిని అగ్నిలాగ దహించింది. అప్పుడు మయుడు చిరు నవ్వు నవ్వుతూ, "వత్సా, వారేమో శత్రువుల చేతుల్లో పడ్డది నిజమే. నీ జయం కోరేవాడిని గనుక నేను మాయతో వారిని శత్రువుల బారి నుంచి తప్పించాను." అంటూ, వారిని అతనికి అప్పగించాడు.

సూర్యప్రభునికి చాల ఆనందమయింది. తన ప్రియురాండ్రను మహోత్కంఠతో కలుసుకొన్నాడు. వారితో పాటు తన రాజధానికి చేరి సుఖసంపదలు అనుభవించాడు. ఆ రాజపుత్రికలకు, దైత్యకాంతలకు కూడా పుత్రులు కలిగారు. ఆ పుత్రులు తమ కులాచారానుగుణంగా శౌర్యం, సంపదలు, గుణాలు పొందారు. ఆ పుత్రులలో రత్నప్రభుడనే వాడు జనానికి చాల ఇష్టుడు. అతనికి సూర్యప్రభుడు పట్టం కట్టాడు. నిశ్చింతగా విద్యాధర పతి శ్రుతశర్మ విజయానికి సైన్యం ఆయత్తం చేసుకొన్నాడు. తన సామంతుల కందరికీ విచిత్రమైన విద్యలు ఇచ్చాడు. మయుడిచ్చిన భూతాసన మనే విమానం ఎక్కి, ప్రియురాండ్రతో పాటు, సామంతులతో పాటు బయలుదేరాడు.

(ఇంకా వుంది)

## బి. డి. ఆర్, కరీంనగరు

పి. యు. సి. తప్పి మళ్లీ చదువు తున్నాను. నాకు ఆలోచన ఎక్కువ అను కుంటాను. చదువు తలకెక్కడంలేదు. నాకు ఆయుర్వేద మెడిసను చదవాలని ఉంది. చదువుతున్నది ఆపి కొత్తది ప్రయత్నించ వద్దంటారు నా బంధువులు...ఆలోచనలను అరికట్టేమార్గం సూచించండి.

బుర్ర ఉన్న ప్రతివాడికీ ఏవో ఒక ఆలోచనలు వస్తూనే ఉంటాయి. పరీక్షకి చదవడం కోసం ఎటొచ్చీ వాటిని అదుపులో పెట్టుకోవాలి. మీ విషయంలో అది కుదరదు — ఎందు కంటారా? చదివే చదువుమీద ఇష్టంలేదు కనుక. మద్రాసులో జి. సి. ఐ. ఎమ్. కోర్సులు ఉన్నాయి. మన పక్క విషయం నా కాట్టే తెలియదు. వాకబు చేసి హాయిగా కొత్తగా మీ కిష్టం అనుకుంటున్న ఇండియన్ మెడిసెన్‌లో చేరండి. అదేనా శ్రద్ధ పెట్టి చదవక తప్పదు. ఎవరికేనా సరే కృషిని పట్టే ఫలితం.

## ఒకసోదరి, నిజామాబాదు

నాముఖంపై సన్నని వెంట్రుకలు వచ్చు చున్నవి. ఎన్నిమందులు వాడినా పోవడం లేదు. ఏదైనా చెప్పకలరా?

పసుపూ నలుగుపిండీ పెట్టి నలుగు పెట్టే అలవాటులేని యువతులకీ బెడద తప్పదు. నలుగు పెట్టితే పోతాయి. అప్పుడు పోకపోతే ఏ 'హ్యూమిస్' రాయితోనో, ఏస్రిఫెంచితోనో ఫలితం కనబడు తుంది. చూడండి.

## ఆర్. ఎమ్. ఎన్, విశాఖపట్నం

నేను ఒకరిని ప్రేమించాను. కాని పెద్దలు అంగీకరించడంలేదు. ప్రేమించ డం కూడా చెడ్డపనా?

ఆర్థికంగానూ, ఇతరత్రానూ పెద్దలపై పూర్తిగా ఆధారపడే వారు నిజానికి వాళ్ల నడిగే ప్రేమించాలి మరి! ప్రేమించి పెళ్లి చేసుకుంటే ఆ పెళ్లానికి మల్లె పువ్వులకి పది పైసలు ఇమ్మని తండ్రి నడగవలసిన స్థితిలో ఉంటే— అప్పుడు— ప్రేమించడం చెడ్డపనే. ప్రేమించడానికే కాదు— బ్రతకడానికి కూడా స్వేచ్ఛ కావాలి.

## ఎమ్. ఎన్, పెద్దాపురం

గడచిన గాఢాంధకారములను తలచు కుని క్షణక్షణము మధనపడే మగువ మనసు ఒకతోవలో పెటా లంటే ఏం చేయాలి?

వంచిన నడుం ఎత్తకుండ పనిలో నిమగ్న మయితే సరి!..... వెలుతురు వచ్చినా గతించిపోయిన చీకటినే జ్ఞాపకం చేసుకుంటూ కుమిలే వారి కదే మందు.




## ప్రకాష్, కర్నూలు

దేశము అభివృద్ధి చెందుటకు ఈనాటి విద్యార్థుల కర్తవ్యము ఏమిటి ?

తమ పని తాము చేసుకోవడం— అదే చదువు! అనవసర విషయాల జోలికి పోయి అందరి నోటా పడ్డం మినహా ప్రయోజనం శూన్యం. మీ పేరున సంఘ విద్రోహకులు బరి తెగించడం మినహా— సంఘానికి లాభం ఉండదు. ఏ పని చేస్తున్నప్పుడు ఆ పని— అన్న సూత్రం మీద విద్యార్థుల కర్తవ్యం కాలేజీలో ఉన్నంతవరకూ చదవడం. నలుగురితో కలసి మసలడం నేర్చుకోవడం వరకే.

## ఎమ్. ఆర్. ఆర్, కాళహస్తి

ప్రేమించిన అమ్మాయిని వివాహం ఆడక, పెద్దలునిశ్చయించిన అమ్మాయిపై ఇష్టంలేకుండా వివాహం ఆడితే వారి దాంపత్యం ఎలా ఉంటుందండీ ?

మహారాజులాగా ఉంటుంది! మనలో నూటికి తొంభయి పెళ్లిళ్లు యిష్టం మినహా అన్నీ కుదిరాయిని జరిగేవే!

## ఎ. ఎన్. వి. ఎల్. ఎన్, మైసూరు

మీర్వ్రాసిన అవతలిగట్టు చదువు తూంటే విసుగువచ్చింది. 'ఇవేమిటీ వింత భయాలు ?' వగైరా మాటలు పదే పదే వ్రాయిడంలో మీ ఉద్దేశ్యం ఏమిటి?

ఆ నవల వ్రాసిన రోజుల్లో నాకు అభ్యుదయ కవిత్వం పిచ్చి! అంతేకాదు. రైల్లో కూర్చున్న ప్పుడు మనం మనస్సులో ఏదైనా ఒక మాట గాని రైమ్ గాని అనుకుంటే రైలు చక్రాలు అదే మ్రోగిస్తాయి— ఈసారి ఎక్కినప్పుడు చూడండి. అదీ నేను పదేపదే వ్రాయడానికి కారణం. ఇక నా రచనలు కొన్ని బాగున్నాయి' కొన్ని విసుగొచ్చాయంటే నేను బాధ్యురాలినా ? "అందరూ" మెచ్చేలా వ్రాయడం ఎవరితరం?

## ఎమ్. ఆర్. బి. బండముండ (ఒరిస్సా)

మాంగల్యమే స్త్రీకి ఆభరణము అయి నటువంటి భారత స్త్రీ ఆ మాంగల్య మునకు విలువనిచ్చుట లేదు. అది వారి ఫాషనా? నామోషియా?

ముస్లిము వనితలు, క్రైస్తవ వనితలు ఏం మాంగల్యం ధరిస్తున్నారు— నల్ల పూసలూ రింగూ. అలాగే హైందవులకి మంగళసూత్రాలు. వాటిలో ఎన్నో రకాలు..... అలాంటప్పుడు మాంగల్యం తీసేస్తున్నారంటే ఎలా?.... అయినా మన సులో ఇవ్వాళి గాని వివాహానికి విలువ మాంగల్యంలో ఉందా !

## జి. ఆర్. ఆర్. భువనేశ్వర్

నేటి ఆధునిక రచయిత్రులలో ఎవరి రచనలు ఎక్కువగా మీకిష్టం? మాఊరు రచయిత్రి డి. కామేశ్వరి రచనలపై మీ అభిప్రాయం ఏమిటి?

నేను అందరి రచనలూ చదువుతాను— యుద్ధ నపూడి చదివిస్తుంది. ముప్పాళ కట్టి పడేస్తుంది. ద్వివేదుల వర్ణన లామె కామేపాటి అనిపిస్తుంది...... ఎందర్నని చెప్పను?.... ఇక మీ వూరు రచయిత్రి కామేశ్వరి కేం! మాటల పొదుపుతోనే చక్కని కథానికలు వ్రాసింది. ఆమె 'కొత్తనీరు' ఇంకా చదవలేనట్టుంది మీరు!

## జి. ఎన్, విజయవాడ

స్త్రీ ప్రేమించిన వానిని కాదని మరొకర్ని పెళ్లాడుతుంది. తన ప్రియుడే తనని కాదని మరొకర్ని పెళ్లాడితే అసూయతో కాగిపోతుంది—ఎందుకని?

ఎందుకనేమిటి స్త్రీ కనుక. తనని కాదన్న వారిని లొంగ తీయాలని ఉండడం, తనని కోరుకున్నవాణ్ణి ఆడించడం ఆడదాని నైజం. అందుకే ఎప్పుడూ తనపై అధారిటీ చేయ కల్గిన పురుషుణ్ణి అభిమానించినట్టు మెతకవాణ్ణి అభిమానించ లేదు.

## పి. ఎన్. కె. కాకినాడ

మా కుర్రాడు పదేళ్లవాడు పిల్లులని, కుక్కలనీ ఎక్కడా కనబడనీయడు. తరిమి తరిమి కొడతాడు, రాళ్లు విసురుతాడు. ఈ దరిద్రపు అలవాటు ఎలా పోకొట్ట డం?

నోరులేని జంతువులకి నొప్పి అధికం అని తల్లి అయిన మీరు నయానా భయానా నచ్చ చెప్పాలి.

దీపావళి కదల పోటీలో రెండవ బహుమతి రు. 1500 లు పొందిన కద

# గాజుకిటికి

రంగధామ్

విందు ముగిసింది, అతిధులొక్కక్కరే రామారావుగారి దగ్గర సెలవు తీసుకుంటున్నారు.

డాబామీద వెన్నెల్లో జరిగిన విందవడంవలన కాబోలు, అతిధులు వెళ్లిపోతూంటే, ప్రియురాలిని తెల్లవారుఝామున వదిలిపెట్టి ప్రియుడువెళ్లినప్పుడు ఆ యువతి మొహంలో తాండవించే తృప్త్యనురాగాల మధ్య ఒంటరితనంలా, ఆ విందు జరిగిన ప్రదేశంలో కాళీ, మెల్లగా ప్రవేశిస్తోంది.





అతిథులకు భోజన పదార్థాలు సమృద్ధిగా అమర్చబడ్డట్లు, టేబిళ్ల మీద ప్లేట్లలో మిగిలిన పదార్థాలను చూస్తేనే తెలుస్తుంది. ఆ డాబామీద నుంచి దూరంగా సముద్రం కన్పిస్తుంది. ఊళ్లో దూరంగా వెలుగుతున్న లైట్లూ కన్పిస్తాయి.

అటు పట్టణం యొక్క నాగరికతనిలో తళుకు బెళుకులూ, ఇటు ప్రకృతియొక్క గంభీరసౌందర్యం రెండు అందుబాటులోనే వుంటాయి. దేనిని కోరుకునే వ్యక్తి దానిని చూసి ఆనందించవచ్చు. నోటికందిచ్చిన అమృతమయమైన పదార్థాలనూ, కంటికి లభ్యమైన సుందరదృశ్యాలూ కూడా విస్మరించి, కబుర్లు కలబోసుకుని ఆనందించే బాతాఖానీ ప్రియులకు కూడా అది బ్రహ్మాండమైన విందే!

రామారావుగారు ఊళ్లో పలుకుబడిగల వ్యాపారస్థుడు కాబట్టి, అతనిచ్చిన విందులో, పురప్రముఖులు చాలామంది పాల్గొన్నట్లు, ఆ డాబాముందు చీమల బారులా నిల్చిన కార్లే ప్రత్యక్షసాక్ష్యం. విందయ్యాక ఒక్కొక్కటే, అంబాసిడర్, డాడ్జి, చివర్‌లెట్, స్టాండర్డు, స్టూడీబేకర్ మొదలైన రకరకాల కార్లు కదిలిపోతూంటే, ధనికులలో కూడా ఇన్ని తరగతులా అని ఆశ్చర్యం వేస్తుంది. అటు కార్లు కదిలిపోతున్న ధ్వనిగాని, ఇటు సర్వర్‌లు టేబిళ్లను శుభ్రం చేస్తున్న శబ్దంగాని, దూరంలో సముద్రపు హోరులోని అవ్యక్త సంగీతంగాని, దగ్గరలో మైకులోని పాటలుగాని, ఏవీ లెక్కచెయ్యదగినవి కానట్లు, ఇద్దరు వ్యక్తులు, డాబామీద ఒకమూల కుర్చీలలో కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్లమెదడులకు కావలసినంతమేత దొరికింది. ఇతర్లమీద చెప్పుకునే కబుర్ల ముందు ఎన్నిస్వీట్సుతో చేసిన విందైనా దిగదుడుపే, వాళ్లిద్దరకూ.

'నే చెప్పానా, వాళ్లిద్దరి మధ్యా పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుందని.' అన్నాడు తన తెలివితేటలనేకాక పళ్లని కూడా బయట పెడ్తూ, వాళ్లిద్దరిలో, ఒకాయన; ఆయన పేరు శీనయ్య; వయస్సు ఏభై దాటింది; నల్లగా బొద్దుగా వుంటాడు, పంచెకట్టు కట్టి, నల్లకోటు తొడిగి, తలపాగా చుట్టి, నుదుట బొట్టుపెట్టి 'అర్థడాక్సు' ప్లీడరు ఆయన అజీర్ణ రోగంవల్ల విందులోని పదార్థాలనంతగా అరగించలేకపోయినా, విందుకు వచ్చిన అతిథుల గురించి విషయాలు ముచ్చట్టించుకోవడంతోనే, అతనికీ, అతనితోటి వ్యక్తికీ కడుపు నిండిపోయింది.

'ఇంతకుముందు విన్నానుగాని, ఇద్దరిలోనూ అంతంత కావేషాలు పెరిగాయని ఎరుగను' అన్నాడు. సత్యంగారనే రెండవ వ్యక్తి ఆయన వయస్సుకూడా ఏభై దాటింది. బాగా ఆస్తివుంది; కోర్టు వ్యవహారాలంటే చెవికోసుకునే ఆసక్తి వుంది; సన్నగా, ఎర్రగా వుంటాడు. గ్లాస్కో పంచెమీద సిల్కు లాల్చీ వేస్తాడు

'ఇంతా అంతాకాదు. జయరావుని ఎలా పడగొట్టాలా? అని శివరావు వెయ్యి విధాల ప్రయత్నిస్తూ, అహర్నిశలూ ఆలోచిస్తూంటాడు. శివరావుని ఎలా అణగద్రొక్కాలా? అని జయరావు చూస్తూంటాడు. వృత్తిలో పదేళ్లనుంచి వీళ్లకి బలే పోటీగావుంది'

'అసలు జయరావునుగురించి నా కంతగా తెలియదు కాని, చాలా గర్విష్టి అని విన్నాను' అని సత్యంగారు మరికొన్ని వివరాలకోసం ఎరవేశారు.

'అది గర్వంకాదులే, మనిషి మొత్తానికి మంచివాడే. చాలా పట్టుదలగలవాడున్నూ కష్టపడికూడా పనిచేస్తాడు; వాళ్లనాన్న పెద్ద ప్లీడరు. చాలాడబ్బు సంపాదించాడు. ఆయన ఈ వూరు వచ్చేసరికి ఆయనకీ ఈ కొడుకు వున్నాడుగాని భార్యలేదు. గిరిధరరావుగారు, కొడుకుని గారాబంగానేకాక మంచి పద్ధతులలో పెంచాడు. ఆయనకు సాంప్రదాయంయందు ఎంతో గొప్ప గౌరవం వుంది. చనిపోయిన తనభార్య ఆత్మ ఏ మాత్రమూ దుఃఖించకుండా వుండాలని ఎంతో జాగ్రత్తగా మెసిలేవాడు. కొడుకు విపరీతమైన మాతృభక్తి కలిగి వుండేటట్లు పెంచాడు. జయరావు రోజూ కోర్టుకి వచ్చేముందు, తల్లి ఫొటోకి నమస్కరించి, ఆమె ఆశీర్వాదం పొందినట్లు వూహించుకుని మరీ బయల్దేరుతాడు.'

'అబ్బా! చెప్పుకోదగ్గ విషయమేమిటి'

'అంతేకాదు, తన తల్లి ఆదర్శ స్త్రీ అనీ, తండ్రి ఆదర్శ పురుషుడనీ అతని నమ్మకం'.

సత్యంగారు వశనంగా పరధ్యానంగా తలూపారు శీనయ్య ఆయనవైపు చూశాడు. ఏమిటాలోచిస్తున్నారన్నట్లు. రామారావుగారు చాలామంది అతిథుల్ని సాగనంపేసి, కొంతమంది సరదాగా పేకాడుకుందామంటే, అందుకు తగిన ఏర్పాట్లు చేయిస్తున్నారు. ఒక మూల ఆఖరి వరకూ వేచి వుండవలసిన సేవక బృందం యొక్క భోజనాలవుతున్నాయి. సత్యంగారు, కొంచెం నిదానంగా, 'మరి శివరావు చరిత్ర ఏమిటి?' అని అడిగారు.

'మీకు తెలియదా? ఈ వూళ్లో చాలామందికి తెలుసునే ఆ విషయం'

'ఆ...అదే...ఎవరికో ... పుట్టాడని...'

'ఎవరికో ఏమిటి, భోగందానికి పుట్టాడని. అందుకే శివరావు దగ్గరెవరైనా అతని తల్లిదండ్రుల విషయం ఎత్తుతే, ఛర్రుమంటాడు'

'తల్లి ఎవరో తెల్సుగాని.... తండ్రి ఎవరైనా కావచ్చు'

'అదా రహస్యం! అందుకే జయరావు అప్పుడప్పుడూ 'రెస్పెక్టబుల్ ఫామిలీ' అని చెణుకులు విసరడం దానికి శివరావు మండిపడడం జరిగింది విందులో.'

'శివరావు అంటే జయరావు చూపించే నిరసనా శివరావు కళ్లల్లో జయరావు వైపు చూసినప్పుడు మండే మంటలూ, వాళ్లలోని మత్సరాల్ని చాటి చెప్తూనే వున్నాయి.'

'అంతేకాదు, శివరావు, కొంతమంది ముందర జయరావు అంతు చూస్తానని ప్రతిజ్ఞ చేశాడు. అతనొక రౌడిలా వుండేవాడు, చిన్నతనంలో. ఇప్పటికీ మనిషి వస్తాదులాగ వుంటాడు. మొహంలో క్రూరత్వం పుట్టిపడుతూ వుంటుంది. ఆ



ఉంగరాల జుట్టే లేకపోతే, ఆ నల్లని పొడుగాటి విగ్రహం చూసి, పగలే చంటి పిల్లలు జడుసుకుంటారు.' అని శివయ్య అన్నాడు.

'జయరావులో నాజూకుతనం, దర్జా ఉట్టి పడుతూంటాయి. పచ్చని పండు తమలపాకు లాంటి శరీరచ్ఛాయా, సన్నని మనిషీ, అతని మాటలలోని సౌమ్యం, నడతలోని సౌజన్యం ఎవరినైనా ఇట్టే ఆకర్షిస్తాయి. అందుకే అతను అంత త్వరగా పబ్లిక్ ప్రాసిక్యూటరు అయ్యాడు. వయస్సు కూడా చిన్నదిలాగే వుంది.'

'ఆ ముప్ఫై ఎనిమిది వుండచ్చు. శివరావుకి కూడా దగ్గరదగ్గర అంతే వుంటుంది.'

ఇద్దరూ ఒకసారి తమ చుట్టూ పరిసరాలు పరిశీలించారు. పేకాటకు జోరుగా ప్రయత్నాలు సాగుతున్నాయి. వీళ్లిద్దరికి అందులో ఉత్సాహం అంతగా లేదు. క్రింది వాళ్లలో చాలా సంఖ్య తగ్గిపోయినా, ఇంకా కొన్ని అక్కడక్కడ వున్నాయి రామారావు



గారూ, పోలీసు సూపరెండెంటూ, మాట్లాడుకుంటూ డాబా మెట్లవద్ద నిల్చున్నారు.

ఆకాశంలో వెన్నెల, మనుషులలో ఇతరుల తప్పుల్ని ఎంచేటప్పుడు వివేకం వెల్లి బడ్డట్టు, క్రమంగా వెల్లబడుతోంది.

'పాపం జయరావుమాటలు శివరావుని బాగా కలవర పర్చాయి' అని సత్యంగారన్నారు.

'తల్లి వ్యభిచారైతే ఆ సంతానానికి సంఘంలో తగిన గౌరవం లభించదు అని జయరావు గట్టిగా వాదించాడు' అని శివయ్యగారు అందించారు.

'ఆ మాటలు తన నుద్దేశించి అన్నవేనని గ్రహించి, శివరావు మొహంలో చూపించిన 'ఫీలింగ్సు' నే నెప్పటికీ మర్చిపోలేను. కళ్లు ఎరుపెక్కాయి. శరీరమంతా చిన్న వణుకు వచ్చింది. మొహంలో క్రోధం ఉట్టిపడ సాగింది. ఆ ఆవేశంలో. 'ప్రతి స్త్రీ పతివ్రత అని నమ్మడం ఎలా? ఆమె రహస్య వ్యవహారాలు ఇతరుల కెలా తెలుస్తాయి ?' అని ఒక చిన్న లెక్చరు దంచాడు.'

'మొత్తానికి రామారావుగారు కలుగజేసుకోనక పోతే వ్యవహారం చాలావరకూ వెళ్లేదే. ఆయన శివరావుని ఏదో వనుంధని మెల్లిగా అవతలికి తీసికెళ్లి అతనిలో ఆవ్రదేకం తగ్గేదాకా ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పి ఆ ధోరణినుంచి మళ్లించాడు.'

'అవునవును' అన్నారు సత్యంగారు.

'అయినా జయరావుకి అంత అహంభావం పనికిరాదు. తన తలిదండ్రులు ఆదర్శమూర్తులైనంత మాత్రాన, ఇతరుల్ని అవమానించాలని ఎక్కడుంది ? శివరావు తల్లి వ్యభిచారైతే పాపం అతనేం చెయ్యగలడు ? బురదలో పుటినంత మాత్రాన తామరపువ్వు విలువ తగ్గిందా' ?

'అవునయ్యా, పునుగూ, కస్తూరీ మొదలైన సుగంధ ద్రవ్యాలు ఎక్కడనుంచి ఉద్భవించాయి. వాటి జన్మస్థానం నీచమైనంతమాత్రాన వాటికి గౌరవం తగ్గిందా?'

'అందులోనూ 'క్రాస్ బ్రీడ్' వల్ల పుట్టినవాళ్లు చాలా తెలివైన వాళ్లవుతారంటారు. ఏమంటారు...అహ్హహ్హ' అని యిద్దరూ నవ్వుకున్నారు.

వాళ్ల కబుర్లు అంతమయ్యేసరికి, ఊరినిండా అప్పులుచేసి పరారైన ఆసామిలా, చంద్రుడు ఆకాశంలో మాయమయ్యాడు. డాబామీద నాలుగు టేబిళ్ల మీద పేకముక్కలు చకచకా పంచబడు తున్నాయి. డాబామీద ఎలక్ట్రిక్‌లైట్లు చుట్టూ చీకటిని మరింత స్పష్టం చేస్తున్నాయి.

ఇద్దరూ మెల్లిగా లేచి, రామారావుగారి వద్ద సెలవు తీసుకుని, బయట పడ్డారు. వాళ్ల ఇళ్లు అక్కడికి దగ్గరే కాబట్టి నడిచే వెళ్లదల్చారు. సత్యంగారు సిగరెట్టు మీద సిగరెట్టు వెలిగిస్తూనే వున్నారు. శివయ్యగారికా దురలవాట్లు లేవు. ఇద్దరూ కొంతదూరం మౌనంగా నడిచాక శివయ్య, 'వీళ్లిద్దరిమధ్యా స్పర్థ ఇంకా పెరుగుతుంది. ఇద్దరిలో ఎవరో ఒకరు పూర్తిగా నాశనమయ్యేదాకా ఆగదు.' అన్నాడు.

సత్యంగారు మెల్లిగా, 'నా వుద్దేశంలో శివరావు గట్టి పన్నాగం పన్నుతాడు.





# పురోగతిని బట్టల యుత్పత్తిలో 322 సంవత్సరాల పారంపర్యంతో కలిపేదెవరు?

## మేము



అన్నారు.

'అవునవును శివరావు ఏలాగైనా ఉద్దండ పిండం. ఎంతైనా 'క్రాస్‌బ్రీడు' కదూ. అద్భుతమైన తెలివితేటలుంటాయి. అహ్హహ్హా'. అని శీనయ్య నవ్వాడు.

'మరేమరే క్రాస్‌బ్రీడంటే మాటలా?' అహ్హహ్హా' అని ఇద్దరూ నవ్వుకుంటూ, తమ ఇళ్ళవైపు నడకలు సాగించారు. చుట్టూ చీకట్లు వాళ్ళని మింగేశాయి. మనిషిని సంఘం అడుగడుగునా విమర్శించి సాధిస్తూనే వుంటుంది. సంఘంలోని విమర్శనాశాఖ కధిపతులు శీనయ్యా, సత్యం.

*　　*　　*

శివరావు మనస్సు పగబట్టిన త్రాచులా బుసకొడుతూ కాటేసే అవకాశంకోసం ఎదురు చూస్తోంది. జయరావుకీ తనకీ మధ్య స్పర్ధ పెరిగి అయిదారేళ్ళవుతోంది. అవకాశం దొరికినప్పుడల్లా జయరావు తనని అవమానిస్తూనే వున్నాడు. తన చదువుగురించిగాని, రూపం గురించిగాని, డబ్బుగురించిగాని, మరే విషయంగురించైన తన నవమానిస్తే, అంత బాధపడేవాడు కాదు. కాని తన పుట్టుకగురించి అవమానిస్తే అందుకేమీ జవాబివ్వలేని నిస్సహాయ స్థితిలోపడి విపరీతమైన మనోవేదనకు గురయ్యేవాడు.

# గాజు కిటికీ

తనపుట్టుక నీచమైనదని తనను నీచంగా చూస్తే తనేం చెయ్యగలడు? తన తల్లిని తను ఎంచుకోలేడుగదా! తన తల్లిచేసినపనికి తనను సంఘం శిక్షిస్తేనూ, జయరావులాంటివాళ్ళు అవమానిస్తేనూ తను తలవంచుకోవడం తప్ప ఏం చెయ్యగలడు? తన తల్లిపేరు ఆవూళ్ళో ప్రతి వెధవ నోట్లోనూ నలగడమే! అది చెవిలో పడ్డప్పుడల్లా తేలు కుట్టినంత బాధపడేవాడు.

చిన్నతనంలో తనవెవరైనా తల్లిగురించి ఎత్తిపొడిస్తే, వాళ్ళని చావగొట్టేవాడు, తోటిపిల్లలైతే. తన కండబలంతోనూ, పొగరుమోతు తనంతోనూ ఎదుటివాళ్ళ నోరు మూయించాలని చూశాడు. కానీ పెద్దయినకొద్దీ, కేవలం రౌడీజం లాభం లేదని, సంఘంమీద కసితీర్చుకోవడానికి న్యాయశాస్త్రం బాగా తెలియాలని, న్యాయశాస్త్రం అభ్యసించాడు. తను కాలేజీలో చదివినప్పుడూ, న్యాయవాదిగా పేరొందినప్పుడూ, అంతగా ఎవరూ తననవమానించాలని చూడలేదు. కొన్ని సంవత్సరాలు తను తిరిగిన వాతావరణంలో ఆ ప్రసక్తే రాలేదు.

వయసులో రక్తపు బలిమివల్ల అణిగి వుండే రోగాలు వయసు మళ్ళినవెంటనే బయటపడ్డట్లు, శివరావు కొత్త పేరుగల వకీలుగా వృద్ధిచెంద నారంభించేసరికి ప్రజలనోళ్ళలో అతని పాతచరిత్ర నలగ సాగింది.

ఎప్పుడు ఎవరు పెట్టారో గాని అతనికి భోగం వకీలు అనే వాడుక పేరు కూడా వెలిసింది. కొత్తవాళ్ళూ, తెలియనివాళ్ళూ ఆ పేరు ఎందుకు వచ్చింది అని అడిగితే, వూళ్ళోవాళ్ళు, అతనొక భోగం దానికి పుట్టాడని, అందువల్ల అతనికా పేరు వచ్చిందనీ చెప్పారు. కానీ అవన్నీ అతని చెవిని ఎక్కువగా పడేవికావు. ఎందుకంటే, రెండు చేతులా డబ్బూ, మంచి పేరూ సంపాదిస్తూండడం వలన అతని ఎదుట అతన్ని కించపరిచే మాటలనడానికి ఎవరికీ సాహసం వుండేదికాదు.

ఆ పని జయరావు ప్రారంభించేసరికి, శివరావుకు ఒళ్ళుమండి పోయేది. జయరావు తనని చూసే చూపులో గౌరవం వుండేది కాదు. తనొక అంటరాని వాడన్నట్లు చూసేవాడు. దానికి మనసులో మథనపడి పోవడం తప్ప వేరే ఏమీ చెయ్యలేక పోయేవాడు.

ఒక రోజున బార్‌లో జయరావు ఎవరితోనో 'పిల్లలు సంసారికీ పుట్టారు, వ్యభిచారికీ పుట్టారు. కాని సంఘంలో ఇద్దరికీ ఒకే రకమైన స్థానం లభించదు. తల్లిదండ్రులిద్దరు బట్టే సంతానానికి గౌరవం లభిస్తుంది. మన కళ్ళముందే ఒక వ్యక్తి విషయం చూస్తున్నాం. వీధిలో అతన్ని ఏ పేరుతో పిలుస్తున్నారో వింటే ఆ విషయం స్పష్టవౌతుంది.' అంటూంటే తను విన్నాడు. అంత ప్రత్యక్షంగా తనను అన్నందుకు వెంటనే జయరావును ఏదైనా చేసేద్దామన్నంత కోపం వచ్చింది గాని, కొద్ది నిముషాలు అతికష్టం మీద తనను తాను అదుపులో పెట్టుకుని, తను ఏమైనా చేస్తే అనిందను స్వయంగా అంగీకరించి నట్లవుతుందని ఊరుకున్నాడు. ఒకరిద్దరు ఓరకంటితో తనను కనిపెడుతూండడం గమనించాడు. తను ఆ మాటలు విన్పించు కోనట్లు నటించాడు. కానీ ఆ రాత్రంతా గుండెల్లో అశాంతి తిష్టవేసుకుంది అతనికి.

ఎన్ని విధాల ఆలోచించినా తనను



సంఘం ఈ విధంగా శిక్షించడం చాలా క్రూరంగా కన్పించింది. స్త్రీ మాతృమూర్తి అవడానికి ప్రకృతి కారణ భూతం. అందుకు సంఘం ఆమె సంతానం పైన ఆదరణ చూపించే బదులు ఆంక్షలు విధించి వాళ్ళల్లో హెచ్చుతగ్గుల్ని నిర్ణయించడం అమానుషం. తన తల్లి వ్యభిచారిణి కావటం ఆమెది తప్పే. కాని ఎలాంటి పరిస్థితులలో ఆమె పతితురాలైందో విచారించే వారేరి? తన తల్లి తననెంత ప్రేమగానో చూసేది. తనేం కోరితే అది కొనిచ్చేది. తను ఎంత మారాం చేసినా భరించేది. అందరి తల్లులకన్నా తన తల్లే మంచిదనుకునే వాడు. తనామెను నానా బాధలూ పెట్టాడు. అయినా ఆమెలో ప్రేమ కించిత్తూ కొరవడలేదు. అటువంటి తల్లినీ ఆమెగన్న సంతానాన్నీ సంఘం హీనంగా చూస్తోందంటే, దానికి హృదయముందా?— అనిపిస్తుంది.

రెండునెలల క్రితం నెల్లూరు వెళ్ళిన రాయప్ప ఒక వింత వార్త మోసుకు వచ్చాడు. రాయప్ప శివరావు అంతరంగిక నౌకరు. పొడుగాటి మీసాలూ, గిరజాల జుట్టూ, వస్తాదులా వుంటాడు.

ప్రొద్దునే కాఫీ, ఫలహారం పూర్తిచేసి ఆఫీసు రూములో కూర్చున్న శివరావు అది వినగానే దిగ్భ్రాంతుడయ్యాడు. రాయప్ప, 'అవునుసార్! ఈ జయరావుగారి తల్లి బ్రతికే వుంది. నేను కొంత మందిని, డబ్బు ఆశ చూపించి, మరీ కనుక్కున్నాను. ముప్ఫైఏళ్ళ క్రిందట ఆ ప్రాంతాల్లో వుండిన వాళ్ళద్వారా తెలిసినదేమంటే, గిరిధరరావుగారి భార్య, జయరావుగారి బాల్యంలోనే, భర్తను వదిలిపెట్టి ఎవడితోనో లేచిపోయింది. తరువాత ఆయన ఆ వూరు వదిలిపెట్టి, ఈ వూరు వచ్చి ప్రాక్టీసు పెట్టారు. ఇక్కడి వాళ్ళెవరికీ ఈ సంగతి తెలియదు. జయరావుగారికసలే తెలియదు.' అన్నాడు.

'ఇది నిజమేనా?' అని ఖంగారుగా కుర్చీలోంచి లేచాడు శివరావు.

'ఎందుకు బాబూ ఆ ఖంగారు? ఎక్కడికి వెళ్తారు?'

'పద, నెల్లూరుకి వెళ్దాం. ఈ విషయం నేను స్వయంగా కనుక్కుంటాను'

'అంత శ్రమ అక్కర్లేదు. అన్ని



# శ్రీ వాణీ సాహిత్య క్రాస్‌వర్డ్ పజిల్ నెం. 15

Licensed by the District Collector Warangal. L. No.1 Dt. 8—10—67
(ఈ పజిల్ తాలూకు కీ సొల్యూషన్ జిల్లా కలెక్టర్‌గారి కార్యాలయములో సీలు చేయబడినది)

## రూ. 800 లు

పోటీచేసి గెలుపొందండి!

మొదటి బహుమతి రు 400 రైట్ అన్సర్
రెండవ బహుమతి రు. 250 ఒక తప్పుఆన్సర్
3 వ బహుమతి రు. 150 రెండు తప్పుల ఆన్సర్

నిఘంటువు : శబ్దార్థ చంద్రిక



ముగింపు తేది .-10-1968 నుండి
**1—11—1968** వరకు
పొడిగించడమైనది

### నెం. 15 ఆధారములు

**అడ్డము:-** 1. అత్యంత మనోజ్ఞమైన వివిధ శిల్ప సౌందర్య భంగిమలలో శతాబ్దాలుగా మన ప్రాచీన సంస్కృతినీ నాగరికతనూ ప్రతిబింబింప జేస్తున్న గుహారాజము. 3. రుగ్మత తొలగుటకై కొందరుదీన్ని సేవిస్తారు 6. మన ప్రాచీన తంత్రీ వాద్యము. 7 రెండు ఘడియల కాలము. 9. సభలలోనూ సమావేశాలలోనూ యీతని అభిప్రాయమే ఎక్కువగా చెలామణీ అవుతున్నదనవచ్చు. 12. సాధారణంగా చెట్లకు కాయలు వీటికి కాస్తాయి. 14. శాస్త్రవేత్తలు ధ్రువపరచిన అభిప్రాయ సారాంశమును యిలా అంటాము. 16. లేవడిలోనున్నవారికి మామూలురోజూ ఈరోజూ సమానమే నంటారు. 17. శివుని జటాజూటమునుండి భారతావనికి దిగి వచ్చిన స్రవంతీమతల్లి. 19. తామరతీగ. 20. మిత్రుడు. 21. పిల్లలు నేటికీ దీనితో వేటాడుటకద్దు. 22. పాలపిట్ట. 23. సాధారణంగా ఇది అందరి ఇండ్లలోనూ వుంటుంది.

**నిలువు:-** 1. ఇటువంటివారు పాలకులుగానున్న రాజ్యమందలి ప్రజలకు సుఖశాంతులుండవంటారు. 2. పువ్వు పుట్టుటతోడనే యిది వ్యాపిస్తుంది. 3. ఇది కలిగినవారికి ప్రబడునదే దానమవుతుంది. 4. అదృష్టహీనులకిది లభ్యము కాదు. 5. ఇది వున్న వారికి వేరే దుర్గుణ మెందుల కన్నారు పెద్దలు. 8. పొరుగింటికి యిది లేకుండా పోవుట అగౌరవముగా భావిస్తారు. 10. పసిపిల్లలకత్యంత ప్రియమైనది. 11. ఒక భూభాగంమీద దురాక్రమణ జరిగినప్పుడు సాధారణంగా యిది సంభవిస్తూంటుంది. 13. దీనికి పాలు పోస్తే విషముగా మారుట సహజముగదా! 15. ఆత్మ విమర్శలేనివారు దీనివెనుక నాటకమాడుతుంటారట. 16. మార్గము. 18. వేదములు మొదలైన మన ప్రాచీన గ్రంథములు వ్రాయుటలో నుపయోగింపబడిన భాష. 19. నాట్యము చేసే స్త్రీ. 20. రాజమార్గము.

కూపను ఒక్కంటికి ఒక్క రూపాయి మాత్రమే

బుజావులూ నేను సిద్ధం చేసుకునే వచ్చాను. ఆ మనిషి మీద ప్రస్తుతం మన వూళ్లోనే కేసు నడుస్తోంది.'

'ఏం కేసు? ఎవరి మీద?'

'ఈ మధ్య సలాం సాయెబు సారా కొట్టు దగ్గిర దొమ్మి జరిగింది చూశారూ. అందులో ఆ కొట్టు యజమానురాలి మీద కూడా కేసు పెట్టారూ, ఆ మనిషే జయరావు తల్లి.'

'ఛీ! ఛీ! సలాంసాయబు ఉంపుడుకత్తా? పచ్చి అబద్ధం!'

'అబద్ధం కాదు సార్. ఆ మనిషి ఇద్దరు ముగ్గురు చేతులు మారి చివరకు అయిదేళ్ల క్రితం సలాంసాయెబు చేతిలో పడింది. లేచి పోయిన దానికి వీడూ వాడూ అన్న వివక్షత ఏమిటి?'

'అయితే ఈ కేసు జయరావే నడిపిస్తాడు. మరో వారం రోజుల్లో విచారణ కొస్తుంది.'

'అవును సార్. జయరావుగారు క్రాస్ ఎగ్జామినేషన్ మొదలెట్టేసరికి బండారం అంతా బయటపడుతుంది'

నిప్పులు తొక్కిన కోతిలా శివరావు ఇటూ అటూ పచారు చెయ్యసాగాడు. శివరావు మనసులో ఏవేవో ఆలోచనలు పరిగెడుతూంటే, అంతలో ఒక్కసారి ఆనందంతో రాయప్పను కౌగలించుకుని, 'నువ్వు చెప్పిందే గనుక నిజమైతే మరి మనికి ఈ జయరావు పొగరణగించే అవకాశం దొరికినట్లే. నాకు నువ్వు మహోపకారం చేశావు.' అన్నాడు. తరువాత అతనిని వదిలి ఒక్కనిముషం ఆగి, 'కానీ, నేనిది నమ్మలేకుండా వున్నాను. ఇంత వైపరీత్యం వుంటుందా? ఉన్నా ఈ విషయం ఇన్నాళ్ళు దాగి వుంటుందా?' అని అడిగాడు.

రాయప్ప 'అది ఆశ్చర్యమే సార్ కాని ఆయన ఆ వూరువదిలి వచ్చెయ్యటం వలన అక్కడివాళ్లకు తరువాతేం జరిగిందో తెలియదు. ఇక్కడివాళ్లకు ఈయన పూర్వ చరిత్ర తెలుసుకునే ఉద్దేశం కలుగ లేదు. అందుకే కొడుకునికూడా, తల్లి చచ్చి పోయింది అన్న భ్రమలో పెంచాడు.' అన్నాడు.

'అవునవును. కానీ ఎంతమోసం! ఆ జయరావుగాడు తన చరిత్ర ఇంత అసహ్యమైనదని తెలుసుకోక, ఇతరులను వేళాకోళం చేస్తాడా? సరేకానీ! వాడిపొంగతి

# గాజు కిటికీ

నేను కనుక్కుంటాను. ఇంతటితో వాడి పరువు ప్రతిష్ఠలు గంగలో కలిసినట్లే. వాడికి తప్పకుండా ఈ శాస్తి జరుగ వలసిందే.' అని శివరావు తన మనసులోని అక్కసునంతా రాయప్పముందు వెళ్ళ గక్కాడు.

ఆ క్షణంనుంచీ శివరావు తన పగ తీర్చుకోవటానికి తగిన ప్రయత్నాలు ప్రారంభించాడు. సలాం సాయెబు కొట్టుదగ్గిర జరిగిన దొమ్మిలో ఎక్కువ సంబంధం లేక పోయినా వాళ్ళందరికీ సారాపోయించి దొమ్మికి పురిగొలిందని తాయారమ్మమీద నేరం మోపారు పోలీసువారు. తాయారమ్మకు తనకు సారాకొట్టు పెట్టినందుకు ఏదో జుల్మానా కోర్టువారు వేస్తారని తెలుసు. అది చెల్లించెయ్యడానికి సిద్ధంగానే వుంది. అది అప్పుడప్పుడు జరిగే విషయమే. సారా కొట్టుపెట్టడం, దొంగ వ్యాపారం చెయ్యడం, మొదలైనవాటిలో సిద్ధహస్తులైనవాళ్ళు అప్పుడప్పుడు పోలీసులు తమమీద కేసుపెట్టడం, ఏదో చిన్న జుల్మానాతో ఆ తతంగం పూర్తిచేసుకోవడంకూడా తమకు పరిపాటే. ఈసారి కూడా ఈ కేసులో తాయారమ్మ పాత్ర అంతే.

కాని అంతమాత్రంతో ఊరుకుంటే శివరావు ప్లాను నెరవేరదు. కేసులో తాయారమ్మపాత్ర కొంచెం హెచ్చు ప్రాముఖ్యత వహించాలి. క్రాస్ ఎగ్జామినేషన్‌లో తాయారమ్మ పాతచరిత్ర బయటపడాలి. అదివిని బార్ బారంతా దిమ్మెర పోవాలి. ఆక్షణంలో జయరావు మొహం తను చూడాలి. తరువాత ఊరు ఊరంతా జయరావు తల్లిగురించి చెప్పుకోవాలి.

ఆ అపనింద భరించి జయరావు బ్రతుకగలడా?

తాయారమ్మ అంతకుముందు కూడా కోర్టెక్కింది. కాని అప్పుడు ఆమె గత చరిత్రను ఎవరూ ప్రశ్నించలేదు. ఆమె ఎవరితోనూ తనగురించి చెప్పుకోలేదు. అందుకే ఆ రహస్యం అలా వుండిపోయింది. ఆవిడకు వయస్సు ఏభైఅయిదేళ్ళు. మనిషి పచ్చగా లావుగావుంటుంది. శివరావు ఆమెను అంతకుముందు ఒకసారి చూశాడు. ఆమె చాలా గంభీరంగా వుంటుంది. అంతగా ఎవరితోనూ మాట్లాడదు. అసలామెచేత ఆమె గత చరిత్ర చెప్పించడంకూడా అంత సులభం కాదు.

రాయప్ప ఈ రహస్యం కనుక్కోడానికి చాలా కృషిచేశాడు. అతనికి నెల్లూరులో ముప్ఫైఏళ్ల క్రితం గిరిధరరావుగారనే వకీలు వుండేవాడనీ, అతని పడుచు భార్య ఎవరితోనో లేచిపోయిందనీ, తరువాత ఆయన ఆవూళ్లో మేడనమ్మేసి, మరో వూరు వెళ్లిపోయాడని తెలిసింది. ఆ గిరిధరరావే విశాఖపట్నం వచ్చి అక్కడ స్థిరపడ్డాడనీ, అతనికొడుకే జయరావనీ నిర్ధారణ చెయ్యడం అంత కష్టమనిపించలేదు. కాని ఆ స్త్రీ తరువాతేమయిందో, ఎక్కడుందో కనుక్కోడానికి రాయప్ప చాలా కష్టపడ వలసి వచ్చింది. కొంత డబ్బు కూడా ఖర్చుపెట్టాడు. మొట్టమొదట ఆ వూళ్లో ఒక పైలరుతో లేచిపోయింది. అతనితో కొంతకాలం గడిపాక ఒక లారీ డ్రైవరుతో చాలా వూళ్ళు తిరిగింది. ఆ లారీ డ్రైవర్ని ఎంతో శ్రమమీద కలుసుకుని, ఆమె అతనిని వదిలేసి ఒక అరవ వాడితో కలిసి రాజమండ్రిలో హోటలు పెట్టినట్లు తెలుసుకున్నాడు రాయప్ప.

ఆ హోటలు కొన్నాళ్ళునడిపి మళ్లీ అకస్మాత్తుగా మాయమైంది. అక్కడినుంచి ఎక్కడికి వెళ్లిందో ఎవరికీ తెలియదు. తెలుసుకోవడానికి రాయప్ప రెండు వారాలు చాలావూళ్ళు తిరిగాడు. ఆఖరికి ఎలాగైతేనేం సలాంసాయెబు ఆమెను చేరదీసినట్లూ, వాళ్లిద్దరూ సారాకొట్టు పెట్టినట్లూ తెలుసుకున్నాడు. ఈ విషయాలన్నీ కోర్టులో బయటపెట్టించే పరిస్థితులు కల్పించాలని శివరావు పథకం వేశాడు.

దానికి నాందిగా తాయారమ్మ తరఫున తను వకాల్తా పుచ్చుకున్నాడు. ఫీజే మీ పుచ్చుకోనని ఆశపెట్టి మునుపు తేలిపోయినంత సులభంగా ఈ సారి కేసు తేలదనీ, ఈ సారి తాయారమ్మకు శిక్షపడే అవకాశం వుందనీ, బెదిరించసాగాడు. అందుకు తాయారమ్మ బెంగపడి పోలేదుగాని, ఎంత డబ్బు ఖర్చయినా, జైలు శిక్ష బదులు జరిమానా పడేటట్లు చూడమని అంది.

కోర్టులో చెప్పవలసిన విషయాలగురించి

# వీణా బ్యూటీ సోపు మీ చర్మానికి మరింత అందాన్నిస్తుంది

నిత్యమూ చర్మంగురించి శ్రద్ధతీసుకుంటే వర్చస్సు ఎంతో మనోహరంగా ఉంటుంది. మేలిక సౌందర్య పోషణ నిండు యౌవన శోభలోని సౌందర్యాతిశయాన్ని, మృదుత్వాన్ని రాణింప జేస్తాయి.

స్వచ్ఛమైన, పట్టులాగా మృదువైన చర్మం కలిగి ఉండడంలో మీకు తోడ్పడేందుకూ, మీ వర్చస్సు మరింత యౌవన శోభతో మనోహరంగా రాణించే లాగా చేసేందుకూ వెస్కో మీకు వీణా బ్యూటీ సోపును అందజేస్తుంది. తమ వర్చస్సును అమూల్యమైనదిగా ఎంచేవారికి ఆనందప్రదమైన, మంచినురుగును నిచ్చే వీణాను మించి మేలు చేకూర్చేది మరొకటిలేదు. ఇది రోజంతా నవనవ లాడుతూ ఉండేలాగా చేయగల మనోహరమైన సువాసనలతో నిండినది.




## వీణా
బ్యూటీ సోపు




తయారుచేయువారు :

**సేఠ్ నాగ్‌జీ పురుషోత్తమ్ & కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్**

పి. బి. నెం 36
కోజికోడ్-1.

పి. బి. నెం 3254
బొంబాయి-3

25/84 సుబ్బయ్య
మొదలియార్ స్ట్రీట్
కోయంబత్తూరు

38/20
మించిన్ స్ట్రీట్
కర్నూలు
(ఆంధ్రప్రదేశ్)

బోధపరచడానికి తాయారమ్మను ఒకనాటి సాయంకాలం తన యింటికి పిలిపించాడు శివరావు.

రిక్షాదిగి శివరావు ఇంట్లో ప్రవేశించిన తాయారమ్మ, హాలులోని ఫోటోలలో ఒకదానినిచూసి గతుక్కుమంది. తరువాత నాయన్న వచ్చి, శివరావు ఆఫీసుగదిలో వున్నాడని అక్కడికి తీసుకువెళ్ళాడు. ఆమెను చూచి శివరావు, తన ఎదురు కుర్చీలో కూర్చోమని సంజ్ఞచేశాడు. ఆమె కూచుంది.

'ఒక్క ముఖ్య విషయం చెప్పాలని పిలిపించాను పోలీసువాళ్ళు నిన్నొక 'మర్డర్' కేసులో ఇరికించాలని చూస్తున్నారు'

'హత్యా?' అని తెల్లబోతూ అడిగింది.

'అది చాలా రహస్యమైన విషయం. సుమారు ఎనిమిదేళ్ళ క్రితం ఆ ప్రాంతంలో ఒక హత్య జరిగింది. కాని హంతకుడెవరో పట్టుబడలేదు. మొన్నటి దొమ్మికేసులో అరెస్టుచేసిన కొంతమంది ద్వారా దాని సంగతులు కొన్ని బయట పడ్డాయి. దానితో నీకేలాంటి సంబంధం లేనట్లు ఋజువు చెయ్యడం అవసరం. నువ్వు సలాంసాయెబును కలుసుకొని అయిదేళ్ళయింది కదూ?'

'అవును'

'నీ భర్త లాయర్ గిరిధరరావు కదా? నీది అసలు నెల్లూరు కదా? నువ్వాయనను వదిలేసావు కదా?' తాయారమ్మ జవాబివ్వలేదు. శివరావు ఆమె వంక చూశాడు.

'ఇవాళ కాకపోతే రేపైనా కోర్టులో జవాబివ్వాలి తప్పదు' అన్నాడు కఠినంగా.

'ఆయన పేరు కోర్టుకీడవడం నా కిష్టంలేదు'

'అయితే నువ్వు చిక్కుల్లో ఇరుక్కుంటావు'. అని బెదిరించాడు.

కొద్దిసేపు వాదించింది గాని చివరకు, అవసరమైతే తన గత చరిత్ర కోర్టులో చెప్పేటందుకు అంగీకరించింది తాయారమ్మ. అందుకు చాలా చింతిస్తున్నట్లు ఆమె మొహం చెప్తోంది.

శివరావు 'ఇక నువ్వు వెళ్ళవచ్చు' అన్నాడు. తాయారమ్మ లేచింది, వెళ్ళడాని కుద్యుక్తురాలై. మళ్ళీ ఆగి, 'ఇందాకా ఇటు రాబోయి హాలులోకి వెళ్ళి ఒక స్త్రీ ఫోటో చూశాను. ఆ ఫోటో ఫ్రేము పెల్లది. ఆ వ్యక్తి నాకు బాగా తెలుసు. ఆమె మీకేమైనా అవుతుందా?'

# గాజు కిటికి

అంది.

'నీకెలా తెలుసు?'

'మాది పాత పరిచయం. ముప్ఫై ఏళ్ళకుపైగా గడిచినా, నేనామెను మర్చిపోలేను. ఆమెను ఒక్కసారి చూడాలి. ఆమెలాటి పుణ్యాత్మురాల్ని ఒక్కసారి కలుసుకుని మాట్లాడితే నాకు కొంత మనశ్శాంతి కలుగుతుంది;' అని నెమ్మదిగా అంది.

తన తల్లిని 'పుణ్యాత్మురాలు' అని ఒకరు, మొదటిసారిగా జీవితంలో, సంబోధించడం విని శివరావు దిగ్భ్రాంతుడయ్యాడు. 'ఆమె లేదు. చనిపోయి చాలా కాలమైంది.'

తాయారమ్మ కండ్ల వెంట నీళ్ళు గిర్రని తిరిగాయి. గద్గద స్వరంతో 'అయ్యో!' అంది. ఆమెలో ఒక్కసారిగా ముసలితనం బయటపడ్డట్లయింది. మెల్లగా, వంగిన నడుంతో తలుపు వైపు కదిలింది. కాని శివరావు, 'ఆమె గురించి నీకేం తెలుసు?' అని అడిగాడు.

కన్నీళ్ళు తుడుచుకుంటూ తాయారమ్మ 'అదొక విచిత్రగాథ' అంది. అని, 'సరే ఇక ఆమెకూడా లేదన్నమాట' అని పైకి ఒకసారి చూసింది. ఆమె చాలా బాధపడుతోందని గ్రహించిన శివరావు, 'ఆమె నీకెలాపరిచయమో చెప్పలేదు'. అన్నాడు.

'పోనీండి. ఇప్పుడావిషయాలు ఎందుకు?' అంది.

'చెప్పి తీరాలి లేకపోతే నాకు శాంతి వుండదు.'

'ఆమె నేనూ చిన్నప్పటి స్నేహితురాళ్ళం.' అని శూన్యంలోకి చూస్తూ ప్రారంభించింది. 'గిరిధరరావుగారు ఆమెను ప్రేమించి, వివాహం చేసుకుంటానని నమ్మించి మోసం చేశాడు. ఆమె కొకబిడ్డకూడా పుట్టాడు. ఆయన వివాహం నాతో జరిగిందికానీ నన్నేనాడూ ఆయన ప్రేమగా చూడలేదు. ఆయన ఆమెతోనే కాలం గడిపేవారు. ఆమెను నేను మొదట్లో చాలా ద్వేషించేదాన్నిగాని తరువాత ఆమె చాలా ఉత్తమురాలని తెలుసుకున్నాను.' అని ఆగింది.

'నువ్వు పొరబడ్డావు ఆ ఫోటోలోని స్త్రీ ఒకపతిత'. అన్నాడు శివరావు విచారంగా.

'కాదు. ఆమె నాకు బాగా గుర్తుంది. గిరిధరరావుగారిచేత మోసగింపబడ్డాక నెల్లూరు హాస్పిటల్‌లో ఒక మగబిడ్డను కని తరువాత ఈ ప్రాంతాలకే వెళ్ళాననీ, ఇక్కడ తమ బంధువులెవరో వున్నారని చెప్పింది. ఆమెపేరు రంగమణి.'

ఈసారి శివరావు నిశ్చేష్టుడయ్యాడు. 'పేరదే కాని, నాతల్లి వ్యభిచారి.' అని అరిచాడు గట్టిగా. ఆమె 'పొరబడ్డారు. లోకం ఏమైనా అనుకోనిగాక. ఆమె వంచిత. లోకంలో అనేక అపవాదులు వెంటబెట్టుగాక, ఆమె చాలా ఉత్తమురాలు. ఆమె పాదాలు సోకె అర్హతకూడా నాలాటి స్త్రీలకు లేదు' అంది ఆమె మొహంలో నిజం ప్రతిఫలింపజేస్తూ.

జీవితంలో తనతల్లిని ఎవరో పొగడడం మొదటిసారిగా వింటూన్న శివరావు ఉబ్బి తబ్బిబ్బవసాగాడు. పుట్టంధునికి, పడి వయస్సులో ఆపరేషన్‌చేసి డాక్టరు కళ్ళు తెప్పిస్తే, అతనికి మొదట్లో కనిపించిన వెల్తురుకి కళ్ళు మిరుమిట్లు గొల్పుతాయి; క్రమంగా ఆ వెల్తురు కలవాటు పడ్డాక, ఆ ప్రపంచం, ఆకాశం, సూర్యోదయం, చంద్రుడూ, సముద్రాలూ మొదలైన దృశ్యాలూ మనుషులూ కన్పిస్తూంటే, ఆవ్యక్తి హృదయం ఆనందంతో గంతులేసినట్లు శివరావులో సంతోషం పొంగసాగింది, ఆమె మాటలలో నమ్మకం కలిగాక.

ముని శాపంచేత రాయైపోయిన నాతి శ్రీరామపాద రజస్పర్శచేత మనిషిగా మారినప్పుడు ఆమెలో కలిగిన చైతన్యంలాటిది, శివరావు మనసులో కలిగింది.

ఆ ఉత్సాహంతో తాయారమ్మ చేతులు పట్టుకుని, 'నువ్వు నా పాలిట దేవతవు. ప్రపంచం అంతా తెగనాడుతున్న నా తల్లిని మంచిదని అంటున్నదానిని నువ్వొక్కర్తెవే కన్పిస్తున్నావు. నా తల్లి వ్యభిచారి అనీ, శరీరం అమ్ముకున్నదనీ అందరూ అనడం విన్నాను కాని ఇంత చక్కనిమాటలు ఎప్పుడూ వినలేదు' అన్నాడు.

అతని ఆనందంచూసి ఆమెలో జాలి కలిగింది. ఇద్దరూ హాలులోకివెళ్ళి ఆమె

ఫోటోముందు నిలబడ్డారు. తాయారమ్మ, 'స్త్రీ జీవితం బహు దుర్గమమైంది. అందులో ఏ మాత్రం లోపం జరిగినా లోకం ఇట్టే ఆమె మీద అపవాదులు వేస్తుంది. బహుశా ఆమె జన్మించిన కులంవల్లగానీ, ఆమెను ఇక్కడ ఆదరించిన వ్యక్తుల వలనగాని ఆ చెడ్డపేరు వచ్చి వుంటుంది. తన సర్వస్వం గిరిధర రావుగారి కర్పించిన సాధ్వి ఆమె' అంది.

తన జీవితం ధన్యమైనట్లు తోచింది శివరావుకి.

*        *        *

మర్నాడు సాయంకాలం కోర్టునుంచి తిరిగిరాగానే రాయప్ప, శివరావు నడిగాడు.

'ఏం సార్ ? కేసంతా అలా తేల్చేశారు తాయారమ్మచేత ఏమీ చెప్పించలేదు ?' అన్నాడు నిరుత్సాహ వదనంతో.

కోర్టు డ్రస్సు విప్పేసి మామూలు దుస్తులు వేసుకుని, రాయప్ప ఇచ్చిన కాఫీ కప్పు చేతో పట్టుకుని కుర్చీలో కూచున్నాడు శివరావు.

'రాయప్పా ! ఇన్నాళ్లూ పగ సాధించడం గొప్పదనుకున్నాను గాని, అంత కన్నా క్షమ అనేది ఇంకా గొప్పదని ఇవాళ తెలుసుకున్నాను' అన్నాడు.

'అయితే జయరావుగారి సంగతి అంతేనా ?' అని ఆశ్చర్యంతో అడిగాడు రాయప్ప.

'అతను గాజుకిటికీల వెనకాల నివసిస్తున్నాడు. ఏ నిముషంలో వాటిమీద ఎవరు రాయివేసినా అవి పగులుతాయి. నాకుమాత్రం నా మనసులోని బాధ తీరిపోయింది. జయరావు మాటలకు బాధపడే అవసరం పోయింది.' అని తల్లి ఫోటో వైపు చూశాడు.

'కర్ణుణ్ని సూతపుత్రుడు అని నిందించిన లోకాన్ని లెక్కచెయ్యక పోవడమే కాక, చివరిదాకా తను కుంతీపుత్రుణ్ణి అని ప్రకటించుకోక పోవడంలో ఎంత ఔదార్యం చూపించాడు కర్ణుడు !' అని శివరావు అంటూంటే రాయప్ప మౌనంగా తలూపాడు.

మహాభారత యుద్ధంలో కర్ణుడు ఆఖరి దశలో తన రథచక్రాన్ని పైకెత్తబోతూ ఒరిగిపోతున్న దృశ్యం ఇద్దరి మనసులలోనూ మెదిలింది. ●

ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి, ఆంధ్రసచిత్ర వారపత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥







# వారఫలం

## 25-10-1968 శుక్రవారం మొదలు 31-10-1968 గురువారం వరకు

**మేషం :** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యాపారాలు లాభించగలవు. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృషభం :** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిధునం :** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారంమధ్యలో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :** వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. పోటీవారితో మాట పట్టింపులు తగవు. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో అనుకోని చికాకులకు గురికాగలరు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**సింహం :** మీకు ముమ్మందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు ఫలిస్తాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది.

**కన్య :** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వ్యాపారంలో నూతన అవకాశాలు లభిస్తాయి. పోటీవారితో మాట పట్టింపులు తగవు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

**తుల :** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. నూతన వ్యవహారాలు శ్రమమీద ఫలిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం :** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం :** లాభం రావలసిన వ్యవహారాల్లో నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. విలాసాలకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారం మధ్యలో అనుకూల మైన మార్పులు వస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**కుంభం :** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మీనం :** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు ఫలిస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

— మహేష్

# దీపావళి జోకావళి

- బాబ్జి





















# ఇల్లిందల సరస్వతీదేవి

### జరిగిన కథ

సావిత్రమ్మ ఒక మధ్యతరగతి ఇల్లాలు. ఆమె భర్త రామనరసయ్య. పెద్దకొడుకు గోపీ వారాలు చేసుకుని పై వూళ్ళో 'యమ్మెస్' చదువుకుంటూ వుంటాడు. విధిలేక చిన్నవాడు మురళిని నరసింహానికి పెంపకం ఇస్తుంది. గోపీ తెలివి తేటల్ని గ్రహించి అతనికి తన ఇంటిలోనే వసతి ఏర్పాటు చేస్తాడు ప్రొఫెసరు. అతని కుమార్తె అనిత. అనిత ప్రవర్తన గోపీకి నచ్చదు. అనిత గోపీల సంబంధం గురించి ఆకాశరామన్న ఉత్తరం ప్రొఫెసరు పేర వస్తుంది. ఫలితంగా గోపీ ఆచోటు విడిచి పెట్టేస్తాడు.

## 4

'అమ్మా శంకరం ఏడీ? పొద్దుటినుండీ కనబడలేదు!'

వస్తాడులే. ఎక్కడికి వెళ్ళాడో? భోజనం వేళకు వాడే వస్తాడు'పనిలో మునిగిపోయింది సావిత్రమ్మ.

అందరి భోజనాలు పూర్తి అయి, వంట యింటి తలుపులు మూసేసరికి పన్నెండు దాటింది. కాని శంకరం రాలేదు. సావిత్రమ్మ అతడికొరకు ఎదురు చూస్తూ వాకిట తలుపు తెరుచుకుని కూర్చుంది. మూడు గంటలు కాగానే విమల కాఫీగ్లాసు అందించింది.

సాయంత్రము ఆరు గంటలకు శేషగిరి రామనరసయ్యా కలిసే ఇంటికి వచ్చారు.

'వాకిట్లో కూర్చున్నావేమిటి?' లోపలికి వచ్చాడు రామనరసయ్య.

'శంకరం పొద్దుటినుంచీ కనబడలేదండీ భోజనమయినా చెయ్యకుండా ఎక్కడ తిరుగుతున్నాదో?'

'పొద్దుటినుంచీ ఎవరికీ కనబడలేదా శంకరం! ఏం కమలా!'

'లేదు నాన్నా'

'చీకటి పడగానే వస్తాడులే' రామనరసయ్య పెరట్లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కునివచ్చి హాల్లో కూర్చున్నాడు.

సావిత్రమ్మ ఒకప్రక్క శంకరాన్ని గురించి ఆలోచిస్తూ కూరగాయల మళ్ళకు నీళ్ళ తోడి పోస్తున్నది. పిల్లలు కూరలేనిదే ముద్ద ఎత్తరు. ముఖ్యంగా మురళి పూట పూట కూరకోసం పేచీపెడుతూ ఉంటాడు. కూరలు కొనాలంటే ధరలు మండిపోతున్నాయి.

రాత్రి ఎనిమిది గంటలకు అందరి భోజనాలూ అయ్యాయి. శంకరంకోసం మధ్యాహ్నం ఉంచిన అన్నం విమల కమల పెట్టుకున్నారు. రాత్రి వండిన అన్నంలో నుంచి శంకరానికి మళ్ళీ ఎత్తిపెట్టారు.

పదకొండు గంటలవరకూ శంకరంకోసం ఎదురుచూస్తూ ఏదో మాట్లాడుతూ అందరూ కూర్చున్నారు. అందరి సంభాషణ గోపీ వైపు మళ్ళింది.

'అమ్మా. అన్నయ్య ఉత్తరమయినా వ్రాయటం లేదే?' వేదనతో అన్నది విమల.

'చదువు పెద్దది. తీరిక తక్కువ. మనకు ఉత్తరాలు వ్రాయకపోయినా క్షేమంగా ఉండి బాగాచదువుకుంటూ ఉంటే అదే పదివేలు' అన్నాడు రామనరసయ్య. ఆయనకు గోపీ విషయంలో అంతకంటె మాట్లాడటం ఇష్టము లేదు.

'ఈ సెలవుల్లోనయినా రాలేదేమమ్మా అన్నయ్య?' విమల మళ్ళీ ప్రశ్నించింది.

'వాడు తన చదువే ముఖ్యంగా భావించుకున్నాడు. పోనీ అక్కడే ఉండి చదువుకోనీ. మనకు కావలసింది పరీక్ష ప్యాసుకావటం. అంతేకదూ?' గోపీ విషయంలో ఇంకెవరూ మాట్లాడటం ఇష్టములేదు రామనరసయ్యకు. కూర్చున్న చోటినుంచి లేచాడు.

సావిత్రమ్మ గోడకానుకుని కూర్చున్నది. నిద్రవేళ కావటంవల్ల ఆవలింతమీద ఆవలింత వస్తోంది. శంకరంకోసం ఆదుర్దా పడుతున్న ఆమె మనసు మళ్ళీ గోపీమీదికి పరుగెత్తింది. ఎంత చదువుకుంటుంటే మాత్రం సెలవుల్లోనయినా ఇంటికి రాకూడదా? పరీక్షలయిపోయాయి. అక్కడేం చేస్తున్నాడు? డబ్బు పంపితే మనియార్డరు ఫారంమీద సంతకం తప్ప కార్డుముక్కయినా వ్రాయడే? వేదన పడుతున్న ఆమె మనసుకు మరుక్షణంలో ఊరట కలిగింది. ఎలాగో చదువు ముగిసిపోతే పడిన కష్టానికి ఫలితం చేకూరుతుంది. రామనరసయ్యకూడా నిమిషాలు లెక్కపెడుతున్నాడు.

ఒక్కొక్కళ్ళే నిద్రవస్తోందంటూ లోపలికి వెళ్ళి పడుకున్నారు. చివరకు సావిత్రమ్మ 'ఇంతకూ వీడేమయినట్టు?' అనుకుంటూ తలుపు వేసుకోవటానికి లేచింది.

మెల్లగా అడుగులువేస్తూ శంకరం లోపలికి వచ్చాడు.

*     *     *

కమల స్కూలునుంచి వస్తూ ఒక అమ్మాయిని తీసుకు వచ్చింది. విమల, కమల కొత్త స్నేహితురాలూ పెరట్లో బాదం చెట్టు దగ్గర చేరారు.

'నాకు కాన్వెంటులో సీటు దొరికిందోయ్. వచ్చేనెలనుంచీ నేను అక్కడే చదువుకుంటాను' ఆ అమ్మాయి చెప్పుకుంటూ పోతోంది.

'ఏం! ఈ స్కూలు బాగా లేదా? ఏమా యింటి దగ్గరేనా?' అన్నది విమల.

'దగ్గరేకాని ఆ స్కూలులో చేరితే కొన్ని లాభాలు ఉన్నాయి'

విమల ఆ అమ్మాయికి దగ్గరగా జరిగి ఆసక్తితో వినటం మొదలు పెట్టింది.

'నా స్నేహితురాలు నిరుటినుంచి అక్కడే చదువుతోంది. పాతస్కూల్లో ఉండగా ఒక్కొక్క క్లాసులో రెండేసేళ్లు చదివిన పిల్ల అక్కడ సులభంగా పరీక్ష ప్యాసయింది. ఈ సంవత్సరం ట్రైనింగయితే టీచరుగా ఉద్యోగం దొరుకుతుంది. ఎక్కడో కాదు. ఆ స్కూలు వాళ్ళే ఇస్తారు. నేనుకూడా అక్కడే చదువుకోవాలనుకుంటున్నాను. అది గాక ఆ స్కూల్లో పుస్తకాలు డ్రెస్సు ఉచితంగా ఇస్తారు. ఫీజు ఇవ్వక్కర్లేదు ఆ స్కూలులోనే హాస్టలు ఉంది. అక్కడ ఉంటూ చదువుకోవాలి. ఎప్పుడయినా పర్మిషను తీసుకుని ఇంటికి రావచ్చు.'

'అయితే శకుంతలా ముందు మనం ఒక రోజువెళ్లి అన్ని సంగతులూ మాట్లాడటానికి వీలవుతుందా?' కుతూహలంతో కళ్లు పెద్దవి చేస్తూ ప్రశ్నించింది విమల.

'వెళ్లి కనుక్కోవచ్చు. ఈపరీక్షలవగానే వెళ్లి తెలుసుకోవాలనుకుంటున్నాను. నీవు కూడా వస్తేరా. కలిసి పోదాము.'

విమల తన చదువుకంటె కమల చదువును గురించి ఎక్కువగా ఆలోచిస్తోంది. ఇంట్లో తల్లికి సహాయం చేయటానికి తను చదువు మానేసిందని అందరితో చెబుతోంది గాని అసలు సంగతి ఎవరికి అర్థమవుతుంది? పుస్తకాలకూ బట్టలకూ ఖర్చుపెట్టలేక మానుకుంది. కాని కమలను గురించిన బెంగపట్టుకుంది. తండ్రి కమలకు చదువు చెప్పించగలడా? మగపిల్లల చదువులే ఎప్పుడు ఏకారణంచేత ఆగిపోతాయో చెప్పటం కష్టంగా ఉంది. ఆ పరిస్థితిలో ఈ ఆడపిల్ల చదువేం సాగుతుంది? పోనీ — ఒక ఇంటిదాన్నయినా చేయటానికి ప్రయత్నం చెయ్యగలరా అంటే అది తలుచుకోవటానికయినా వీలుకాని సమస్యగా ఉంది. కట్నం ఇచ్చి పెళ్లి ఖర్చులుపెట్టి తండ్రి పెళ్లి చెయ్యగలడా? తండ్రిని చూస్తే ఏదీ అడగ బుద్ధిపుట్టదు. మాసికలు వేసిన చొక్కా తొడుక్కుని ఆయన తలవంచుకుని నడుస్తుంటే



చూసిన వాళ్లకు పుట్టెడు దుఃఖం వస్తుంది. శక్తికి మించిన ఖర్చులు. సంసారంలో కుత్తుక బంటిలో దిగబడిపోయి ఉన్నాడు. సంతోషం చచ్చిపోయింది. మాట్లాడమన్నా ముఖంలో నవ్వు కనబడదు. ఎంతో ఉత్సాహంతో ఏదో చెబుదామని ఆయనను సమీపించి, ఆవేదనా భరితమయిన ఆ ముఖంచూసి కళ్లనీళ్లతో వెనక్కు తిరిగిన క్షణాలెన్నో విమలకు జ్ఞాపకం వచ్చాయి. పోనీ—ఊరుకుందామా అంటే ఈ సమస్యలు తేలేది ఎప్పుడు? మగపిల్లల చదువులు కానీ అనుకుంటూ కూర్చుంటే ఎదుగుతున్న ఆడపిల్లల సమస్యలను గురించి ఎవరు ఆలోచిస్తారు? మగపిల్లల చదువుతోపాటు ఆడపిల్లల సమస్యలు కూడా తేల్చుకోవలసిందే. ఆడపిల్లలయినా మగపిల్లలయినా వయసునుబట్టి సమస్యా పరిష్కారం కావాలి. కాని తల్లిదండ్రులదృష్టి ఇంకా ఈ సమస్యలవైపు మళ్లినట్టు లేదు. లేక—తప్పుకుని తిరుగుతున్నారేమో! వాళ్లుకాక ఈ సమస్యలను గురించి ఆలోచించేది ఎవరు?

# జీవితవలయాలు

మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఇంట్లో పనులన్నీ పూర్తిచేసి పడుకోవటానికి పోతున్న తల్లికెదురుగా నిలబడ్డది.

'ఏం కావాలమ్మా? 'అలా నిలబడ్డావు?' అడిగింది తల్లి.

'శకుంతల గారింటికివెళ్లి ఒక గంటలో వస్తానమ్మా' ఆమెను సమాధానపెట్టి బయలుదేరింది.

అమాయకంగా ఏమీ తెలియనట్టుగా ముఖం పెట్టి స్కూలు సంగతులన్నీ అడుగుతున్న విమలతో ప్రిన్సిపాల్ చాలా ఓపికతో మాట్లాడింది. ఒక పిల్లను తోడుయిచ్చి స్కూలంతా చూసిరమ్మని పంపించింది.

నాలుగు ఎకరాల స్థలము. మధ్యగా పెద్దపెద్ద గోపురాలతో ఉన్న స్కూలు బిల్డింగును విమల తలెత్తి చూసింది. ఆమె హృదయము అనిర్వచనీయమైన ఆనందంతో నిండిపోయింది. ఎంతసేపు చూచినా తనివి తీరలేదు. బలవంతంగా అక్కడినుంచి కదిలింది. స్కూలుకు అనుబంధంగాఉన్న హాస్టలులోకి వెళ్ళారు. వంతులు ప్రకారం బోర్డింగులో ఉంటున్న పిల్లలు కొందరు వంట చేస్తున్నారు. కొందరు స్కూలు ఆవరణ నంతా ఊడుస్తున్నారు. కొందరు చెట్లకు నీళ్ళు పోస్తున్నారు. అక్కడ సమష్టిగా పనులన్నీ జరిగిపోతున్నాయి. ఏ ఒక్కరిమీద భారం లేదు. అక్కడ పనులన్నీ ఒక విచక్షణతో జరిగిపోతూ ఉండటం చూస్తే విమలకెంతో ముచ్చటయింది. ఈ పిల్లలందరిపైన ప్రతిపనీ సక్రమంగా జరుగుతున్నదీ లేనిదీ చూడటానికి ఒక వార్డెను ఉన్నది. విద్యార్థినులకు ఆమె పేరు వింటేనే సింహస్వప్నంలా ఉంది—భయభక్తులతో పనులు చేస్తున్నారు.

స్కూలుకు వెళ్లేటప్పుడు అక్కడి పరిస్థితులు ఎట్లా ఉంటాయోనని సందేహిస్తూ వెళ్లిన విమల అన్ని విషయాలను గురించీ వివరంగా తెలుసుకుని ఒక విధమయిన సంతృప్తితో ఇంటికి వచ్చింది. ఆ రాత్రి వాటిని గురించే ఆలోచిస్తూ పడుకున్నది.

ఆ కాన్వెంటు స్కూల్లో ఉచితంగా పిల్లలను చేర్చుకుని విద్య నేర్పటమే కాకుండా డ్రెస్సు పుస్తకాలూ కూడా ఇస్తున్నారే—వాళ్లకేం లాభం?

తను కమలతోకూడా కాన్వెంటులో చదువుకోవటానికి వెళ్లినట్టు—అందరితో కలిసి తోటలోపనీ, వంటయింట్లో పనీ చేసి బాగా చదువుకుంటున్నట్టు విమల తెల్లవార్లూ కలలు కన్నది. సంభ్రమాశ్చర్యాలలో తేలిపోయింది.

ఉదయము లేచేసరికి విమల మనసు చాలచురుకుగా ఉత్సాహంగా ఉన్నది. తల్లి చెప్పకముందే పనులన్నీ చేసింది. తల్లి చేతిలోనుంచి వళ్లెము అందుకుని తండ్రికీ శేషగిరికీ వడ్డించింది.

పసిపిల్లవాడు పోయిన తరువాత మురళికి గారాబము బాగా ఎక్కువయింది. తల్లినీ తండ్రినీ చుట్టుకు చుట్టుకు తిరుగుతాడు. ఒక అక్క నీళ్ళుపోస్తే ఒక అక్క తల తుడ్వాలి.

'కూర యింకా కొంచెం కావాలి' మారాము చేశాడు మురళి.

'కొంచెమే చేశాను. అయినా గిన్నె చూసుకో.'

మురళికి నమ్మకం కుదరలేదు.






# ఆంధ్రా కాఫీ యిండస్ట్రీ

## గుంటూరు

సమర్పించు

## దీపావళి

## శుభాకాంక్షలు



## జీవితవలయాలు

కంచంలో చెయ్యిపెట్టుకుని కూర్చున్నాడు.

'ఉంటే వెయ్యరాదమ్మా' రామనరసయ్య మజ్జిగ కలుపుకుంటూ విమల ముఖంలోకి చూశాడు.

'పెరట్లో ఉన్న పాదుకు నాలుగంటే నాలుగు కాయలు కాశాయి నాన్నా. వీడు కూరకావాలంటాడనే కోసుకు వచ్చి వేయించాను. ఆ నాలుగు ముక్కలూ వాడికే వేశాను.'

అరగంట తర్జనభర్జనలతో బ్రతిమిలాటలతో మురళి భోజనం ముగిసింది.

విమల కొంగుతో కన్నీళ్ళొద్దుకొంటూ తల్లిపక్కన భోజనానికి కూర్చున్నది.

* * *

రామనరసయ్య చెప్పినదంతా విని సావిత్రమ్మ 'దానిగొంతు అన్యాయంగా కొయ్యకండి. మనము పోషించకపోతే బిచ్చమెత్తుకునయినా బతుకుతుంది' మాట్లాడుతూ మాట్లాడుతూ వెనక్కు తిరిగింది.

'మాటమధ్యలో అట్లా కోపము తెచ్చుకుంటే నీవు సమస్యల నెట్లా పరిష్కరిస్తావు? నీ యింటి సమస్యలను గురించయినా నీవు ఆలోచించ గలిగావా?'

'ఇది సమస్యలను గురించి ఆలోచించటమా? నా తల్లి బంగారు బొమ్మ. అట్లాంటి సంబంధం చెప్పటానికి అసలు నోరెట్లా వచ్చింది?' సావిత్రమ్మకు ఉక్రోషం వచ్చి ముఖం ఎర్రబడిపోయింది. ముక్కుపుటాలు ఎగరటం మొదలుపెట్టాయి.

'ఆయన చెప్పించని కాదు. నీవు నిదానంగా ఆలోచించు. మొదట నేను చెప్పేదంతా విను. మనమ్మాయికి ఎక్కడయినా సంబంధం ఉంటే చూసించమని మా ఆఫీసులో పనిచేసే రమాకాంతరావుని అడిగాను. ఆయన మేనమామల ఊళ్ళో ఉన్న సంబంధాన్ని గురించి చెప్పాడు. హనుమాయమ్మగారికి నాలుగు వందల ఎకరాల భూవసతి ఉన్నదట. పెనిమిటి పోయిన నాలుగు నెలలకు పుట్టిన కొడుకును కళ్ళల్లో వత్తులు వేసుకుని పెంచుకుంటుండగా మూడో ఏడు వచ్చీ రాకుండానే పక్షవాతమువచ్చి కాళ్ళు పడిపోయాయి. అయినా తెలివి తేటలకూ చురుకుదనానికీ లోపం లేదు. అందుకు తగినట్టు భారీ విగ్రహము. కూర్చున్నచోటికే టీచర్లను పిలిపించి చదువు చెప్పించింది. ప్రైవేటుగా చదివి బి. యే. ప్యాసయ్యాడు. టైపు నేర్చుకున్నాడు. పిల్లసగ్రోవి వాయిస్తాడు. చేతులమీద జరుగుతూ ఇల్లంతా పాకుతాడు. ఒక నడక తప్పించితే అతడికేం లోటు చెప్పు?'

రామనరసయ్య అరగంటసేపు సావిత్రమ్మ ఏమంటుందోనని ఆగి చూశాడు. ఆమెవంచిన తల ఎత్తలేదు.

'హనుమాయమ్మగారు తన కొడుకును బాగా చూసుకునే పిల్ల పేదయింటిదయినా సరే కోడలిగా స్వీకరిస్తానంటోందట. ఆ యింటికి కోడలిగావెళ్ళిన పిల్ల అన్ని విధాలా సుఖపడుతుందని రమాకాంతారావు అంటాడు. హనుమాయమ్మగారు పిల్లనుపువ్వుల్లో పెట్టి పూజిస్తుంది. ఆ అబ్బాయి అంతకంటె ఎక్కువగా దేవతగా చూసుకుంటాడు. అమ్మాయి నోరువిప్పి విప్పకముందే కోరికలన్నీ తీరుతూ ఉంటాయి. మనకు పెళ్ళికి ఒక దమ్మిడీ ఖర్చులేదు. అన్ని ఖర్చులు ఆమె భరించి దేవుని సన్నిధిలో వివాహం చేస్తుంది. ఇంతకంటె ఏం కావాలి చెప్పు?'

'ఏం కావాలి!' వెక్కిరించినట్టుగా అన్నది సావిత్రమ్మ. 'దానికేం కావాలో మీకెట్లా తెలుస్తుంది? కూర్చున్న చోటినుంచి లేవలేని ఆ అవిటివాడికిచ్చి నా బంగారు తల్లి జీవితంలో నిప్పులు పోస్తారా?' సావిత్రమ్మ విసురుగా లోపలికి వెళ్ళిపోయింది.

రామనరసయ్య ఆ సంబంధాన్ని అంతటితో విడిచిపెట్టలేదు. వీలు చిక్కినప్పుడల్లా సావిత్రమ్మ ఎదుట ఆ ప్రశంస తీసుకు వస్తున్నాడు. సమాధానంగా సావిత్రమ్మ మౌనం వహిస్తున్నది.

తల్లి మౌనమూ తండ్రి ఆరాటమూ విమల తలుపుచాటునుండి చూస్తున్నది.

తండ్రి తనకు సంబంధం విచారిస్తున్నాడన్నమాట. కన్న ఆరుగురు బిడ్డలనూ కట్టుకున్న భార్యనూ పోషించటానికి తన రక్తము ధారపోస్తున్న తండ్రి ఎముకల పోగయ్యాడు. తండ్రి పరిస్థితులలో అటువంటి సంబంధము కంటికి కనబడితే కరువు రోజుల్లో కమ్మని అన్నం కనబడ్డట్టుగా ఉంది. ఆయనదేం తప్పు? ఆయన పరిస్థితుల్లో ఎవరున్నా అలాగే ఉంటుందేమో! ఎంత ఆలోచించినా ఆమె ఒక నిర్ణయానికి

ఛాలేకపోయింది.

పందొమ్మిది సంవత్సరాలు నిండి నిండని విమల కుందనపు బొమ్మలా ఆకర్షణీయంగా ఎదిగింది. ఏ మూల చూచినా చింకిచాపలు తప్ప మరేవీ కనబడని ఆయింట్లో విమల తిరుగుతూ ఉంటే లక్ష్మి సర్వకళలనూ ప్రభవింప చేసినట్లుంటుంది. ముఖంచుట్టూ కదులాడుతూఉండే ఆ ముంగురులు మధ్య దొసగింజ బొట్టు— అరవిరి మొగ్గలా ఏదో రహస్యం చెప్ప బోతున్నట్టుగా ఉన్న ఆ పల్చటి పెదవులూ ఆ ముఖానికి ఎంతో అందాన్ని సమకూరుస్తున్నాయి. ఆమె కన్నె మనసులో అస్పష్టంగా ఉన్న భావాలు రూపుకట్టాలని ప్రయత్నిస్తున్న సమయంలో ముఖంలో ఒకవింత వెలుగు వెలుగుతూ ఉంటుంది. వెలుగును వెతుక్కోవాలని ఆరాటపడే ఆ తరుణ వయసుకు ఇంట్లో నిత్యం విలయతాండవం చేసే దారిద్ర్యం ఏమాత్రమూ అవరోధంగా లేదు.

రాత్రి పదిగంటలవరరకూ సావిత్రమ్మ వంటయింటి పనులన్నీ చక్కబెట్టుకుని హాలులోకి వచ్చింది. రెండు చాపలు పరుచుకుని తల క్రింద చేతులు పెట్టుకుని కమల విమల పడుకున్నారు. వాళ్ల నిద్దరినీ కన్నార్పకుండా చూస్తూ నిలబడిపోయింది.

దీపం తగ్గించి వాళ్లమధ్య చోటుచేసుకుని తనుకూడా తలక్రింద చెయ్యిపెట్టుకుని పడుకున్నది సావిత్రమ్మ.

విమల సంబంధాన్నిగురించి సావిత్రమ్మకు జ్ఞాపకం చెయ్యటానికి రామనరసయ్య హాల్లో అటూయిటూ తారట్లాడాడు. ఆ సంగతి గ్రహించిన సావిత్రమ్మ కదలకుండా పడుకుంది. కాని ఆలోచించకుండా ఉండలేకపోయింది.

'అటువంటి పిల్లకు ఎటువంటి సంబంధం?'

తెల్లవారు ఝామున ఆమెకు కన్ను మలిగింది.

* * *

ఒకరోజంతా ఉపవాసము ఉన్న గోపీకి కళ్లు తిరిగినట్లయి హాలులో గదిలో పడుకున్నాడు. తరంగాల మాదిరిగా ఉవ్వెత్తుగా ఎగిరెగిరిపడుతూ ఒద్దనుతాకే ఆలోచనలను అదుపులో పెట్టలేక అటూ యిటూ దొర్లటం మొదలుపెట్టాడు.

ప్రొఫెసరు నిరంజనం మొదట తన పట్ల ఎంత ప్రేమగా ఉన్నాడు ? ఆ అభిమానమూ ఆ ఆప్యాయతా నటన కాదు. ఆయన తనకు తండ్రి అయితే బాగుండుననుకున్న క్షణాలెన్నో ఉన్నాయి. ఒకగంట భోజనం ఆలస్యమయితే ఆయన మనసు గిలిగిల్లాడి పోయేది. తనబట్టలు మాసిపోతే, నలిగిపోతే ఆయన ఎంతో బాధపడేవాడు. అంతగా అభిమానించి — ఇంటచేర్చుకున్న ఆయనకు తనకు అపకారం జరిగిందని తెలిస్తే ఎట్లా ఉంటుంది ? నిజానికి ఆయనదేం తప్పు ?

తప్పే. ఆయన నిజం తెలుసుకోవాలి. తెలుసుకోవటానికి ప్రయత్నించాలి. ఆయనకు నిజంతెలిసేదెట్లా ? ఎవరయినా పనికట్టుకుని విచారణచేసి ఆయనకు చెప్పాలి. సత్యాన్ని అన్వేషించటానికి ఎవరికి పట్టింది? ఒక మూలనుంచి బయలుదేరిన అపవాదుకు చేతనైనంత శృంగారంచేసి మరొకరికి అందించటమంత సుఖమయిన పని మరొకటి కనబడదు కదా.

ఏంచెయ్యాలి ఇప్పుడు? హౌవుస్‌సర్జన్‌గా పనిచెయ్యటానికి తనకు ముఖం చెల్లుతుందా ? ప్రొఫెసరు నిరంజనం దానికి



# జీవితవలయాలు

అడ్డుపడుతాడేమో? ప్రొఫెసర్లు విద్యార్థుల అభివృద్ధి నిరోధించదలచుకుంటే ఎన్నయినా మార్గాలు ఉన్నాయి.

గోపీ దృష్టి అనితమీదకి మళ్ళింది. ప్రొఫెసరు తన యింటికివచ్చి ఉండమని అడిగిననాడే రానని చెప్పవలసింది. కాని అలా చెప్పలేక పోయాడు. ప్రొఫెసరు మాటకు ఎదురు చెప్పితే తన అభివృద్ధికి భంగకరమేమోనని ఆనాడూ బెదిరిపోయాడు. కాని ఆయన చెప్పినట్టు విన్నప్పటికీ తనకు పరిస్థితులు ఎదురు తిరిగాయి.

అతడికి అనితను తలుచుకోగానే అసహ్యం కలిగింది. ఆమెను గురించి కాలేజీలో వాకబు చేసి నిజం కనుక్కోవాలనీ, దాన్ని బయట పెట్టి తన నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకోవాలనీ మొదటి రోజున ఆ వేడిలో అనుకున్నాడు. కాని— తరువాత మనసు అందుకు అంగీకరించలేదు. బురదగుంట అని తెలిసి కూడా అందులో కాలుపెడితే తన కాలికే బురద అంటుకుంటుంది. కాని బురదగుంటకు నష్టమేమున్నది?

చివాలునలేచి చల్లనీళ్లతో ముఖం కడుక్కొని నలిగిన బట్టలు మార్చుకుని రూముకు తాళమువేసి బయలుదేరాడు. తిన్నగా రఘురామయ్య ఎనాటమీ ప్రొఫెసరు యింటికి వెళ్ళాడు.

గోపీని చూడగానే ఆయన ఆప్యాయంగా పలకరించి కుర్చీ ఒకటి తనకు దగ్గరగా లాగి 'రావోయ్' అన్నాడు.

మాట్లాడకుండా గోపీ కూర్చోటం చూసి 'నా దగ్గరికి స్టూడెంట్సు ఎక్కువగా రారు. ఇదివరకూ నీవే ఎప్పుడయినా వచ్చేవాడివి. ఇప్పుడు నీవూ రావటం లేదు' అన్నాడు.

విషాదంగా నవ్వాడు గోపీ 'మా స్టూడెంట్సు దేమున్నదండీ. ప్రొఫెసర్ల ఆగ్రహానుగ్రహాలకు తట్టుకోలేక తబ్బిబ్బయి పోతున్నారు'

'ఎవరికి ఉండే స్టేటస్ వాళ్లకు ఉంటుంది. పాపులారిటీ అయినా అంతే. దానికేమిటిలే. ఇంతకూ నీ ప్రోగ్రామ్ ఏమిటి? ప్యాసయినట్టు తెలిసిందిగా?'

'రిజల్టు పేపర్లో రాలేదండీ. అది వచ్చేవరకూ ఏ నిర్ణయమూ చేయలేను కదా. అయినా ఆలోచిస్తూనే ఉన్నాను. ఇంకా ఏ నిర్ణయానికీ రాలేదు' గోపీ తన యింటిసంగతులు తప్ప కాలేజీపరిస్థితులన్నీ ఆయనకు విపులంగా చెప్పాడు.

'నీవు ఎఫ్. ఆర్. సి. యస్ చేస్తావా విదేశాలకు వెళ్ళి ?'

ఆ మాటకు గోపీకి ఏడుపు వచ్చినంత పని అయింది. 'ఇక్కడ హౌవుస్ సర్జనుగా కూడా ఉంటానో లేదో అని భయపడుతున్న నేను, విదేశాలకు వెళ్ళి చదువుకోవటమా ? నా కంత అదృష్టమే ఉంటే ఇట్లా ఉంటానా ? నన్ను చూడగానే మీకిట్లా హాస్యము చెయ్య బుద్ధిపుట్టిందా సరే ?' ముఖం చిన్నబుచ్చుకుని తలవంచుకున్నాడు గోపీ.

'నేను ఎగతాళికి అనటంలేదు. నీకు నిజంగా వెళ్లాలని ఉన్నదా ? ఉంటే చెప్పు. ప్రిన్సిపల్‌గారూ నేను ప్రయత్నించి తగిన ఏర్పాట్లు చేస్తాము'

గోపీ ఆయన ముఖంవంక పరిశీలనగా చూశాడు. ఆయన ముఖంలో హాస్యధోరణి ఏ మాత్రం కనబడలేదు. 'తన ఆత్రాన్ని పైకి కనబరిచితే లోకువచేస్తాడేమో ఆయన' అనుకుంటూ జంకాడు గోపీ.

'ఏమిటోయ్? మాట్లాడవేం ? ఇదంతా ముఖమాటమే ? లేక నీకు సహజంగా ఉన్న జంకా ? నా మాటలు నీకు నిజమనిపించాయా అసలు ? చెప్పు ?'

'మీకు నా మీద ఇంత అభిమానము ఉందంటే ఆ సంతోషాన్ని భరించలేకుండా ఉన్నాను సర్. మీరూ ప్రిన్సిపల్‌గారూ నాపట్ల చూపుతున్న అభిమానానికి నేనెంతో కృతజ్ఞుణ్ణి. మీ రిద్దరూ కలిసి నన్ను ఆశీర్వదించి విదేశాలకు పంపుతానంటే అంతకంటె మహాభాగ్యము ఇంకేముంటుంది ? అటువంటి అవకాశాన్ని జారవిడుచుకునేటంతటి వెర్రివాణ్ణనుకున్నారా ?' రెండు చేతులు తలమీదుగా జోడించాడు.

'రావోయ్' రఘురామయ్య కాలికి జోళ్ళు వేసుకుని గోపీనికూడా తనవెంట రమ్మని చేతిసైగ చేశాడు.

ఆశ్చర్యమూ సంతోషమూ సంభ్రమమూ ముప్పిరిగొనగా గోపీకి కాళ్లు తడబడటం మొదలుపెట్టాయి. మాట్లాడకుండా తలవంచుకుని ఆయనను అనుసరించాడు.

(ఇంకా ఉంది)

# రాబిన్ బ్లూ ప్రపంచమంతటా చాలా హెచ్చుగా అమ్మబడుతూన్న నీలి

ప్రపంచమంతటా స్వచ్ఛమైన అల్ట్రా మెరైన్ నీలి. వస్త్రాలకు తెలుపుదనాన్ని చేకూర్చడంలో సాటిలేనిదిగాను రాబిన్ బ్లూ బహుళ ప్రఖ్యాతి పొందివున్నది

ప్రకృతిసిద్ధమైన కంటికింపుగావుండే తెలుపుదనాన్ని చేకూర్చగల నికార్సయిన నీలి రాబిన్ బ్లూ. ఒక పొట్లంతో ఎన్నోసార్లు వస్త్రాల నుతుకవచ్చు. రాబిన్ బ్లూ వస్త్రాలకు చెరుపు చెయదని జ్ఞాపకం వుంచుకోండి.

నకిలీ వాటిని గమనించండి. అచ్చమైన రాబిన్ బ్లూ కోరి తీసికోండి.






మీ వస్త్రాలకు ప్రకృతిసిద్ధమైన,
కంటికింపుగావుండే తెల్లదనాన్ని
రాబిన్ బ్లూ
చేకూర్చగలదు



(ARBC-29 TEL)

పెద్దకథ

# ఇలా జరుగుతుందనుకోలేదు

## రమణి

(గత సంచిక తరువాయి)

రాధ అదే స్కూల్లో చదువుకుంది. కాలేజి చదువు పూర్తయ్యాక, పెళ్లయ్యే వరకు కాలక్షేపం కోసం స్కూల్లో పని చేస్తున్నది.

ఆమెకి రాజా అంటే ప్రత్యేకమైన అభిమాన ముంది. రాజా ఆ యదార్థాన్ని గమనించకపోలేదు. కాని, ఈ ఆప్యాయత తీవ్రం కాకూడదని తప్పించు కు తిరుగుతున్నాడు.

"అబ్బబ్బా... ఏం కుర్రాడండీ... ఏం కుర్రాడు. అప్పుడే అనుకున్నాను... అలాటి కుర్రాడు భూమ్మీద ఉండదగ్గవాడు కాదని..."

తెలుగు మాస్టారు సుబ్బరామయ్య— పోయిన సుబ్బారావుని అతిశయోక్తి అలంకారంలో మెచ్చుకొంటూ స్టాఫ్ రూంలోకి ప్రవేశించారు.

రాజా ఆలోచనలు రాధ మీద నుంచి సుబ్బరామయ్య అలంకారం మీదికి, దాని మీద నించి సుబ్బారావు మీదికి—ఆతర్వాత మళ్లీ చావు మీదకి మరలి మొదటికొచ్చింది.

సాధారణంగా చావంటే అందరూ భయపడతారు. ఈ భయం ఎందుకు కల్గుతుందో రాజాకు మాత్రం అర్థంకాదు!

రాజా చావు కన్న ఈ భూమ్మీద పుట్టుక అంటె భయపడుతూ వుంటాడు. ఫలానా వారికి అమ్మాయి, లేక అబ్బాయి అని విన్న తర్వాత ఆ పుట్టిన బిడ్డ నూరేళ్ల జీవితము అతని కళ్లల్లో మెదులుతుంది. అందులో సుఖం కన్నా, దుఃఖమే ఎక్కువగా అతనికి కనిపిస్తుంది. అందుచేత, ఆ బిడ్డకి వెంటనే మనసారా సానుభూతి చూపిస్తాడు!

చావంటే అతని మతంలో ఒక గొప్ప భాగ్యం. చాలామంది అనుకున్నట్టుగానే ఎంతో పుణ్యం చేసుకుంటేః చావు తొందరగా వస్తుంది అని అతనూ అనుకుంటూ వుంటాడు. అతని దృష్టిలో చచ్చిపోయిన వాళ్లంతా దేవుళ్లు. అందుకే శవానికి నమస్కరిస్తాడు. స్మశానాలకి శిరస్సు వంచుతాడు!

'అంత చిన్నతనంలో మరీ అంత వైరాగ్యం పనికి రాదోయ్'— అంటాడు సచ్చిదానందం.

'అవును పనికిరాదని నాకూ తెలుసు. కాని, ఇది వైరాగ్యమంటారా? కాదు.. నిత్యమైన సత్యం. దాన్ని విడమరిచి చెప్పలేను నేను. మాటలు దొరకడం లేదు. భావం మాటల్లో ఇమడడంలేదు. నాలో పుట్టిన భావాన్నే చెప్పలేని అశక్తుణ్ణి. అందుచేత నా నోటి నుంచి వచ్చిన మాటల్ని ఎగతాళి పట్టిస్తుంటారు మీరు..'

అనేవాడు రాజా.

సచ్చిదానందం కళ్లు పెద్దవి చేసి, నొసలు చిట్లించి, నోరు ఒక ప్రక్కకి తోసి—

"నీకు చాలా మంచి భవిష్యత్తు వుందోయ్.." అంటుండేవాడు.

సచ్చిదానందం వచ్చి భుజం మీద చేయి వేసినప్పుడు గాని ఇంటర్‌వెల్ అయిందని తెలియలేదు రాజాకు.

"రా, హోటల్‌కి పోదాం..."

అన్నాడు తాను దారితీస్తూ సచ్చిదానందం.

హోటల్లో ఒకమూల ఎవరూ లేనిచోట చూసుకుని కూర్చున్నారిద్దరూ.

"నాకు చచ్చిపోవాలనుందోయ్..."

అన్నాడు సచ్చిదానందం. సర్వర్‌కి ఇడ్లీకి ఆర్డరిచ్చిన తర్వాత రాజాతో మళ్లీ,

'అది ఇందాకనే చెప్పారు. దానికి నా అభిప్రాయాన్ని కూడా వెల్లడించాననుకుంటా.."

"అవుననుకో, కాని... మనం సమగ్రంగా చర్చించుకోలేదు..."

"అయితే ఇప్పుడు చెప్పండి.. మీరెందుకు చచ్చిపోవాలనుకుంటున్నారు?"

"చచ్చిపోవడం కోసం..."

అంటూ నవ్వాడు సచ్చిదానందం.

"నవ్వులాటకా....?"

"కాదు నిజంగానే..."

"ఎందుకు?"

"బరువు మొయ్యలేక...!"

"కాంపోజిషన్ పుస్తకాలిదా....!"

"అవును... దేవుడిచ్చిన ఇంపోజిషన్ భరించలేక..."

"కాని... నాకు చావాలని లేదు.."

"ఉండదు. నాకు తెలుసు. నీకింకా బోలెడంత ఉజ్జ్వల భవిష్యత్తు కాచుకు కూర్చుంది."

"నన్ను పూర్తిగా చెప్పనివ్వడం లేదు మీరు. నాకు చావాలని లేదు. కాని, ఆ చావు తర్వాత ప్రజలు ఏమనుకుంటారో వినాలని వుంది.."

"అవును అందరికీ అలానే వుంటుంది. కాని, అది నెరవేరే కోరిక కాదు.."

"అవును నాకూ తెలుసు.."

"నీకో సత్యం చెప్పనా రాజా...?"

"చెప్పండి..."

"ఏమీలేదు.., ఇది మనిద్దరికీ సంబంధించిన నిజం సత్యం...!"

"చెప్పండి..." అన్నాడు నవ్వుతూ రాజా.

"నీ కోరిక నాది.. నా కోరిక నీది.. అవునా..?"

రాజుకు అర్థం కాకపోలేదు. అయినా, ఆయన చేత వివరం చెప్పించాలనుకున్నాడు.

"నాకు అర్థం కాలేదు.."

రాజా కళ్లల్లోకి తీక్షణంగా చూశాడు సచ్చిదానందం.

"నాకు నిజంగా చచ్చిపోవాలనే వుంది. నీకు చావు తర్వాత థ్రిల్‌ని ఎంజాయ్ చేయాలని వుంది. అవునా? నేను అబద్ధం చెబుతున్నానంటావా?"

రాజా సమాధాన మివ్వలేదు.

సర్వర్ తెచ్చిన ఆవిర్లొచ్చే ఇడ్లీలు రాజాను సమాధాన మివ్వవలసిన అవసరం నుంచి తప్పించాయి.

"రాధ ఏమంటున్నది..?"

అన్నాడాయన. ఇడ్లీలు నోట్లో కరగబెడుతూ.

"ఏదో అంటుంది. నన్నూ అనమంటుంది. ఈ అర్థంలేని ప్రేమకి నేనెలా వంత పలికేది?"

"యువకుడివి. ప్రేమలో అర్థాలు నీకు తెలియవంటావా..? పుట్టినే రాధని ఆట పట్టిస్తున్నావ్.. అంతేనా..!" అన్నాడు సచ్చిదానందం ఓరగా చూస్తూ.

"మీరు చెప్పండి. రాధ నన్ను ప్రేమిస్తుందంటారా..?"

"నన్ను మాత్రం ప్రేమించడం లేదు."

"మాట మారుస్తున్నారు. చెప్పండి.. సమాధానం కావాలి..."

"చెప్పానుగా, నన్ను మాత్రం ప్రేమించడం లేదని.. లేకపోతే ఏమిటోయ్! అనవసర ప్రసంగం నువ్వూను. రాధ నిన్ను కాకపోతే ఎవర్ని ప్రేమిస్తుంది? ఇద్దరూ పెళ్లి చేసుకోండి. జోడీ, బాగుంది.. నీకింక జీవితం బోరనేది కొట్టదు.."

"మరి.. స్థితిగతుల మాటేమిటి? కులంతోను, సంపదలోనూ, తూగని వాడినే!"

"రాధను చేసుకుంటే సంపద దానికదే వచ్చి పడుతుంది. ఇది ట్వంటీయత్ సెంచరీ మిస్టర్ రాజా.. ఇంకా కులగోత్రాలు ఏమిటి..? అన్నట్టు.. సుబ్బరామయ్య నీమీదేదో కక్షగట్టినట్టు కనిపిస్తున్నాడోయ్.. రాధ నిన్ను ప్రేమించడం అతనికిష్టం లేనట్టుగా వుంది. ఒకరోజు రాధని మందలిస్తుంటే నేను చూసాను. రాధ ఎదురు తిరిగిందతనికి.."

"అయితే చాలావరకు వచ్చిందన్నమాట..! మరి ఈ విషయం నాకింతవరకు చెప్పలేదేం మాస్టారు.. సుబ్బరామయ్య కెందుకు కక్ష?"

"అదే అర్థం కావడంలేదు. బహుశా రాధ స్వకులం మనిషిగా..అందుకే అయి వుంటుంది. ఈర్ష్య.."

"మీరూ చెప్పండి. మీరూ రాధ కులమేగా? మీకటువంటి ఈర్ష్య ఏమీ లేదా..?"

ఈ మాటకి బిగ్గరగా నవ్వాడు సచ్చిదానందం.

"అవునోయ్.. ఇన్ని రోజులు నుంచి నన్ను అర్థం చేసుకున్నది ఇంతే నన్నమాట..? నా భార్యే నయం నీ కంటే.. ఇంతవరకు నీకేవో భగవత్సిద్ధమైన తెలివితేట లున్నాయని భ్రమపడుతున్నాను. భలే వాడివే."

రాజా తెల్లబోయాడు.

హోటల్లో నలుగురూ వాళ్లని కేంద్రీకరించి చూసారు.

"నవ్వు నాలుగు విధాల చేడన్నారు. నిజమే.. ఇప్పుడు అందరి కళ్ళు మన మీద పడ్డాయి.. కాఫీ తెమ్మను. పోదాం."

అన్నాడు సచ్చిదానందం తెలుసుకుని.

"అవును మాష్టారూ నా కళ్ళు కూడా మీమీద పడ్డాయి."

అన్న రాధ కంఠం వినిపించింది.

రాజా గమ్మున వెనక్కి తిరిగి చూసాడు. అక్కడే వుంది రాధ.

"అదేమిటమ్మాయ్.. ఎప్పుడొచ్చావ్..? అంత దొంగచాటుగా కూర్చోవలసిన అవసరం ఏమొచ్చింది ?"

అన్నాడు సచ్చిదానందం ఆదర పూర్వకంగా.

"అవును మాష్టారూ.. అవసరం వచ్చింది గనకనే కూర్చున్నాను.."

అంటూ, తాను తీసుకున్న షర్బత్ గ్లాసుతో సహా వచ్చి వాళ్ళ దగ్గిర కూర్చుంది రాధ.

"నేను వెళ్తా..." అని లేచాడు రాజా.

"అదేమిటోయ్... మేమూ వస్తున్నాం వుండు.." అన్నాడు సచ్చిదానందం.

"మీరు నెమ్మదిగారండి.. స్కూల్‌డే రోజు కోసం పిల్లలకి కొన్ని ఇన్‌స్ట్రక్షన్స్ ఇస్తానన్నాను. వాళ్ళు నా కోసం కాచుకుని వుంటారు..."

"సరే వెళ్ళనివ్వండి మాష్టారూ అంతగా యిష్టం లేనివారిని కూర్చోమని బలవంత పెట్టడ మెందుకు?" అంది రాధ నిష్ఠూరంగా.

రాజా ఆమె ముఖంలోకి అదోలా చూసాడు. 'వెళ్ళండి పట్టినే అన్నా..' అన్నట్లు అంగీకారంగా చూసింది రాధ నవ్వుతూ.

రాజా బిల్లు చెల్లించి వెళ్ళిపోయాడు.

*　　*　　*

ఆసాయంత్రం రాజాను ఎక్కడికీ వెళ్ళొద్దు తన కోసం ఎదురు చూడమన్నాడు సచ్చిదానందం.

ఎలాగూ పనిలేదు గనక అతని కోసం చూస్తూ కూర్చున్నాడు.

దూరంగా సచ్చిదానందం వస్తూ కనిపించాడు. అతను రాధ కేదో సంజ్ఞ చేస్తున్నాడు. రాధ ఎటో వెళ్ళింది.

"సిగరెట్లు అంతగా కాల్చకోయ్..ఆరోగ్యం దెబ్బతింటుంది..."

అన్నాడు సచ్చిదానందం. రాజా కుర్చీ పక్కగా వున్న సిగరెట్టు పీకల్ని చూసి.

"తాగాలి మాస్టారూ తాగాలి.. ఇంకా తాగాలి. మీకు తెలుసా మాస్టారూ బాధలో ఎంత హాయి వుంటుందో?"

"నువ్వు ఈరకం మాటలికింక స్వస్తి చెప్పె య్యాలి."

"ఏమవుతుంది తర్వాత..? నేనో మహారాజునై పోతున్నానా? చెప్పండ ముందే.."

"అవును. ఏకో మహారాణి పెళ్ళాడబోతోంది గనక, నువ్వు నిజంగానే మహారాజువై పోతున్నావ్."

"అది మీ వేళాకోళం.."

"కాదు.. పచ్చి నిజం. రాధ నన్ను మంచిరోజు చూసి ముహూర్తం పెట్టెయ్యమంది కూడా..?"



# ఇలా జరుగుతుంది...

"రాధ ముహూర్తం పెట్టమనడానికి నాకూ సంబంధమేమిటి?"

"అంత తెలివిగా మాటాడకు మరి..! ఏమంటావ్..?"

"నేను రాధను చేసుకోలేను.."

"తప్పదు. లేకపోతే రాధ ఏ అఘాయిత్యమయినా చేసేస్తుంది. నా మాట విను రాజా.."

"ఆమె తల్లిదండ్రులు..?"

"అదంతా నేను చూసుకుంటాను. నువ్వు ఊ.. అను.."

"అంటాను. కాని, ఒక షరతు. ఆమె తల్లిదండ్రులు అనుమతి లేకుండా దొంగచాటుగా మాత్రం రాధని పెళ్లి చేసుకోలేను. ఇది నిశ్చయం.."

"నీ నిశ్చయం మారదా..?

"నన్ను బలవంతం చెయ్యకండి. మారదు.. రాధకి బంగారు భవిష్యత్తు వుంది. తెలిసి నేను ఆమెను నట్టేట ముంచలేను."

"నీ అర్థంలేని త్యాగంతో అవతల రాధ గొంతు కోస్తున్నావ్.. ఇది నీకు తెలుసా?"

"మాస్టారూ... నా వయస్సు చిన్నదే కావచ్చు. కాని జీవితమంటే ఏమిటో నాకు తెలుసు. బ్రతుకంటే ఏమిటో నాకు తెలుసు. రాధ సంగతి నాకు బాగా తెలుసు. నేను రాధను చేసుకోలేను... నన్ను మన్నించమనండి.."

"నువ్వు ఫూల్‌వి.."

"అవును..! ఇంకా తిట్టండి. రాధ చేత కూడా తిట్టించండి.. అంతేకాని చెయ్యలేని పనికి నన్ను ప్రోత్సాహించకండి..."

అక్కడనించి విసురుగా వెళ్లిపోయాడు రాజా.

రుమాలు ముక్కు దగ్గరుంచుకుని వెక్కుతున్న రాధ అతనికి కనిపించనే లేదు.

రాజా వెళ్లడంవెళ్లడం సరాసరి ఒక సినిమా హాలుకు వెళ్లాడు. సగం ఆట అప్పటికే అయిపోయింది. అయినాసరే టిక్కెట్టు కొనుక్కొని లోపలికి వెళ్లి కూర్చున్నాడు.

తెర మీద నిండుగా రాధ బొమ్మ, సచ్చిదానందం కామెంటరీ వినిపించింది.

విసుగ్గా బయటకి వచ్చేసాడు. పార్కుకి వెళ్లాడు. అక్కడ బోల్డంత మంది రాధలు, సచ్చిదానందాలు కనిపించారు.

అక్కడనించి తిన్నగా రూమ్‌కి వచ్చేసి కూర్చొని అదేపనిగా సిగరెట్లు పట్టడం మొదలెట్టాడు.

బాగా చీకటి పడింది.

మేఘాలు దట్టంగా అలుముకున్న మూలాన ఉన్న వెన్నెల కూడా అడవి పాలయ్యింది.

బయట ఎవరో పిలిచిన చప్పుడైంది.

రాజు లేవలేకపోయాడు.

ఆలోచనతో అతను సతమతమై పోయి ఒంట్లో సత్తువని కోల్పోయాడు. లంకణాలు చేస్తున్నంతటి నీరసపడి పోయాడు.

అంతలో గదిలోకి ఎవరో దూకుడుగా ప్రవేశించారు.

లైటు వేశారు.

ఒక్కసారిగా వెలుగుని చూళ్లేక కళ్లు మూసుకుని, నెమ్మదిగా చేతులు తప్పించి చూశాడు.

ఎదురుగా రాధ!

దివ్యసుందరిలా ప్రత్యక్షమయింది. చేతులో ఒక పెట్టె కూడా వుంది.

"మాస్టారూ.. వెంటనే మనం ఈ ప్రదేశం విడిచి వెళ్లిపోదాం.."

'తళ, తళ', మని మెరుపులు మెరిశాయి. ఉరుమురిమింది. ఎక్కడో పిడుగు పడ్డ భయంకర ధ్వని!

రాజు నిశ్చేష్టుడై ఆమెను చూడసాగాడు.

ఆమె రాజు చెంతగా వచ్చి గట్టిగా కావలించుకుంది.

"పదండి మాస్టారూ ఎక్కడికైనా వెళ్లిపోదాం. ఈ మనుషులకి దూరంగా పోయి హాయిగా వుందాం.."

ఆమెని విదిలించుకున్నాడు.

"రాధా.. ఏమిటింత ధైర్యం..? ఇంతటి దారుణమైన నిశ్చయానికి ఎలా రాగల్గావు?"

"అవును, వచ్చాను, రావాలనే ఇంత దృఢ సంకల్పానికి వచ్చాను. మాస్టారూ.. మీరు లేకుండా నేను బ్రతుకలేను.. నన్ను కాదనకండి.."

అతని పాదాల వద్ద వాలిపోయింది. రాజా చలించిపోయాడు.

కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

"రాధా.. నువ్వు చాలా చిన్నపిల్లలా వ్యవహరిస్తున్నావు.. బొత్తిగా బ్రతుకంటే ఏమిటో నీకు తెలియదు.. ఇంత వెర్రిమొర్రిగా ప్రవర్తిస్తావని ఎప్పుడూ అనుకోలేదు.."

"తెలుసు.. బ్రతుకంటే నాకు తెలుసు..అందుకే ఇదిగో చూడండి.." అంటూ పెట్టె తెరిచింది.

బంగారం...! నోట్లకట్టలు...!!

"ఇవి దొంగతనం చెయ్యలేదు.. నాది..నాస్వంతం. వీటితో మనం ఎక్కడున్నా, ఎలాగైనా బ్రతకొచ్చు.."

రాజు పేలవంగా నవ్వాడు..

"బ్రతుకంటే.. డబ్బుతో కొనుక్కుంటే వస్తుందా రాధా...? ప్రేమ ఇచ్చి పుచ్చుకోవడానికా అంతే..!"

"టైములేదు.. మీరిలా నీతులు చెప్తూ కూర్చుని కాలయాపన చెయ్యకండి.."

"రాధా.. నీకు ఆవేశం ఎక్కువ.. నువ్వు చెప్పినట్టు నేను చెయ్యలేను.. వెళ్లు. వెంటనే ఇంటికి వెళ్లిపో.."

"వెళ్లను. నేను యింటికి వెళ్లడానికి రాలేదు.."

"నువ్వు చెప్పినట్టు నేను చెయ్యడానికి సిద్ధంగా లేను..."

"అంతేనా..?"

"అంతే..!!"

మరుక్షణంలో రాజు చెంపలు వాచిపోయాయి. రాధ ఏడుస్తూ సరుగెత్తి వెళ్లిపోయింది పెట్టెతో

వహి.

రాజు కొయ్యబారి పోయి అలానే నిలబడిపోయాడు ఎంత సేపు నిలబడ్డాడో అతనికే తెలియదు.

"రాజూ.. ఏమిటా చూపు..? నన్ను గుర్తించ లేనంతగా మారిపోయావేమిటి?"

అన్నాడు. చాలా సేపయి వచ్చి రాజును పరిశీలించి చూస్తున్న సచ్చిదానందం.

రాజు ఉలిక్కిపడ్డాడు.

"ఇప్పుడే రాధ వచ్చి వెళ్ళింది.." అన్నాడు దవడలు సవరించుకొంటూ.

"ఏం జరిగిందో చూశావా..?" అన్నాడు సచ్చిదానందం కూర్చుంటూ.

"తెలుసు..?"

"ఏమిటి తెలుసు? నువ్వింత మూర్ఖంగా ప్రవర్తిస్తుంటే ఎలా చెప్పు..?"

రాజు మాట్లాడ్లేదు.

"ఒక జ్యోతిష్కుడు పనికట్టుకుని రాధ ఇంటికి వెళ్ళి రాధ గురించి జోస్యం చెబుతున్నట్లుగా మీ రహస్యమంతా వాళ్ళింట్లో చెప్పాడుట. వాళ్ళ నాన్న నీ మీద కారాలు, మిరియాలు నూరు తున్నాడు."

"నా గురించి రహస్యమేమీ లేదే?"

"అదేనయ్యా బాబూ.. రాధా నువ్వు ప్రేమించు కున్న విషయం.."

"రాధను నేను ప్రేమించానా?"

"నీకేదో పిచ్చి పట్టినట్లుంది. నువ్వు రాధా ప్రేమించుకుంటున్నారని, కొద్దిరోజుల్లో వూరు విడిచి వెళ్ళిపోతారని కూడా జ్యోతిష్కుడు వాళ్ళింట్లో చెప్పాడట.."

"దానికి నేనేం చెయ్యగలను?"

"నువ్వేం చెయ్యొద్దు.. చెప్పేది విను...ఇదంతా ఎవరు చేశారనుకుంటున్నావ్.. ఆ సుబ్బరామయ్య చేసిన పని.."

"అయితే అయి వుండొచ్చు.."

"నీకేం ఆశ్చర్యం కలగడం లేదూ..? ఈ విషయం నిన్నేమీ కలవర పెట్టడం లేదూ..?"

"పెట్టొచ్చు.. కాని, నాకు ఇలాంటి చిన్న, చిన్న బాధలతో నిరుత్సాహం కల్గడంలేదు...అన్నింటికీ అతీతుణ్ణయి పోతున్నాను.."

"నీ వేదాంతం కట్టిపెట్టు..తర్వాత వింటాను.. ఈ సుబ్బరామయ్య ఇలా ఎందుకు చేయిస్తున్నాడో అర్థం కాకుండా వుంది.."

"నాకు అర్థమయింది.."

"ఎలా..?"

"ముందు మీరు చెప్పండి.. రాధ నన్ను మన స్ఫూర్తిగా ప్రేమిస్తోందంటారా?"

"ఏడ్చినటుగా వుంది.. ఈ ప్రశ్నకి లక్షసార్లు సమాధానం చెప్పాను.."

"అక్కడే పొరబడ్డారు. రాధ నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించలేదు మాస్టారూ.. డబుల్ గేమ్ ప్లే చేసింది.. ఆమె—శేఖరం సంగతి నాకు తెలుసు.. బాగా తెలుసు."

"ఎవరూ? శేఖరమా..? సుబ్బరామయ్య కొడుకు...!

"అవును.."

"ఎంత దారుణం?"

వర్షం చినుకులు ప్రారంభమయ్యాయి.

సచ్చిదానందానికి ఏదో ఆలోచన తట్టింది. వర్షాన్ని కూడా లెక్క చెయ్యకుండా బయటికి పరుగెత్తాడు.

అతన్ని చూసి నవ్వుకున్నాడు రాజు.

దృఢనిశ్చయంతో గది తలుపులు గట్టిగా, మూసాడు.

భయంకరమైన ఉరుములతో, కుండపోత లాంటి వర్షం పడుతుండగా తెల్లారింది.

రాధ, శేఖరం లేచిపోయారనే వార్తని రాజుకు చెప్పాలని తడిచి ముద్దై వచ్చాడు సచ్చిదానందం.

కాని, అక్కడి సంఘటన అతన్ని నిలువునా దహించి వేసింది.

గుండె ఒక్కసారిగా ఆగిపోయింది. భూప్రళయం సంభవించినంతటి గందరగోళం చెలరేగింది అతని మనస్సులో.

* * *

ప్రార్థన సమావేశంలో

రాజుని గురించి మాట్లాడాలని లేచాడు సచ్చిదానందం...

నోరు విప్పేసరికి దుఃఖం ఆగిందికాదు. కండువాతో ముఖం కప్పుకుని భోరున ఏడ్చేశాడు.

"నేను చచ్చిపోవాలనుకున్నాను.. మీ సానుభూతి వినాలనుకున్నాను.. రాజు దారుణంగా చచ్చిపోయాడు.. ఇలా జరిగి వుండకూడదు.. రాజు చచ్చిపోయాడు.. అతను పోయేవాడు కాదు. ఇలా జరిగి వుండకూడదు.."

భోరున ఏడుస్తూ ఆపి వేసిన సచ్చిదానందం మాటలు ఏ ఒక్కరికీ అర్థం కాలేదు!!

(అయిపోయింది) ●

[illegible]

బొమ్మ: శ్రీ బాష

'మీనం! మీనం! లేగదూడ తల్లిదగ్గరకు వెళ్ళటం లేదేం?' గుంజ(తాడు విప్పి మెడమీద వేసినా, ఉన్నతావునుంచి కదలటానికి ఉద్యమించని దూడవైపు పరీక్షగా చూస్తూ అన్నాడు రాఘవయ్య.

'దానికూడా ఫేషన్లు తెలుస్తున్నా యేమో. అమ్మా అని ఆప్యాయంగా తల్లిని పిలవడం, (ప్రేమగా తల్లి



వాళ్ళో తల దాచుకోడం, ఈ రోజుల్లో వెగటుగా మరి. అసలు మన చాదస్తం గాని అమ్మా నాన్నల అవసరం ఈ రోజుల్లో ఎవరికుందండీ. ఎప్పుడూ తనేమో, తన చదువేమో, తన లోక మేమోగాని తనమీద అభిమానం చూపే తలిదండ్రులంటూ ఒకళ్ళున్నా రని, వాళ్ళముద్దూ ముచ్చట తీర్చ వలసిన బాధ్యత తమకుందని కలలో గూడా అనుకోరేమో ఈనాటి పిల్లలు.' మీనాక్షమ్మ గొంతు ఖంగుమంది.

మరొకరైతే ఆమె మాటల్ని మరోలా అర్థంచేసుకుని, ఆవిడ సంతానం తల్లియెడ నిర్లక్ష్యాన్ని చూపుతోందని భావించే వారేమోగాని రాఘవయ్య అలా అనుకోలేదు. ఆయనకు తెలుసు మీనాక్షమ్మ కూతుర్ని తప్పుపట్టే ధోరణిలో అలా మాట్లాడటం లేదని, అలా ఎన్నడూ మాట్లాడదని, పైపెచ్చు కూతురి చేతలకు పొంగిపోయే మాతృత్వమే ఆమె మాటల్లో ధ్వనిస్తుం దనీను.

కన్నులర మూసి, కదిలే వోపిక లేనట్లు దిగాలుగా నిల్చున్న దూడను రెండు చేతు ల్తోనూ ముందుకు నడిపిస్తూ అన్నాడు, రాఘవయ్య 'నీదంతా చాదస్తం. దూడ పాలు త్రాగకపోవడానికీ, లోకంలోని పిల్లల పోకడలకీ పోలిక లున్నాయంటావ్. జంతు, మానసిక శాస్త్రాల్లో నీకు డాక్టరేట్ యిస్తే బావుండు, వోర్చుమానుకుని పడి వుంటావ్.'

'మీకు వేళాకోళంగానే ఉంటుంది. మీరసలు ఏ విషయాన్ని లోతుగా ఆలో చించారు గనుక. వయసు పైబడుతున్న ఒక్క కూతుర్ని ఒక అయ్యచేతిలో పెడ్తే కన్యాదాన ఫలం దక్కుతుందని నాలుగేండ్ల మంచి చెవిలో యిల్లుగట్టుకు పోరితే ఆ విషయమేమైనా ఆలోచించారూ? పోనీ, పిల్ల పెద్దదైంతర్వాతనైనా పెళ్లి విషయం తలపెడతారేమోనంటే అదీలేదు. ఉన్న బాధ్యతల గురించి ఆలోచించక పోవడం అటుంచి అవసరం లేని బరువును నెత్తిన పెట్టుకుంటారదేం ఖర్మమో.'

'బరువేమిటి మీనం?'

'మీనంలేదు, మేషంలేదు. ఈ ఆవు విషయం నేననేది. ఈ ఆవు, దూడ, కావలావాడు, ఆవు సరిగా పాలివ్వడంలేదని, దూడ తల్లిదగ్గరకు వరుగెత్తలేదని—ఈ పటాటోపమంతా ఎందుకు?'

'నీ కోసమే ననుకోరాదూ?'

'ఇదో మెహర్బానీ. బాగా నేర్చుకున్నారు, ప్రతిదీ నీ కోసమేనంటూ'

'కాదని నీవంటే కాకుండాపోతుందా? శరీరంలో వాతం ప్రకోపించి లావెక్కుతున్నా వని, మాటిమాటికీ నడుము నొప్పికి ఆతిథ్యమిస్తున్నావని, వాటి నివారణకి ఆవు పాలు మంచిదనీ కదూ ఇదంతా? అసలు నీ వాత తత్వమే ఈ దూడకు గూడా వస్తోందేమో. అందుకనే మత్తుగా వుంది యివాళ. లేకపోతే 'పొదుగులోకి మొహాన్ని నెట్టినా పుడిసెడు పాలు కుడిచిందేమో చూడు.' పాలు త్రాగని దూడను యథా స్థానంలో కట్టేసి స్నానాల గదివైపు నడి చాడు రాఘవయ్య.

'నాకోసమేం కొన లేదు, మీ ముద్దుల కూతురికి, మీకు గేదెపాలు పడటం లేదని కొన్నారు...' ఇంకా ఏదో మాట్లాడ బోయిన మీనాక్షమ్మ అక్కడ భర్త లేక పోవడం గమనించి మిన్నకుండి పోయింది. మసక వెలుతురు క్రమేపీ అంతర్ధాన మౌతుంటే చీకటి చిక్కపడుతోంది. చీక ట్లోనే ఆవుదూడను పరిశీలనగా చూసి, రెండు చేతుల్తోనూ దూడ ముట్టెను ప్రేమతో నిమిరి 'పిచ్చి మొద్దూ, ఎందు కలా వున్నావ్? అజీర్ణం చేసిందా ఏం? కాస్త ఉప్పైనా తిందువుగాని వుండు' అని లోపలికి పోబోతూ పైకి చూసింది మీనాక్షమ్మ. మేడమీద గదిలో నుండి దీపం వెలుగు మంచితనంలా లోకమంతా వ్యాపిం చాలని కాబోలు కిటికీలో నుంచి బయటికి దూకుతోంది. కిటికీ దగ్గర్నుంచి ఎవరో లోపలికి వెళ్ళిన గుర్తుగా గదిలో నీడ కదిలాడింది.

* * *

అమ్మాడూ, జయం!' జయమ్మ ఉలిక్కి పడింది. చేతిలోని పుస్తకాన్ని మూసి అవతల పెడుతూ వాకిలివైపు చూసింది. మీనాక్షమ్మను చూసి నొసలు చిట్లించింది.

'అన్నం తిందాం రా తల్లీ'.

'నాకక్కర్లేదు'

'అక్కర్లేదూ! అదేమిటేవ్, ఎందుకని? ఆదుర్దాగా అడిగింది. ఆమె ఆదుర్దాను గమనించిన జయమ్మ చిరాగ్గా అంది 'ఆకలిగా లేదులే వెళ్ళు'

'అదేమిటే కసిరి కొడ్తావ్. అన్నం తినమన్నానుగాని హాలాహలం మింగమన లేదుగా' దీర్ఘం తీసింది మీనాక్షమ్మ.

'నీకు పుణ్యముంటుంది, ఆ హాలాహలం తెచ్చిపెట్టు' జయమ్మ కళ్లల్లో నీరు నిండింది.

'అయ్యో, అయ్యో! ఇదేం చోద్యమే. ఎవరన్నా వింటే నవ్వి పోతారే' అని కొంచెం ఆగి, కూతురికి దగ్గరగా జరిగి 'ఎందుకమ్మా జయం, అలా వున్నావు. ఒంట్లో బావుండలేదా?' అంటూ జయమ్మ నుదుట చేయి పెట్టి చూసింది. బుగ్గల్ని తాకి చూసింది. శరీరం—వేడిగా ఉందేమోనని ఆమె భయం.

'జయమ్మకు శరీరమంతా తేళ్ళు జెర్రులు పాకినట్లుగా వుంది. కాని ఆ సంగతి ఎలా చెప్పగలదు? ఇప్పుడే నాకు అస్వస్థత కలిగిస్తోంది. నన్ను ముట్టుకోవద్దు' అని తల్లికి ఎలా చెబు తుంది? అయిష్టమైనదాన్ని భరించనూ లేక, తన మనోగత భావాల్ని పైకి చెప్పనూ లేక సతమతమై పోతోంది. 'అబ్బా' అంటూ రెండు చేతుల్తోనూ తల పట్టుకుంది.

'తలనొప్పిగా వుందిటే. చెప్పవేం మరి. డాక్టర్ని పిలిపించనా?' ఒద్దన్నట్లు తల అడ్డంగా వూపింది జయమ్మ.

'తల నొప్పిగా వుందని, డాక్టర్ని పిలి పిస్తానంటే వొద్దంటావేమిటే. అంతా నీయిష్టమేనా? నా ప్రాణాల్ని తోడేస్తు న్నావ్. నిన్నింతవరకూ యిలా తయారు చేసిన మీ నాన్న ననుకోవాలి. ఊఁ ఒకటే గారాబం చెప్పినా వినుకోరు...'

అలా ఏదో చెబుతూనే వుంది మీనా క్షమ్మ. కాని జయమ్మ వినిపించుకోడం లేదు ఒక విషయంలో నుండి మరో విషయంలోకి దుముకుతూ ఎడతెరిపిలేకుండా ఏదో మాట్లాడుతూనే వుంటుంది. ఆ



ఆ ప్రవాహానికి తను తట్టుకోలేదు. ఆ ప్రవాహం ఆవిడ నోటంట రాకుండా వుండాలనే తను ముక్తసరిగా ఒకటి రెండు మాటలు మాట్లాడుతుంది. తను తక్కువ మాట్లాడికూడా ప్రయోజనం లేకపోతోంది. ఏదో ఒకమాట పట్టుకుని 'కీ' యిచ్చిన అలారంలా వాగేస్తుంది. చివరికి తన తండ్రిమీదుగా ఆ ప్రవాహం ఆగిపోతుంది. ఆయనలో ఏదో తప్పు పట్టడమే ఆమె ధ్యేయమైనట్లు అనిపిస్తుంది. అది తను సహించలేదు.

జయమ్మ మౌనంగా కూర్చోడం మీనాక్షమ్మ వాక్ప్రవాహానికి ఆనకట్ట కట్టినట్లయింది.

'పోనీ, యింట్లో వున్న మాత్రయినా తెచ్చివేస్తానుండు ఈ పూటకు' మీనాక్షమ్మ క్రిందికి వెళ్ళిపోయింది.

వాన వెలిసినట్లనిపించింది జయమ్మకు. ఒక ప్రమాదంనుండి బయటపడి మరో ప్రమాదాన్ని తప్పించుకునేందుకు ప్రయత్నించే ప్రాణిలా తలుపుదగ్గరకు పరుగెత్తి, తలుపు మూసి గడియపెట్టింది జయమ్మ.

వెనక్కి తిరిగిన జయమ్మకు గోడమీద కేలండరులోని యశోద, బాలకృష్ణుడు కనిపించారు. యశోద కూర్చుని చల్లకుండలోనుండి వెన్నను తీస్తోంది. ఆమె వెనకాల నిల్చుని ఆమె కుడిభుజంపై తన చిరుగడ్డాన్ని ఆనించి వెన్నముద్ద పెట్టమని

# మనసు-మమత

చేయి జాపుతున్నాడు కృష్ణుడు. యశోద వెన్నను ముద్ద చేయడంలో నిమగ్నమై వుంది. కృష్ణుడికి వెన్నపెట్టక పోలేదు. ఒక ముద్దను ఎడంచేతిలో వుంచుకున్నాడు. కొంత తిన్నట్లుగా మూతి చెబుతోంది. ఇంకా కావాలని చేయి జాపుతున్నాడు. యశోద యింకా పెడుతుందా? తప్పకుండా పెడుతుంది. ఆవిడ మొహంలో ప్రసన్నతే గాని విసుగు యిసుమంతగూడా కనిపించడం లేదు. అదీగాక ఆవిడ పెడుతుందని కృష్ణుడికి బాగా తెలుసు. పెట్టని తల్లిదగ్గర చేయిజాపే అవివేకికాడు అతను.

'ఎన్ని తింటావోయ్ వెన్నముద్దలు? అజీర్ణం చేయదూ?' అన్నట్లు చూశాయి జయమ్మ కళ్ళు. 'యశోద పెట్టేది వెన్న ముద్దలు కాదు, ప్రేమామృతాన్ని. అది అజీర్ణం చేయదు.' జయమ్మ మనసు జవాబు చెప్పింది.

మాతృప్రేమామృతాన్ని చవిచూసేందుకు తల్లిదగ్గర చేరడం, ఆవిడ లాలింపుకు పులకించడం, ఇవి కథల్లోనే కనిపిస్తాయా? నిజ జీవితంలో పొందలేనివా? లేక తన ఒక్కర్తికే ఆ అదృష్టం లేదా? తనకు ఊహ తెలిసినప్పటినుండీ తను తల్లికి దూరంగా ఉండాలని ప్రయత్నించిందేగాని ఆమెకు చేరువ కావాలని ఎప్పుడూ ప్రయత్నించలేదు. అందుకు కారణం ఏమిటో




చాలాకాలంవరకు తనకు బోధపడలేదు' ఇప్పుడు తెలుస్తోంది.

'జయం! జయం!! తలుపుతీయి' అమ్మ పిలుపు, తలుపుతట్టిన శబ్దం జయమ్మ ఆలోచనల్ని చెదరగొట్టాయి. జయమ్మ లేచి తలుపు తీయలేదు. అలాగే మంచం మీద పడుకుంది. నాన్నకూడా పిలిచాడు. పంతులు వేసుకుని వారిద్దరూ పిలుస్తూనే ఉన్నారు. తలుపు తీయమంటున్నారు. జయమ్మ దిండులో తలదూర్చి కళ్ళు మూసుకుంది.

క్రమంగా జయమ్మకు తలిదండ్రుల పిలుపులు వినిపించడం మానేశాయి. ఆమెలో తిరిగి ఆలోచనలు మొలకెత్తాయి. తనెందుకు తలుపు తీయలేదు. మాతృత్వం అందించే ప్రేమామృతాన్ని కోరుకునే తను తల్లికి దూరంగా ఉండాలని ఎందుకు కోరుకుంటోంది? ఆ ప్రేమామృతాన్ని చవిచూసే అర్హత తనకున్నా, దాన్ని అందించే శక్తి తల్లిలో లేదనా? కాదు ఆమెలో ఆ శక్తి ఉండవచ్చు. కాని ఆ శక్తికి మించిన మరోశక్తి ఆమెలో వుంది. ఆ మరో శక్తికి దూరంగా ఉండాలనే తన అభిలాష, ప్రయత్నమూను.

మధ్యాహ్నం సంఘటన అతి జుగుప్సాకరంగా తోచింది తనకు. అది క్రొత్తగాదు. ఎప్పుడూ అంతే. భోజనాలకి కూర్చున్న సమయంలోనే ఏవేవో సంభాషణలు మొదలెడుతుంది. తెలుగునాట ఏ దంపతులకూ ఏకాభిప్రాయం కుదరదు గాబోలనిపిస్తుంది అమ్మా నాన్నల వాగ్వివాదాలు వింటూంటే. ఎవరో దూరపుచుట్టం కూతురికి పెళ్ళి చేస్తున్నట్టు, ఆ పెళ్ళికి వెళ్ళాలంటుంది అమ్మ. ఎవరోలే పోనిస్తురూ అంటాడు నాన్న. దానిమీద అరగంట చర్చ. తను అక్కడ వున్నాననే విషయం కూడా మర్చిపోయింది తల్లి. చూసిచూసి విసుగొచ్చింది. అన్నం పెట్టుకున్న పళ్లెంతీసి తల్లి మొహంమీద కొడదామన్నంతకోపం వచ్చింది. ఎన్నోసార్లు తండ్రి చెప్పాడు, అన్నం తినేటప్పుడు అనవసరపు ప్రసంగాలు తేవద్దని. ఆవిడ కది బాగా అలవాటైంది. తను ఇక ఓర్చుకోలేక విసురుగా లేచి వచ్చేసింది.

దూరంగా ఫిరంగి వేసిన శబ్దం వినవచ్చింది. అంటే ఎనిమిదైందన్న మాట. పగలు పన్నెండింటికి, రాత్రి ఎనిమిదిం

# తాజా టిప్ పురోగమించు పురుషునికి




మీ దుస్తులే మిమ్మునుగూర్చి ఎక్కువగా చెప్పతాయి.
మీ వ్యక్తిత్వాన్ని పొగిడే షర్టు ఇదిగో. ఏమని చెప్పతుంది లోకానికి మిమ్ములను గురించి?
మీరు రసజ్ఞులని. (చూడండి, ఆలోచనతో ఏర్చిన ఆ చెక్కు) ఒక ప్రత్యేకతగల వైనము మీదని. (ఆ షర్టుమీద మచ్చుకైన మడత లేదుసుమా).
మీరు సంపన్నులని. (షర్టు యొక్క తళుకుదనము ధరను మాత్రం చాటించడంలేదు.)
అంచేత మా టిప్ తీసుకొని మీ షర్టులన్ని మఫత్‌లాల్ గ్రూప్ చేసిన బట్టలనుండి కుట్టించుకోండి.

**మఫత్‌లాల్ గ్రూప్**

పాప్లినులు, షర్టింగులు కాటన్, 'టెరీన్'/కాటన్ 2×2 'టెరీన్'/కాటన్ ప్రింటెడ్, టెబిలైజ్డ్ మాఫినైజ్డ్, స్ట్రెచ్ రకాలు

న్యూ షోరాక్ (షోరాక్), అహమ్మదాబాద్ • న్యూ షోరాక్, నడియాద్ • స్టాండర్డ్, బొంబాయి • స్టాండర్డ్ (న్యూ చైనా), బొంబాయి • స్టాండర్డ్, దేవాస్ • సాసూన్, బొంబాయి • సాసూన్ (న్యూ యూనియన్), బొంబాయి • సూరత్ కాటన్, సూరత్ • మఫత్‌లాల్ ఫైన్, నవసారి • మిహిర్ టెక్స్‌టైల్స్, అహమ్మదాబాద్

## మనసు-మమత

టికి సమయసూచనగా ఫిరంగి ప్రేలుస్తారు ఈ వూళ్లో. తనకు ఎనిమిదోఏడు వచ్చే వరకూ ఈ ఫిరంగిమోత అంటే భయంగా ఉండేది. కాని అంతకంటే భయంగా వుండేది అమ్మ మాట్లాడుతోందంటే.

మాటకు మాట తోడులేకపోతే వాచాలత్వం తగ్గిపోతుందని స్కూల్లో టీచరు కాబోలు ఒకసారి చెప్పింది. ఆ మాట తన మనసులో బాగా నాటుకుంది. అమ్మతో ఏదైనా మాట్లాడితే, ఆమె తన ధోరణిలో 'లొల్లుడు' ప్రారంభిస్తుంది. అది తను భరించలేదు. అందుకని అమ్మతో మాట్లాడటం తగ్గించింది. అది గమనించిన అమ్మ ఒకరోజు అడగనే అడిగింది 'ఏమిటి జయం, మాటామంతీ లేకుండా ముంగిలా వుంటున్నావ్. ఏదైనా ఆలోచనలో పడ్డావా, లేక ఏమైనా దిగులు పెట్టుకున్నావా మీ నాన్న నీ కోసం సంబంధాలు వెదకటం లేదని ?'

ఆ మాటలకు తనకు చిరాకు వేసింది. నొసలు చిట్లించుకుని తల్లివైపు తీక్షణంగా చూసింది.

'నీకు వాగటానికి మరో విషయం మేం దొరకలేదా ఏం, దాన్ని విమర్శిస్తావ్. అందరి బదులూ నీవు మాట్లాడుతున్నావ్ చాలదూ' తను అందామన్నా అనలేకపోయిన మాటల్ని నాన్న అన్నాడు. తనకు కొంత ఊరట కలిగింది...

ప్రక్కవాళ్ల గోడగడియారం గంటలు కొట్టడం మొదలెట్టింది. 'తొమ్మిది', జయమ్మ లెక్కపెట్టింది. ఆ గడియారాన్ని చూసినా, దాన్నిగురించి ఆలోచించినా అమ్మ స్ఫురిస్తుంది. దాని గంటలే గాకుండా 'టిక్కు టిక్కు' మనే ధ్వనికూడా ఈ యింట్లోకి వినిపిస్తుంది. ఎప్పటిదో పూర్వీకుల నాటిది. చూపులకికూడా పెద్దదిగా, భయంకరంగా కనిపిస్తుంది. ఒకసారి అమ్మకి కోపం వచ్చింది నాన్న ఏదో అన్నాడని. నాన్న యింట్లో వున్నంతసేపూ సణుగుతూనే వుంది. ఆయన ఆఫీసుకు వెళ్లింతర్వాతకూడా ఏదో వంకన ఆయన్ను సాధిస్తూనే వుంది. తను ఆరోజు ఎందువల్లనో స్కూలుకు వెళ్లలేదు. గదిలో కూర్చుని చదువుకుందామంటే అమ్మ గొడవ ఎక్కువైంది. ఆమె ఆపితే ప్రక్కయింటి గడియారం శబ్దం వినిపించేది. ఆ విధంగా ఆ గడియారానికీ, అమ్మకూ పోలిక కుదిరింది.

ప్రక్కయింటి సరోజ తనకు పూర్తిగా వ్యతిరేకం. సరోజకు వాళ్ల గడియారమంటే ఎంతో యిష్టం. వాళ్ల అమ్మ కూడా ఎంతో యిష్టం సరోజకు. ఆ యిష్టానికి కారణమేమిటంటే చెప్పలేదు. 'పదేళ్ల అమ్మాయివి నీ యిష్టాయిష్టాలకు కారణాలు చెప్పలేవా ఏమిటి' అని తను అడిగితే సరోజకు రోషం వచ్చింది. 'మా గడియారం గంటలు కొడుతుంటే సంగీతంలా సుస్వనాలు వినిపిస్తాయి'ట. 'మరి మీ అమ్మ అంటే యిష్టం ఎందుకు' అని అడిగితే సూటిగా జవాబు చెప్పలేకపోయింది. 'నీవూ నా తోడిదానివే గదా. అమ్మఅంటే యిష్టమెందుకో తెలీదానీకు. మీయింట్లో గడియారం లేకపోయినా అమ్మ వుందిగా' అన్నది. నిజమే అమ్మవుంది. కాని అమ్మ అంటే తనకి ఇష్టం లేదే, అలాగని తను సరోజతో చెప్పలేక పోయింది.

సరోజ చెప్పలేని విషయాన్ని తను తెలుసుకోగలిగింది. ఆ రోజు జయమ్మ సరోజ వాళ్లింటికి వెళ్లింది. సరోజ వాళ్లమ్మ చాపమీద కూర్చుని స్వెట్టరు కాబోలు అల్లుతోంది. సరోజ అమ్మ వొళ్లో తలపెట్టి పడుకుని చదువుకుంటోంది. సరోజ తమ్ముడు మోకాళ్లమీద కూర్చొని సరోజ చదువుకుంటున్న పుస్తకంలోని బొమ్మలను చూస్తూ వాటికి వ్యాఖ్యానం చెబుతున్నాడు, తనకంటే చిన్నదైన చెల్లెలికి. వాడు ఠక్కున లేచి కూర్చుని 'అక్కా! లవకుశులలో ఎవరు పెద్ద? చెప్పు' అన్నాడు. 'లవుడేలేవోయ్' అంది సరోజ నిర్లక్ష్యంగా 'ఓడిపోయావ్, ఓడి పోయావ్' అంటూ చప్పట్లు కొట్టాడు వాడు. సరోజ లేచి కూర్చుంది. 'ఎందుకనో చెప్పు' అంది ఉక్రోషంతో. 'లవుడు ఎంత వయసువాడో ఏ రూపువాడో కుశుడు కూడా అంత వయసువాడు అదే రూపువాడు. ఒకసారి లవుడు ఉయ్యాలలో కన్పించలేదని, వాల్మీకి తన మంత్రశక్తితో ఒక దర్భ పుల్లను సరిగ్గా లవుని లాంటి పిల్లవానిగా చేశాడు. నిజానికి లవుడ్ని సీత తనతో తీసుక పోయింది

పూజా పుష్పాలకు అడవిలోకి వెళ్తా. కళ్ళు మూసుకుని తపస్సు చేసుకునే వాని పిల్లవానికి కాపలా ఏం ఉంటాడు లెమ్మనుకుంది ఆవిడ. పాపం, ఆ విషయం తెలీదాయనకు. తను కళ్ళు మూసుక కూర్చున్నప్పుడు ఏ పులో, మరో జంతువో నోటగరచుక పోయిందని భావించాడు. ఆ విషయం సీతమ్మకు తెలియనివ్వకూడదని కుశుడ్ని సృష్టించాడు. అలాంటప్పుడు ఆ ఇద్దరిలో పెద్ద, చిన్నల ప్రసక్తి లేదు.

సరోజ వాళ్ళమ్మ అల్లుతున్న స్వెట్టరును అవతల పడేసి కొడుకును బుగ్గలు తడిమి, మెటికలు విరిచి, గుండెలకి హత్తుకుంది. ఉక్రోష మొచ్చిన సరోజను కూడా దగ్గరికి తీసుకుని ముద్దు పెట్టుకుంది. ఇంతలో జయమ్మను చూసి 'రా జయం' అంటూ ఆప్యాయంగా పలుకరించింది. ఐదుగురు బిడ్డల తల్లి, ఆ తల్లి మొహంలో ఎప్పుడూ విసుగు, చిరాకు, కోపం చూసి ఎరగదు జయమ్మ. సన్నగా సౌమ్యంగా మాట్లాడుతుంది. ఆవిడను చూస్తుంటే తను కూడా సరోజకు అక్కగానో చెల్లెలిగానో పుట్టివుంటే ఎంత బావుండేదో అనిపించింది. ఆ పారవశ్యంలో 'అమ్మా' అని సరోజ వాళ్ళమ్మను పిలువ బోయింది కూడా. కాని ఎలాగో నిగ్రహించుకుంది. 'నయమే, నిజంగానే పిల్చాను కాదు. పదకొండేళ్ళ పిల్లవు పరాయి తల్లిని అమ్మా అని ఎలా పిల్చావే' అని నలుగురు నాలుగు విధాలా అనే వాళ్ళు, ముఖ్యంగా తనతల్లి— అనుకుంది జయమ్మ. తనకే సరోజ వాళ్ళమ్మ అంత మంచిదిగా కనిపిస్తే సరోజకు ఆవిడంటే ఎందుకిష్టముండదు?

జయమ్మ ప్రక్కకు వత్తిగిలింది. చాలాసేపట్నుంచి ఒకేవైపుపడుకోడం వల్లనేమో, కుడిచెంప మొద్దుబారి తిమ్మిరెక్కింది. చేత్తో చెంపను రుద్దుకుంటూ కిటికీలోనుంచి చూసింది. ఊరంతా నిద్రపోయింది. చీకట్లోని కీచురాళ్ళు ఒకటే రొద చేస్తున్నాయి. చీకటైనా భయంలేదు తనకు. కాని కీచురాళ్ళ అరుపులంటే పరమ అసహ్యం. చెవులు రెండూ విన్పించడం మానేస్తే బావుండుననేటంతటి చిరాకు. అమ్మగొంతులో ఎన్ని కీచురాళ్ళున్నాయో ననిపిస్తుంటుంది!

ఒకసారి నాన్న ఏదో పనిమీద తెనాలి వెళ్ళివచ్చాడు. ఇంటికి వచ్చేసరికి రాత్రి పద్దైంది. ఆయన రాగానే అమ్మ అడి

గింది 'వాళ్ళింటికి వెళ్ళొచ్చారా?' అని.

'ఎవరింటికి?'

'అదేనండి, అవధాన్లుగారింటికి.'

'ఏ అవధాన్లు, ఎందుకు?'

'అదేమిటండీ, వాళ్ళబ్బాయికి మనమ్మాయిని యిస్తే బావుంటుందని మొన్న మా పినతల్లి దగ్గర్నుంచి ఉత్తరం రాలా?' దీర్ఘం తీసింది.

'నే నిప్పుడు పెళ్ళి సంబంధాలు చూడటానికి వెళ్ళనా, కోర్టుపనిమీద వెళ్ళానా?'

'ఏపనిమీద వెళ్తేనేం. అన్ని పనులూ చూసుక రాగూడదూ? ఏపనిమీద వెళ్తే అంతవరకే పూర్తిచేసుకరావాలని శాస్త్రంలో రాసుందా? పిల్లకు పన్నెండేళ్ళు నిండుతున్నాయి గదా. ముందునుంచీ కొంచెం తొందరపడి కాస్త మంచి సంబంధం వెదుకుదామనే ఇది ఎందుకుండదు మీకు? అసలు మీకా యావే వున్నట్లు కనిపించదేం ఖర్మ. అయ్యో, అయ్యో, అయ్యో! నలుగురూ ఏమైనా అనుకుంటారనే ఇంగితం కూడా లేకపోయె మనిషికి. ఛీ ఛీ' అంటూ లోపలికి వెళ్ళింది.

'ఇంగితం నీకుంది? తిరిగి తిరిగి వచ్చిన మొగుణ్ని గడపదగ్గరే ఆపి, ఏదో ముంచుకపోయినట్లు వ్యవహారాలు మాట్లాడకపోతే, కొంచెం నిదానించి, తీరిక చిక్కింతర్వాత అడక్కూడదూ అవన్నీ, నీ ఖర్మగాదు, నా ఖర్మ' అని తిట్టిబాదుకోడం ప్రక్క గదిలోని తను చూసింది. చూసి, మనసుకు కష్టంతోచి కళ్ళుమూసుగుంది.

ఇప్పుడా సంఘటన జ్ఞాపకమొచ్చి మళ్లీ మనసు చివుక్కుమంది. కళ్ళుమూసుగుంది. దూరంగా చంటిపిల్లవాని ఏడ్పు—ఆ ఏడ్పు సగంలోనే ఆగిపోవడం — విన్పించింది. మాతృస్తన్యంతో ఏడుపు సగంలోనే విరిగి వుంటుందని అనుకుంది జయమ్మ.

కిటికీదగ్గర మనిషి అలికిడి వినిపించింది. జయమ్మ కళ్ళుతెరిచి చూసేసరికి అక్కడెవరూ లేరు. బహుశః అమ్మగాని, నాన్నగాని వచ్చివుండవచ్చు, తనని అన్నానికి పిలవడానికి. తను నిద్రపోతున్నాననుకుని నిద్రలేపడం యిష్టంలేక మళ్లీ వెళ్ళిపోయారేమో ననుకుంది.

తను అన్నం మానేస్తే అమ్మా, నాన్న ఇంతగా మథనపడిపోతున్నారు. పాపం ఆవు దూడపాలు తాగలేదుట. ఆవు తన బిడ్డకు ఆకలి తీరలేదని బాధపడుతోందా? అసలు దూడకేమైంది? జ్వరమా? తలనొప్పా? ఏదైనా, మందు యివ్వవద్దూ? మందు లేకుండా ఎలా తగ్గుతుంది?

జయమ్మ నవ్వుకుంది. ఏమిటీ తన ఆలోచనలు? ఇలాంటి ఆలోచనలు తనకేనా లేక అందరికీ వస్తుంటాయా? సరోజ కూడా యిలానే ఆలోచిస్తుంటుందా? సరోజకేం ఖర్మం? హాయిగా అమ్మతో కబుర్లు చెప్పుకుని నిద్రపోతూ తీయటి కలలు కంటుంటుంది. జయమ్మ కెందుకో ఏడ్పు గొంతువరకూ వచ్చి ఆగిపోయింది ...

ఆ రోజు సరోజ తమ్ముడు వచ్చి 'నిన్ను మా అక్క అర్జంటుగా రమ్మంటోంది' అని చెప్పాడు. తను వెళ్ళింది. వరండాలో సరోజవాళ్ల అమ్మ కన్పించి తనని చూసి నవ్వింది. తన వూహలోని 'అమ్మ' మొహం ఆమెలో కన్పించి క్షణం ఆగి చూస్తూ నిల్చుంది. 'సరోజ లోపల వుంది, వెళ్ళు జయం' అంది ఆమె. తనులోపలికి వెళ్ళింది. అక్కడ ఎవరో కూర్చుని పుస్తకం చదువుతోంది. 'సరోజ ఎక్కడ' అని తను అడిగింది. జవాబుగా గలగలమని నవ్వుతూ కూర్చున్న ఆ వ్యక్తి లేచి తన దగ్గరకు వచ్చింది. తను పోల్చుకోలేదు ఆమె సరోజ అని. అరే! ఏమిటి ఈ మార్పు!

తను ఆశ్చర్యంలోనుండి తేరుకోక ముందే సరోజ అడిగింది. 'జయం, ఎలా వున్నాను నేను చీర కట్టుకుంటే. మా అమ్మ పట్టుచీర యిది. దీని ఖరీదెంతో తెలుసా'

తనకా వివరాలన్నీ అక్కర్లేకపోయాయి. తను అడిగిందల్లా ఒక్కటే 'నీవు చీరె ఎందుకు కట్టుకున్నావ్?'

'ఎందుకేమిటి, మా అమ్మ కట్టుకోమంది. లేదు, కట్టింది'

'ఎందుకు?'

'నీ ప్రశ్నలకు జవాబులు చెప్పలేను బాబూ' అని బుంగమూతి పెట్టి, 'చీర కట్టుకోడమే కాదు, ఇంకా ఇలాంటివెన్నో నేర్చుకోవాలిట మా అమ్మచెప్పింది.' అన్నది.

ఇంతలో సరోజ వాళ్ళమ్మవచ్చి 'నీవు కూడా ఓసారి చీర కట్టుకో రాదూ' అన్నది నవ్వుతూ.

'నా కెందుకూ?' తనకేమో లేనట్లు

తక్కువైనట్లు మనసులో వెలితి ఏర్పడింది.

'మంచిదానివి, పధ్నాలుగో ఏడు వస్తోంది కదా, రేపో మాపో పెద్దమనిషి వౌతావ్. ఎందుకంటా వేమిటి' అన్నదామె.

తను వెంటనే యింటికి వచ్చేసింది, వాళ్ళు పిలుస్తున్నా విన్పించుకోకుండా.

ఎంతసేపటికీ తనకు పెళ్ళి, సంబంధం చూడటం — ఇలాంటి విషయాలే అమ్మ నాన్నతో మాట్లాడుతుంది. సరోజ వాళ్ళమ్మలాగా తనకి చీర కట్టుకోడం, అలాంటి విషయాలెప్పుడూ చెప్పదు. సరోజ వాళ్ళమ్మ సరోజ పెళ్ళిని గురించి ఎప్పుడూ మాట్లాడినట్లు లేదు. పైగా వింత వింత కబుర్లు, విశేషాలు ఎప్పుడూ చెబుతుంటుంది ఆసక్తిగా. ఏమిటీ తేడా ఈ అమ్మకు, ఆ అమ్మకూ ?

సరోజ వాళ్ళమ్మ ఎప్పుడూ పుస్తకాలు చదువుతుంటుంది. అమ్మ ఎప్పుడైనా చదివితే వచనభాగవతం చదువుతుంది అందుకని సరోజ వాళ్ళమ్మకు క్రొత్త క్రొత్త విషయాలు తెలుస్తుంటాయేమో. వాటిని సరోజకు చెబుతుంటుంది. మరి తనూ పుస్తకాలు చదివి తెలుసుకోవచ్చుగా. ఈ ఆలోచన బాగా ఉందనిపించింది జయమ్మకు. చక్కటి ఆలోచన తనకు వచ్చినందుకు తననుతానభినందించుకుంది.

చదివిన కొద్దీ యింకా చదవాలనే తృష్ణ బయలుదేరింది జయమ్మలో. ఎన్నో పుస్తకాలలో తల్లి, బిడ్డల అనుబంధాల్ని గురించి, ప్రేమాను రాగాల్ని గురించి చదివింది. ఆ రచనలు ఆమెలో తల్లి, బిడ్డల బాంధవ్యాల్ని గురించి కొన్ని దృఢమైన అభిప్రాయాలను కలిగించాయి. నిజ జీవితానికీ సాహిత్యానికీ ఉండే తారతమ్యాలూ, సారూప్యాలూ బోధపడ్డాయి.

జయమ్మ ఆవులించింది. మనసు అలసిపోయింది. నిద్రాదేవి వొడిలోకి జారిపోబోయింది. ఇంతలో—

'అంబా' అనే శబ్దం వినిపించింది. జయమ్మ లేచి కూర్చుంది. పాలు తాగని ఆవుదూడ గుర్తొచ్చింది. పాపం, దానికెలా వుందో! ఆవు అరుపు వినిపించింది ప్పుడు. ఆవు ఎందుకు అరిచింది? దూడకేమీ కాలేదు గదా! పాపం, ఆ దూడంటే ఆవుకు ఎంత ప్రేమో? దూడ శరీరమంతా నాలుకతో తడుపుతుంది ఆవు. నోరులేని జంతువులు ప్రేమను వ్యక్తం చేసే చేష్ట అదేగా! తల్లి ప్రేమ వాహినిలో మునిగి తేలడం ఎంత అదృష్టం! ఆ అదృష్టం తనకు లేదు. ఆవు దూడకుంది. సరోజకూ వుంది. 'నీ మీద మీ అమ్మకు ప్రేమ లేదనుకున్నావా' అని ఎవరో అడిగినట్లయింది తనను. ఆ ప్రశ్న తనూ చాలా సార్లు వేసుకుంది. కాని, ప్రేమ ఉన్నదా లేదా అనికాదు తనకు కావలసింది. ఆ ప్రేమ సరైన మార్గంలో తనకు నచ్చే విధంగా ప్రదర్శితమవుతోందా లేదా అని. నోరులేని జంతువుల పాటి ప్రేమ ప్రకటన అమ్మ ఎందుకు చేయలేక పోతోంది?

జయమ్మ మంచం దిగి నిల్చుంది. అన్నం తినకపోవడం వల్లనేమో వళ్ళు తూలింది. గోడను పట్టుకుని నిలద్రొక్కుకుంది. అక్కడే వున్న కూజాలోని మంచి నీళ్ళు రెండు గుక్కలు తాగి క్రిందకు దిగింది. దూడను ఆవు దగ్గరికి తీసుకవెళ్ళి వదిలి రావాలని, దూడ తల్లి దగ్గర పాలు తాగుతుంటే ఆ రెండు జంతువుల హావభావ ప్రకటనను చూడాలనుకుంది.

ఆవు దూడ వెల్లకిలా పడుకుని వుంది. కదలిక కల్పించలేదు దానిలో. దూడకు దగ్గరగా పోయింది. చీకట్లో తను చూడనేలేదు, దూడ నీళ్ళు త్రాగటానికని అక్కడ పెట్టివున్న దబరా గిన్నె తన కాలికి తగిలి శబ్దం చేస్తూ దొర్లింది. గిన్నెలో మిగిలి వున్న కాసిని నీళ్ళు నేల మీద మడుగు గట్టేయి.

ఆ ధ్వనికి యింట్లో నుండి రాఘవయ్య, మీనాక్షమ్మ హడావిడిగా బయటికి వచ్చారు. 'ఎవరూ, జయం!! సుబ్బా!!!' రాఘవయ్య లైటు వేశాడు.

'ఏమిటే తల్లీ. ఇంత రాత్రప్పుడు ఒక్కర్తెవూ క్రిందికి దిగి వచ్చావుటే. ఏం చేస్తున్నావిక్కడ? తల నొప్పి తగ్గిందా? వొంట్లో ఎలా వుంది? ఏదీ, యిలారా చూస్తాను.'

మీనాక్షమ్మ మాటలు పూర్తికానే లేదు. కెవ్వుమని కేకవేసి జయమ్మ మేడపైకి పరుగెత్తింది. చిరుమెట్టు ఎక్కుతూనే కుప్పలా కూలిపోయింది.

రాఘవయ్య, మీనాక్షమ్మ గుండెలు బాదుకుంటూ, శోకాలు పెడుతూ పైకి చేరారు. ఆ గోలకు ఆవు బెదిరిందేమో గాడచుట్టూ తిరుగసాగింది.

* * *

తెల్లారింది. తెల్లవార్లూ రాఘవయ్య, మీనాక్షమ్మ, డాక్టరు— కన్ను మూయ లేదు. జయమ్మ కన్ను తెరవనూ లేదు.

బారెడు పొద్దెక్కినా ఆవును గురించి, దాని మేత, నీరు గురించి ఎవ్వరూ అనుకోలేదు ఆవు దూడను గురించి ఎవరూ అనుకోవలసిన అవసరం లేకపోయింది. మరి కాసేపటికి ఆవు దూడను ఎవరో తీసుక వెళ్లేరు. ఆవు చూస్తూ నిల్చుంది. అంబా



అయిన తర్వాత కాసేపు అటూ యిటూ పిచ్చిగా తిరిగింది.

ప్రొద్దు తిరిగేసరికి జయమ్మకు జ్వరం జారింది. కళ్ళు తెరిచింది. ఆ కళ్ళలో ఇదివరకటి వెలుగులేదు. పిచ్చిగా చూస్తుంది. భీతితో వణుకుతుంది. దిగులుగా కూర్చుంటుంది, పిలిచినా పలుకదు. పలికినా మన భాష మరచి పోయినట్లు అర్థంలేని మాటలు. ఎప్పుడూ మేడమీది గదిలో కిటికీ దగ్గర కూర్చుని క్రిందకి చూస్తుంది. నెమరువేస్తూ పడుకున్న ఆవును చూసి నిట్టూరుస్తుంది.

అలా ఎన్నాళ్ళు కూర్చుందో!

* * *

ఇది జరిగి ఎన్నాళ్ళో అయింది.

పురిటికోసం పుట్టింటికి వచ్చింది సరోజ. మనవడికోసం వూలుతో స్వెట్టరు అల్లుతోంది సరోజ వాళ్ళమ్మ.

ఉన్నట్టుండి ఏదో గుర్తుకువచ్చిన దానిలా అడిగింది సరోజ 'అమ్మా జయమ్మ ఎలావుందమ్మా ?'

'జయమ్మ కేమే. నిక్షేపంలా వుంది. సాహితీ లోకాన్ని ఊపేస్తోందనుకో. ఆమె కథగాని సీరియల్‌గాని, గేయంగాని, నాటిక గానీ లేకుండా ఏ పత్రికా రావడం లేదంటే నమ్ము. అమ్మాయ్ సరూ! తల్లిప్రేమ ఎలావుండాలో; పిల్లలపెంపకం ఎలా వుండాలో నీవు తెలుసుకోవాలంటే జయమ్మ రాసిన నవలలు చదివి తీరాల్సిందే.'

'అయితే ... అమ్మా! జయ అనే పేరుతో...'

'జయమ్మే రాస్తోంట.'

సరోజ సంతోషాన్ని పట్టలేకపోయింది. చిన్ననాటి స్నేహితురాల్ని ఎప్పుడు చూద్దామా అనే తహతహతో జయమ్మగారింటికి వెళ్ళింది.

'ఎవరూ?' అంది పుస్తకం చదువు కుంటున్న జయమ్మ, సరోజను చూస్తూనే.

'నేను జయం! సరోజని' అన్నది ఆనందంతో సరోజ.

'ఓ...నువ్వా' అంటూ తిరిగి పుస్తకం తెరిచింది జయమ్మ, నిర్లిప్తంగా.

# జి-11 తో
# తయారయిన
# సింథాల్
# మిమ్ములను మిగతవానికంటె,
# కాపాడును

(సింథాల్ టాయిలెట్ పౌడరుయందు గల జి-11 (హెక్సాక్లోరోఫీన్) హానికరమైన, క్రిములను నిర్మూలించు, అసమాన పదార్థము. చెమటలో కూడిన దుర్గంధమును నిరోధించును. మిమ్ములను రోజల్లా సువాసనతో హాయిగా ఉంచును.






INTERPUB/GCP/15


గురూ! ఖరెంటు పోయినట్టుంది - ఈ కొవ్వొత్తి కొస్త వెలిగించవోయ్!


తెచ్చిన మందు సామానులో అప్పుడే మూడొంతులు తగలెట్టాడు ఈ వెధవ - పండక్కి ఏవీ లేకుండా చేసేట్టున్నాడని....


మా వారికి టపాకాయల వెలుగు చూడ్డం అన్నా శబ్దం వినడం అన్నా చచ్చేంత భయం!


దీపావళి మందు
సరుకు సామాను
నాయనా! దీని ధర మండినట్టు ఇది మండుతుందా లేక తుస్సుమంటుందా?


పేల్చడానికి భయపడేవాడివి ఇంత పెద్దది ఎవడు చేయమన్నాడ్రా నిన్ను?? సరేగాని ముందు నువ్విక్కడ్నుంచి ఫో! నేనూ ఇది అంటించి పరుగెట్టుకొస్తా!


మీ వాడిది మనోవ్యాధండి దీపావళి పిస్తోలు కొనిస్తే పోతుంది!


భయంకరంగా కేవ్వున అరవాలి తల్లీ అని చెబితే - ఊహుఁ - నాకు రాదు అని గారాలు పోతోంది - ఒక్క ఓటు వెలిగించి మీదికి విసిరానంటే చచ్చినట్టు అరుస్తుంది ఏమంటారు?


ఇదుగో రాణీ! ఇప్పుడే నేనో బాంబు పేల్చానని పోయి మీ నానతో చెప్పు - పిరికి వెధవ ననుకున్నాడు గామోసు!

**సీరియల్**



### జరిగిన కథ

సుజాత పుట్టగానే సూర్యం భార్య అన్నారు పెద్దవాళ్ళు. సుజాతకి సూర్యంపై అపేక్షలేదు. సూర్యానికి చదువు అబ్బకపోవడమూ, అతని ప్రవర్తనా సుజాత తల్లిదండ్రుల మనస్సును కూడా మార్చివేసింది. సుజాత అన్నపూర్ణా ఇంజినీరింగ్ వర్క్సులో టైపిస్టుగా చేరింది. ఆకంపెనీ యజమాని నీలకంఠం. అతని కొడుకు శ్రీధర్. శ్రీధర్‌కి సుజాతపై అమితమైన ప్రేమ. సుజాత శ్రీధర్‌ల వివాహానికి మొదట్లో నీలకంఠం అంగీకరించక పోయినా తర్వాత సంతోషంగా ఆ తంతు జరిపించేస్తాడు. రాజారావు శ్రీధర్ మిత్రుడు. అతన్ని చూసినప్పుడు సుజాత చాలా భయపడింది.

## 11

వేగంగా పోతున్న రిక్షా మెల్లిగా ఆగింది.

'ఏమయింది?' అంది సుజాత, అసలే ఆలశ్యం అయిపోయిందను కుంటూంటే మధ్యలో ఈ అవాంతరం ఏమిటని భయంగా, విసుగ్గా.

'చైను వూడిపోయింది' అంటూ దిగి సరిచెయ్యటానికి ఉపక్రమించాడు.

చిరాగ్గా ఇటూ అటూ చూస్తూ కూర్చున్న సుజాత ప్రక్కనుంచి దూసుకు పోయిన కారు గుర్తుపట్టి ఉలిక్కిపడింది.

'వారు నన్ను చూసివుండరు' అని తనకి తనే ధైర్యం చెప్పుకోటానికి ప్రయత్నించింది. 'ఇప్పుడు తిన్నగా ఆఫీసుకే వెళ్తారో ఇంటికే వెళ్తారో—ఇంటికి వెళ్తే నేను లేకపోతే ఏమనుకుంటారో...' తన వంకేచూస్తూ కారు రివర్సు చేసుకు వస్తున్నాడు భర్త. తప్పుచేసి పట్టుబడి పోయినట్లు వణికిపోతూ మెల్లిగా రిక్షా దిగింది.

'దిగుతా రెందుకమ్మా అయిపోయింది' అన్నాడు రిక్షాఅబ్బి.

'మాకారు వచ్చిందిలే' పర్సులోనుంచి డబ్బు తీసిఇచ్చి వెళ్ళి తలుపు తెరుచుకుని కూర్చుంటూంటే, 'ఏమిటిలా అనుకోకుండా బయలుదేరావు—నువ్వేనా అని అనుమానం వచ్చింది చూడగానే' అన్నాడు

సమాధానంకోసం తడుము కుంటున్న సుజాత అది పైకి తెలియకుండా సర్దుకుని కూర్చుని, రుమాలుతో మొహం మెడ తుడుచుకోటం మొదలుపెట్టింది.

'ఇస్ అబ్బా'

'మీ స్నేహితురాలు వూరునుంచి వచ్చిందా?' కారుస్టార్టుచేస్తూ అన్నాడు.

'అహ తనింకా రాలేదు—ప్రమీలావాళ్ళకి హౌసింగ్‌బోర్డులో ఇల్లు దొరికిందిట. అక్కడికే వెళ్ళిపోతున్నాం ఎప్పుడయినా రండి అంటూ చెప్పింది ఆమధ్య—మధ్యాహ్నం ఏం తోచలేదు—చూసి వద్దామని పించింది...'

'అబ్బ అంతదూరం రిక్షాలో వెళ్ళావా? ఇవాళ ఎండంతా నీపరమే అయిందన్నమాట — మొహంచూడు ఎలా కమిలిపోయిందో—ఉదయం చెప్తే కారు పంపించే వాడిని—అప్పటికప్పుడు అనుకుంటే మాత్రం మధ్యాహ్నం ఫోనుచెయ్యక పోయావా' మెత్తగా మందలించాడు.

'గోవిందయ్య ఇవాళ శలవులో వున్నాడని చెప్పారుకదూ—అయినా వేసంకాలపు ఎండ కాదు కదా...'

'సర్లే—గోవిందయ్య లేకపోతే మాత్రమేం—నేను ఫ్యాక్టరీకి వెళ్ళేటప్పుడు నిన్ను అక్కడ దింపేసి, మళ్ళీ వచ్చేటప్పుడు తీసుకువచ్చేవాడిని...' ఆమాత్రం తోచలేదా అన్నట్లుంది అతని గొంతు.

'నిజమే నాకు తోచలేదు — అయినా ఆఫీసుకికూడ ఫోనుచేసి మీతో మాట్లాడుతూ కూర్చుని, నన్ను వెంట వేసుకుని తిప్పమంటే మామయ్యగారేమనుకుంటారు తెలిస్తే?—'

'ఏమనుకుంటారు?' నవ్వుతూ రెట్టించాడు.

సుజాత మూతి ముడుచుకుంది.

'ఏమంటోంది మీ శిష్యురాలు? కాస్సేపటి తరువాత హఠాత్తుగా అతను అడగడంతో అంతవరకూ ఆలోచిస్తూ కూర్చున్న సుజాత తడబడుతూ, 'ఎవరూ, ప్రమీల మాటేనా, మీరు అటు వెళ్ళిపోయారు ఇటు వచ్చేశాం ఇంక నాకు చదువుచెప్పే వారే లేకపోయారు అంటూ మొదలుపెట్టింది—ఏమిటా అర్థంపర్థం లేని వాగుడు అంటూ వాళ్ళమ్మ కేకలేసింది—తను అన్నదాంట్లో తప్పేముందో అర్థం కాక బిత్తరపోయిందామ్మాయి పాపం—పోనీ నాతో మాయింటికి వచ్చేసెయి అన్నాను నేను నవ్వుతూ—'

పోర్టికోలో కారు ఆగటంతో సుజాత చెప్పటంకూడ ఆపేసింది.

'చాలా అలిసిపోయావుకాని—కాస్సేపు రెస్టు తీసుకుని ఆ తరువాత రెడిగా వుండు. నేనో అరగంటలోవస్తా' అంటూ కారు రివర్సుచేసుకుని వెళ్ళిపోయాడు.

* * *

కల్లోలిత మహాసాగరంలో ఎగిరెగిరి

పడుతోంది సుజాత అంతరంగం—అన్ని వేపులనుండీ అశాంతి చుట్టుముట్టి విలయ తాండవం చేస్తూంటే తను వాటి మధ్య నిస్సహాయంగా ఒంటరిగా నిలబడిపోయి నట్టుగా వుంది—ఏమిటి ఈ జీవితం ? ఈ వర్తమానం ఎలాగో గడిచిపోతుంది, ఆ తరువాత వస్తుంది శాంతి సౌఖ్యాలని నింపుకున్న భవిష్యత్తు అని ఆశలు పెంచు కునే అర్హత తనకి లేదు—రేపు అనేదాన్ని గురించి తలుచుకోవాలంటేనే భయం వేస్తోంది—

మంచం మధ్యగా కూర్చుని, ముడుచు కున్న కాళ్ళచుట్టూ రెండు చేతులూ పెనవేసి మోకాళ్ళమీద గడ్డం ఆనించు కుంది—జరగబోయే కీడు అలా ఎదురుగా కనిపిస్తున్నట్లే అపాదమస్తకం జలద రిస్తోంది — గుండెలలోనుండి వువ్వెత్తుగా వుబికివస్తోంది ఆవేదన—కళ్ళు ఎన్నిసార్లు ఒత్తుకున్నా అశ్రువులని అరికట్టటం సాధ్యంకాక అలాగే వూరుకుంది—ఆ కన్నీళ్ళు ఓడి చీర మడతలో ఇంకిపోతున్నాయి—తన అదృష్టాన్ని అపహాస్యంచేసే సంఘటనలు, తన జీవితం చుట్టూ అశాంతి వలయాలు పరచిన సంఘటనలు అలా కళ్ళ ముందు కదిలిపోతూంటే రెప్పవాల్చకుండా చూస్తూ కూర్చుంది...అవాళ...

సుజాత రిక్షా దిగి లోపలికి వెళ్ళేసరికి రాజారావు వరండాలోనే ఓ కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు. అలికిడి విని తల ఎత్తి, ఆమె నమస్కారం అందుకుంటూ 'నువ్వా—రా.' అంటూ ఆహ్వానించాడు.

'చాలా రోజులు కాలేజీకి రాలేదు కదా—నా అంతట నేను చదువుకుంటే కొన్ని అర్థం కావటంలేదు—రమా నేనూ రావా లనుకున్నాం—తనకి తల నొప్పిగా వుందండి' ఎంతో మొహమ్మాటపడిపోతూ అంది.

'ఫరవాలేదు — నేనే చెప్దామనుకున్నా నసలు.' అంటూ వరండాకి వున్న కట కటాల తలుపులు గడియపెట్టి ప్రక్క గదిలోకి దారితీశాడు.

ఆ గదిలో టేబిలు నాలుగు కుర్చీలు వున్నాయి. ఎవరైనా వస్తే మాట్లాడటా నికి, స్టూడెంట్సు వస్తే చదువు చెప్ప టానికి పిల్లలు గొడవ చెయ్యకుండా ఆ గదిలో కూర్చుంటాం అని చెప్పాడు అది వరకు వచ్చినప్పుడు—రాజారావు పిల్లలు నాలుగేళ్ళ అమ్మాయి రెండేళ్ళ అబ్బాయి, ఇల్లు పీకి పందిరివేసే రకం—ఇవాళ పిల్లల గొడవ, అసలు ఇంట్లో మరో మనిషి వున్న అలికిడి ఏమీ కావటంలేదు. సుజాత గుండెలు బితుకుబితుకు మంటు న్నాయి. 'మీ వాళ్ళంతా ఎక్కడికయినా వెళ్ళారా.' అంది తెల్ల తెల్లబోతూ.

'వాళ్ళమ్మకి జబ్బుగా వుందని వుత్తరం వస్తే నిన్ననే వెళ్ళారు—అవసరం అయితే టెలిగ్రాం ఇవ్వండి నేనూ వస్తానని చెప్పాను.' కుర్చీలో కూర్చుంటూ సుజాతకి మరో కుర్చీ చూపించాడు.

'నేను మరోసారెప్పుడయినా వస్తాను' సుజాత నాలుక చివరిదాకా వచ్చినమాటలు పెదవిదాటి బైటికి రాలేదు—'ఛ! తనెంత సంకుచితంగా ఆలోచిస్తోంది— వివాహితుడు తన గురువు, తన తెలివితేటలు విని మెచ్చుకుంటూ తన వున్నతికోరే వ్యక్తి— తన భయం అర్థం చేసుకుంటే ఆయనే మనుకుంటాడు?'— తలవంచుకుని పుస్తకం తెరిచింది.

'ఈ చివరి ఛాప్టర్లు కదూ?' అంటూ పుస్తకం అందుకుని చూసి, ప్రక్కని



పెట్టి చెప్పటం మొదలుపెట్టాడు.

'తను పదిసార్లు చదివినా అర్థం కాని విషయాలు మాష్టారి నోటంట ఒక్కసారి వింటే ఎంతో బాగా తెలుస్తాయి—అప్పుడింకొక్కసారి చదువుకుంటే చాలు' అనుకుంటూ వచ్చింది కాని ఇవాళ ఆయన చెప్తున్న ధోరణి వింటూంటే అదివరకు అర్థం అయాయి అనుకున్నవి కూడ మరిచిపోతానేమోననిపించింది — ఏమిటి బొత్తిగా ఇలా చెప్తున్నాడు అనుకుంటూ తలయెత్తి అతని మొహంలోకి చూసింది— మనస్సు స్థిమితం లేనివాడిలా, తన మాటలు తనకే అర్థం కానివాడిలా అయోమయంగా చెప్పుకుపోతున్నాడు.

'మాష్టారివాళ మామూలుగా లేరు.' అనుకుంది సుజాత. 'అత్తగారి ఆరోగ్యం గురించి ఆదుర్దాగా వున్నారేమో — ఛ. నేనివాళ రాకుండా వుండాల్సింది—అయినా నాకేం తెలుసు ఇలా అయిందని.' ఆయన ఎంత శ్రద్ధగా పాఠం చెప్తున్నారో, సుజాతకూడ అంత శ్రద్ధగానూ వింటూ, ఆయన ఒక్కక్షణం కాస్త ఆగితే 'వెళ్లిపోతానని' చెప్పాలని చూస్తోంది. కాని

## సుజాత

ఆ అవకాశం ఇవ్వకుండా ఒకే ధోరణిలో చెప్పుకుపోతున్నాడతను— ఎప్పటికో ఆగింది ఆ చెప్పటం.

'మీకు చాలా శ్రమ ఇచ్చాను — ఇంక వెళ్తాను— థ్యాంక్స్' అంటూ లేచింది.

'కూర్చో కాఫీ తాగి వెళ్దువుగాని,' అంటూనే లోపలికి వెళ్లాడు. 'ఇప్పుడే తాగివచ్చాను' అని ఆమె చెప్తున్నా వినకుండా.

'మధ్యాహ్నం ఫ్లాస్కునిండా కాఫీపోసి ఉంచా అంటూ' ఫ్లాస్కు రెండు గ్లాసులు తెచ్చాడు.

కాఫీ తాగుతూ మెల్లిగా కబుర్లు మొదలుపెట్టాడు. గబగబా తాగటం పూర్తిచేసి గ్లాసు టేబిలుమీద పెట్టి లేచింది.

'వెళ్తున్నావా?' అతని గొంతు కొత్తగా వణికింది—అది సుజాత అర్థం చేసుకునేలోగానే అతని చేతులు ఆమె భుజాలని చుట్టేశాయి — ఒక్కక్షణం ఉక్కిరిబిక్కిరయిపోయింది— 'మాష్టారూ' అంది

'మీరు చెప్పినట్టే ఈ మందును చల్లగా, చీకటిగా వుండేచోట పెట్టివుంచానండీ! మ్చ్! జ్వరం తగ్గలా!



గొంతు పెగల్చుకుని — చేతిలో పుస్తకాలు జారి క్రిందపడిపోయాయి— అతని పట్టు విడిపించుకోటం సాధ్యం కాలేదు— ప్రాధేయపడింది— ఏడ్చింది — నోటికి వచ్చినట్లు తిట్టింది— మీరు ఇన్నాళ్లనుండి నాయందు చూపిస్తున్న అభిమానానికి అర్థం ఇదా అని అడిగింది...మత్తుగా నవ్వటం తప్ప అతను దేనికీ సమాధానం చెప్పలేదు...అవును, మరి అతనిలోని పశుత్వం ప్రకోపించింది— ఉచితానుచితాలు విస్మరించి కేవలం దానవుడైపోయాడు.

ప్రపంచాన్ని పలచటి చీకట్లు అలుముకుంటున్నవేళ. అంతకన్నా చిక్కటి చీకటిని గుండెలనిండా నింపుకుని రోడ్డుమీదికి వచ్చింది సుజాత—తల లిప్పితే చాలు భూత గృహంలాంటి ఇల్లు—ఆ ఇంట్లో మరో వాటా వాళ్లెవరూ లేకపోవటం, ఇరుగూ పొరుగూ వున్న ఇళ్లు కూడా కాస్త దూరంగా వుండటంవల్ల జరిగింది. ఎవరికీ తెలిసే అవకాశంలేదు—ఎవరికీ తెలియనంత మాత్రాన తనలో మాలిన్యం లేకుండా పోతుందా—ఇప్పుడేమిటి చెయ్యటం. ఎక్కడికి వెళ్ళటం — ఆలోచించటానికి కూడ ఓపిక లేనట్లు అలసిపోయిన సుజాత ఎదురుగా కనిపించిన రిక్షా ఎక్కి కూర్చుంది. 'ఎక్కడికి.' అని అని అతను అడిగినదానికి తన యింటి గుర్తు చెప్పింది ఇంకేం చెయ్యాలో తెలియక—

తడబడుతూ ఇంట్లోకి వెళ్లింది— వీధి వరండాలో తండ్రి కనిపించలేదు— గుండె కాస్త కుదుటబడింది. దగ్గరగా వేసివున్న తలుపులు తోసుకుని హాల్లో అడుగుపెట్టింది.

'ఎవరూ ?' తలుపు చప్పుడు వినిపించి పెరట్లోనుంచే ఓ కేక పెట్టింది మీనాక్షమ్మ.

'నేనే.' తన గొంతు తనకే కొత్తగా వికృతంగా వినిపించి, అమ్మ ఏమయినా పసిగడుతుందేమోనని భయపడుతూ పుస్తకాలు టేబిలుమీదికి విసిరేసి బాత్‌రూమ్ వేపుకి వెళ్లిపోయింది—మొహం కడుక్కుని వచ్చి కాసిని మంచినీళ్లు తాగి గదిలోకి వెళ్లి పడుకుంది.

'ఎటూ కానివేళ ఆ పడకేమిటమ్మా' కాస్సేపటి తరువాత అటువచ్చిన మీనాక్షమ్మ అడిగింది.

# సుజాత

'తలనొప్పిగా వుంది.' కణతలు రుద్దుకుంటూ సమాధానం చెప్పింది సుజాత. అంతకన్నా ఏం చెప్పాలో ఎలా చెప్పాలో ఆమెకి తోచలేదు.

'తలనొప్పి రాదూ మరి — ఎండనపడి వెళ్ళావు—నాలుగు మార్కులు తక్కువయిపోతాయేమోనని ఒకటే ఆరాటమయ్యె,' నుదురుమీద చెయ్యివేసి చూసి జ్వరం లేదని ధైర్యం తెచ్చుకుంది.

'నిజమేనమ్మా — ఆ ఆరాటమే నా కొంప ముంచింది.' లోలోపలే కుమిలి పోయింది సుజాత. ఆ రాత్రి ఆ అమ్మాయి భోజనం చెయ్యలేదు— తల్లిదండ్రుల బలవంతంమీద కాస్త మజ్జిగమాత్రం తాగింది ఎలాగో.

'హాయిగా కళ్ళు మూసుకు పడుకో— పరీక్షలని గురించి అసలు ఆలోచించకు' అన్నారు వాళ్ళు.

కాని ఆమెకి నిద్ర ఎలా పడుతుంది— కళ్ళుమూసినా తెరిచినా ఆ భయంకరమైన అనుభవం గుర్తు వస్తూనే వుంది—ఆలోచనల ఉధృతంతో తెల్లవారేసరికి జ్వరం ముంచుకు వచ్చింది. క్రితంసారి అయిన అనుభవంతో తల్లిదండ్రుల ప్రాణాలు తల్లడిల్లి పోయాయి—ఈ జ్వరం తన ప్రాణం తీసుకుపోతే బాగుండును అని ఎంతగానో కోరుకుంది సుజాత— కాని ఆమెకి నిరాశని, తల్లిదండ్రులకి సంతోషాన్ని కలిగిస్తూ మర్నాటికి జ్వరం తగ్గిపోయింది.

'నే చెప్పలేదూ—అలసటవల్ల వచ్చింది —మరీ అతిగా చదవనివ్వకండి,' అంటూ గర్వంగా భుజం చరుచుకుని వో సలహా కూడా ఇచ్చాడు డాక్టరు.

ఎప్పుడూ గల గల మాట్లాడుతూ, నవ్వుతూ నవ్విస్తూ చైతన్య స్రవంతిలా చెంగు చెంగున గంతులేసే సుజాత మాట పలుకు మరిచిపోయినట్లు అలా ఎటో చూస్తూ గంటల తరబడి కూర్చోటం వాళ్ళకు ఆశ్చర్యం అనిపించినా ఎప్పుడూ ఏదో వో పుస్తకం చేతిలో వుండటంవల్ల వాటిలో విషయాలే ఆలోచిస్తోంది అనుకునే వారు. 'అస్తమానూ అదే ధోరణా—కాస్త విశ్రాంతి తీసుకో,' అని మందలించేవారు కూడ—

పరీక్షకి కాలేజీకి వెళ్తున్న సుజాత కాళ్ళు వణకటం ప్రారంభించాయి—కాలేజీలో రాజారావుగారు కనిపిస్తారేమోనన్న వూహే ఆమెని భయకంపితను చేస్తోంది.

ఆమెకి ముందుగా ఇద్దరు విద్యార్థులు నడుస్తున్నారు. అందులో ఒకతను సుజాతని చూడగానే గుర్తు వచ్చినట్లు అన్నాడు, 'రాజారావుగారు రిజైన్ చేశాడుట తెలుసా.' అని.

సుజాత గుండెలు కుదుటబడినా ఏమూలో వులికిపాటు తప్పలేదు - ఆయన మానేసేయటానికి కారణం ఏం చెప్తాడో వినాలని ఆత్రపడిపోయింది.

'నాకు తెలియనే తెలియదే—అసలెప్పుడూ అనుకోలేదు—హఠాత్తుగా వెళ్ళిపోయారా?' అన్నాడా రెండవ విద్యార్థి. తెల్లబోతూ అతనూ తెలివైనవాడే. రాజారావు గారంటే అభిమానమూ వుంది.

'అవును—ప్రిన్సిపాల్‌ని బతిమాలుకుని అప్పటికప్పుడు తన రాజీనామా అంగీకరించేలా చేసుకున్నాడుట — బ్యాంకిలోనో ఎక్కడో మంచి వుద్యోగం వస్తుందని ఇంక వ్యవధిలేదు వెంటనే వచ్చేయమని వాళ్ళ మామగారు పుత్రం వ్రాశారని చెప్పి, ప్రాధేయపడుయాంటే ఆయన కాదన లేక పోయాడుట—'

'ప్చ్' మంచి తెలివైనవాడు వెళ్ళి పోయాడు' అన్నాడు రెండో అబ్బాయి కాస్త దిగులుగా.

'తెలివి ఒక్కటేకాదులే—కాస్త కీనకాంశ కూడవుంది—అలాంటివాడు పోవటమే మంచిది...'

సుజాత పైప్రాణాలు పైనే పోయాయి. నావిషయం తెలిసిపోయిందన్నమాట' అనుకుంది—అడుగులు తొట్రుపడ్డాయి—కాలేజి దాకా వెళ్ళి అందరిలో అవమానం పొందే బదులు వెనక్కితిరిగి ఇంటికి వెళ్ళిపోదామా అనిపించింది.

'అంటే?' అతను చెప్పింది అర్థంకానట్లు అడిగాడు రెండో అబ్బాయి.

'ఈ రాజారావుగారి ఓల్డు స్టూడెంటు, మా పిన్నికొడుకు వచ్చాడులే నిన్న— వాడు చెప్పాడు — వాళ్ళవూళ్ళో కాలేజిలో వో అమ్మాయితో రొమాన్సు సాగించబోయాడుట— అది బెడిసికొట్టింది— స్టూడెంట్సంతా కలిసి ఈయన్ని మెత్తగా అన్ని వదిలిపెట్టాలని చూశారట — పరిస్థితి

చెయ్యిదాటి పోయిందని గ్రహించి ఇతను చల్లగా జారుకున్నాడన్నమాట— పైకేమో అందరితోటీ గొప్పగా చెప్పుకున్నాడు ప్రిన్సిపాల్‌తో అభిప్రాయభేదాలు వచ్చి మానేశానని— ఇతని మామగారికి కాస్త పలుకుబడి వుందిటలే. అందుకే వెంటనే ఇక్కడ ఉద్యోగం వేయించగలిగాడు—అయినా ఇతని సంగతి గ్రహించుకోగలిగిన ఆయన ఆడపిల్లలున్న దగ్గర అల్లుడు ఉద్యోగం చెయ్యటం ఎప్పటికయినా ముప్పే అని మరో దగ్గర వదేయించినట్లున్నాడు — అయినా ఇలాంటి వాళ్లవల్ల అసలు కాలేజీకే చెడ్డపేరు వస్తుంది — శని విరగడయిందనుకో' అన్నాడు.

అప్పటిదాకా చెవులు అప్పగించి వింటూ వుండిపోయిన రెండో అతను 'నిజమేనంటావా — ఆయన అలాంటి నీచానికి ఒడిగడతాడా' అన్నాడు నమ్మలేనట్లు.

'సరే, ఇంకా నమ్మకపోతే సాయంకాలం మాయింటికి రా — మా కృష్ణుడు వాళ్ల పేర్లు ఎడ్రసులతో సహా చెప్పేస్తాడు — ఇక్కడికివచ్చి ఆట్టే రోజులు కాలేదుగా— అందుకే ఎవరినెత్తినీ చెయ్యిపెట్టే అవకాశం రాలేదు.'

'మీకు తెలియదు— ఆ దుర్మార్గుడు నాజీవితాన్నే నాశనం చేశాడు' ఆక్రోశించింది సుజాత అంతరంగం.

పరీక్షలయిపోయాయి.

'మీరుపెట్టిన గడువు తీరినట్లేనా? ఇంకనైనా అమ్మాయికి సంబంధాలు చూస్తారా.' నిష్ఠూరంగా అడిగినా మీనాక్షమ్మ గొంతులో సంతోషం మొహంలో చిరునవ్వు తొంగిచూశాయి.

'ఓ మహరాజులా చూస్తాను—చూడటమేకాదు రాజులాంటి అల్లుడ్ని తీసుకొస్తాను. అన్నం కలుపుకుంటూ ఓరగా కూతురివంక చూశాడు అభిమానంగా నవ్వుతూ.

ప్రక్కనేకూర్చున్న సుజాతకి తల్లి ఈ ప్రస్తావన తీసుకునచ్చిం దగ్గరనుండీ ముళ్లమీద కూర్చున్నట్లేవుంది.

'ఇవాళేగా పరీక్షలయాయి రిజల్ట్సు రావద్దూ?' తలవంచుకునే మెల్లిగా అంది.

'సరేలే—చదవేస్తే వున్నమతీ పోయిందంటారు ఇదే కాబోలు-అయినా దానిమాటలకేమిటి మీరుమాత్రం కాస్త శ్రద్ధ పట్టాలి ఇంకా అన్నం మారువడ్డిస్తూ ఆజ్ఞాపిస్తున్నట్లే అందావిడ.

'చిత్తం' రంగనాథంగారు చాల వుత్సాహంగా వున్నాడు ఆవాళ.

కాని సుజాత పరిస్థితే అందుకు పూర్తిగా వ్యతిరేకంగా వుంది—తనకి పెళ్లేమిటి—తలలో ముడుచుకున్న పువ్వుని పూజా పుష్పంగా అర్పిస్తారా ఎవరైనా —వివాహం అనే పవిత్ర బంధాన్ని గురించి ఆలోచించే అర్హతకూడ తనకిలేదు—అప్పుడే విచ్చుకుని అందాన్నీ సుగంధాన్నీ వెదజల్లుతూ మధుపాగమనానికై నిరీక్షిస్తున్న తన హృదయ కుసుమాన్ని గొంగళిపురుగు కొరికివేసినట్లయింది —కాని ఆ విషయాలన్నీ ఎలా చెప్పటం.

ఎంత చదువుకున్నా ఆడపిల్లలకి పెళ్ళి ప్రస్తావన వచ్చేసరికి సిగ్గు ముంచుకు వస్తుంది. అలా సిగ్గుపడటంకాని లేకపోతే అదివరకులా 'నేనిప్పుడిప్పుడే పెళ్ళి చేసుకోను' అని నిస్సంకోచంగా చెప్పటంకాని లేకుండా ఉదాసీనంగా వుండిపోయిన కూతుర్ని చూసి రంగనాథం దంపతులు మొహాలు చూసుకున్నారు.

నాలుగు రోజులు గడిచిపోయాయి— ఆలోచిస్తూ పడుకున్న సుజాతకి హఠాత్తుగా ఓ క్రొత్త వూహ వచ్చి తృళ్ళిపడింది— 'నిజమే— ఈ పరీక్షల ధోరణిలోపడి తను పట్టించుకోలేదు—వారంపైనే అయింది. భగవంతుడా ఏమిటి నాకీ శిక్ష—సుఖం సంతోషం లేకపోయినా గుట్టుగా బతికే అవకాశం కూడ లేకుండా చేస్తావా—ఛ. ఎందుకీ బతుకు.'—సుజాతకి తనని చూస్తే తనకే అసహ్యం కోపం, ఒళ్ళంతా రక్కుకోవాలని—శరీరాన్ని ముక్కలు ముక్కలుగా కోసేసుకోవాలి అన్నంత కసి కలిగాయి.

అర్ధరాత్రి నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ అతి మెల్లిగా వినవచ్చింది పెరటి తలుపులు తీస్తున్న సవ్వడి—పైన ఫాను తిరుగుతున్నా నిద్ర పట్టక ఇటూ అటూ దొర్లుతున్న మీనాక్షమ్మ ఆ అలికిడి విని 'ఎవరూ?' అంది.

సమాధానం రాలేదు. 'ఊళ్లో దొంగల భయాలు మరీ ఎక్కువయి పోయాయి.' అనుకుంటూ లేచి వచ్చింది— హాల్లో మంచం మీద సుజాత లేదు.



టా, నువ్వేనా తలుపుతీశావు' అంటూ పెరటి గుమ్మంవైపు నడిచింది. అక్కడి నుండి కనిపించిన దృశ్యం క్షణం సేపు ఆమె కొయ్యబారిపోయేలా చేసింది—

సుజాత చీర కుచ్చెళ్ళు వెనక్కి దోపుకుంటూ బావివేపుకి నడుస్తోంది.

'కొంప మునిగిందండీ. త్వరగా రండి' అంటూ గదిలోకి వో కేకవేసి తను ముందుకి పరుగుపెట్టింది — రంగనాథంగారు గాఢ నిద్రలో వుండివుంటే ఆమె అంత భయంతోనూ నోరునొక్కుకుని పిలిచిన పిలుపు వినిపించేదికాదు.

'ఏమయింది.' అంటూ లేచి వచ్చాడు ఆత్రంగా.

నూతిగట్టుమీదకి ఎగబ్రాకుతున్న కూతుర్ని ఇవతలకి లాక్కువచ్చారు ఇద్దరూ కలిసి.

'నన్ను చచ్చిపోనీయండమ్మా' తల్లి చేతులలోంచి విడిపించుకోవాలని పెనుగులాడుతూ రోదించింది సుజాత.

'ఛ. ఏమిటదీ—ఏం జరిగింది— అవాళే నువ్వు ఎలాగో వున్నావనిపించింది — నీ దృష్టిలో ఎవరైనా వున్నారా—ఉంటే ఆ సంగతి మాకు చెప్పాలి కాని ఇలా ప్రాణం తీసుకుంటారా' మధ్య హాల్లోకి నడిపించుకు వెళ్తూ అంది మీనాక్షమ్మ — ఆవిడ కంఠంలో వణుకు గుర్తించిన సుజాతకి ఆవిడ ఇంకేదో అడగాలనుకునీ అడగకపోతోందనేది స్పష్టం అయింది.

'చెప్పమ్మా—అతను మనకులంకాదా?' జారిపోతున్న ధైర్యాన్ని కూడదీసుకుంటూ

# సుజాత

అడిగాయి రంగనాథంగారు.

'కాదు—ఆదేంకాదు—నెనెలా చెప్పను-' రెండుచేతుల్లోనూ మొహం దాచుకుంది సుజాత.

'ఓరోజు రాజారావు మాస్టారింటికి పాఠం చెప్పించుకోటానికి వెళ్లాను...'

తమ అనుమానం నిజంకాకూడదు అని వెయ్యిదేముళ్ళకి మొక్కుకుంటున్న వాళ్ళ నెత్తిన పిడుగుపడినట్లే అయింది.

'అతను వంటరిగాడా...'అంత దుఃఖంలోనూ గుండెలని అవియగొట్టే కాఠిన్యం క్రౌర్యం వున్నాయి.

'కాదు అవాళ నా దురదృష్టం—భార్యాపిల్లలూ వూరికి వెళ్లారుట—అసలు వెంటనే వచ్చేయాలనుకున్నాను. అంటూ అంతా మెల్లగా వెక్కిళ్ల మధ్యచెప్తున్న సుజాత; 'ఛీ పాపిష్టిదానా...' అంటూ కర్కశంగా తండ్రి నోటివెంట వచ్చినమాటలకి తృళ్లిపడి చెప్పటం ఆపేసింది.

'నీమీద ఎన్నిఆశలు పెట్టుకున్నాం ఎంతముద్దుగా పెంచుకున్నాం— నీవు అడిగింది కాదనకుండా అన్నికోరికలూ తీర్చాము. మా ముచ్చటతీర్చే అర్హత పోగొట్టుకున్నావు కదూ—అక్కడే ఏబావిలోనయినా పడిచచ్చిపోకపోయావా—మళ్ళీ ఇంటికి ఎందుకు వచ్చావు ఇంత జరిగాక...'

'ఏమండీ — అసలే అది చచ్చిపోతానో అని ఏడుస్తూంటే అవేం మాటలండీ...' అప్పటిదాకా మౌనంగా కుళ్లికుళ్లి ఏడుస్తున్న మీనాక్షమ్మ మెల్లిగా గొంతు పెగుల్చుకుంది.

'నాన్నగారు చెప్పింది నిజమేనమ్మా— నేనవాళే ఇంత విషం తీసుకుని ఎవరికీ ఎలాంటి అనుమానం రాకుండా చచ్చిపోవాల్సింది— ఇప్పుడైనా మించిపోయింది లేదు—నన్ను వదలండి...' చటుక్కున లేచి నిలబడి తల్లి చెయ్యి విడిపించుకోబోయిన సుజాత 'అమ్మా సుజా' అంటూ తండ్రి బావురు మనటంతో తెల్లబోయి నిలబడిపోయింది.

'నువ్విలా ప్రాణాలు తీసుకుంటే మేం హాయిగా బతికివుండగలమనే అనుకుంటున్నావా.'

'నిజమే-తను ఆలోచించలేదు — తను బావిలో పడితే, తెల్లవారేసరికి ఎన్ని గొడవలు ఎంత అప్రతిష్ఠ. జరిగినదానికి నలుగురూ నాలుగు రకాలుగా అంటూంటే వీళ్ళు తలయెత్తుకుని తిరగ్గలరా— గర్భశోకంతోపాటు నా కళంకాన్నికూడ మోస్తూ వీళ్ళు బ్రతకాలి.' అనుకున్న సుజాత ఆ మాటే పైకి అని. 'సరే నేనింకోమార్గం ఏదైనా వెతుక్కుంటాను లెండి' అంది దృఢంగా.

'హా — నీకంటె ఎక్కువగా నేనా పరువూ ప్రతిష్ఠాకోసం పాకులాడుతున్నాననుకుంటున్నావా అమ్మా! వద్దు మాకలాంటి శిక్ష వెయ్యకు— ముందు ఆవేశంలో ఏదో అనేశాను – అలాంటి పరిస్థితి అనివార్యమే అయితే ముగ్గురం కలిసే ఇంత విషం మింగుదాం—అంతే కాని మమ్మల్ని దిక్కులేనివాళ్ళుగా ఇక్కడ వదిలేసి నీదారి నువ్వు చూసుకోనని మాట ఇయ్యమ్మా...' ఆడదానిలా తనని చుట్టేసి విలపిస్తున్న తండ్రికి ఏమీ సమాధానం చెప్పలేకపోయింది సుజాత.

అలా ముగ్గురూ లోలోపలే కుమిలిపోతూ ఎంతసేపు కూర్చున్నారో వాళ్ళకే తెలియదు. ఇంటినంతా భయంకరమైన నిశ్శబ్దం ఆవరించుకున్నట్లుగా వుంది — అందరి హృదయాల్లోనూ దుఃఖమూ, అవమానమూ, జుగుప్స, ఏమీచెయ్యలేకపోయిన నిస్సహాయత, చేతనయితే ఆ వ్యక్తిమీద కసి తీర్చుకోవాలనే ప్రతీకార వాంఛలాంటి అనేక భావాలు ఉబికి పొంగిపోతున్నాయి—

(ఇంకా ఉంది)




# దీపావళి * జోకావళి

బాజ్జి


















# పురావస్తు శాస్త్రంలో శాస్త్ర విజ్ఞానం పాత్ర



ఎన్నో లక్షల సంవత్సరాల క్రింద నివసించిన మృగం. ఈ మృగాలను డినోసరస్ అంటారు,

**ఒక** మనిషి నూరేళ్ళు బ్రతికాడంటే ఆశ్చర్యం వేస్తుంది. అలాగే ఒక వస్తువు వేయేళ్ళదంటే ఆశ్చర్యం వేస్తుంది. సందేహం కూడ కలుగుతుంది. ఇది వెయ్యేళ్ళని ఎలా చెప్పగలరు? అని అడుగుతాం. ఆ వస్తువుపైన ఏదైన రాసి ఉంటే ఆ అక్షరాలను బట్టి కాలం కనుక్కో వచ్చు.

ఒక స్థలంలో త్రవ్వుతూ ఉంటే ప్రాచీన కాలం నాటి ఎముకలు, కర్ర సామానులు, బొగ్గు మొదలైనవి దొరుకుతుందనుకుంటాం. అవి ఏ కాలం నాటివి? ఎన్నేళ్ళు ఉంటుందని తెలిసికోవాలని అనిపిస్తుంది. చారిత్రక ఆధారములు ఏవీ లేకపోతే ఎలా కనుక్కోడం? అలాంటప్పుడు విజ్ఞాన శాస్త్రం పని కొస్తుంది. రేడియో కార్బన్ డేటింగ్, పోలన్ అనాలిసిస్, డెండ్రో క్రోనాలజీ మొదలైన విజ్ఞాన పరికరాలను ఉపయోగించి కొంతవరకు కనుక్కో వచ్చు.

రేడియో కార్బన్ డేటింగ్ అంటే ఏమిటి? ప్రాణ వాయువు (Cxygen), నత్రజని (Nitrogen), ఉదజని (హైడ్రోజన్) మొదలైనవి మూల పదార్థాలు. అలాగే కార్బన్ కూడ ఒక మూల పదార్థం. ప్రతియొక్క మూల పదార్థానికి 'ఆటామిక్ వెయిట్' అనేది ఉంటుంది. కార్బన్ ఆటామిక్ వెయిట్ 12. అది మామూలు కార్బన్. కార్బన్‌లోనే మరో రకం ఉంది. దాని ఆటామిక్ వెయిట్ 14. దాన్ని '14 అంటారు. (ఆటామిక్ వెయిట్ అంటే అణువు బరువు అన్న మాట: ఉదజని అణువు ఇక్కడ ప్రమాణం.)

ఈ '14 ప్రాణవాయువుతో కలిసి కార్బన్ డయాక్సైడ్‌గా మారుతుంది. ఈ కార్బన్ డయాక్సైడు, మామూలు కార్బన్ యొక్క కార్బన్ డయాక్సైడు వాతావరణంలో ఒక నిష్పత్తిలో ఉంటుంది.

చెట్లు, చేమలు సూర్య రశ్మిలో కార్బన్ డయాక్సైడ్ పుచ్చు కుంటాయి. ఈ చెట్లు చేమల్ని ఇతర ప్రాణులు తీసుకుంటాయి.

కొంతకాలం తరువాత ఆ చెట్లు, చేమలు, ప్రాణులు చనిపోతాయి. చనిపోయిన తరువాత ఈ చెట్లు కాని ఇతర ప్రాణులు కాని బొగ్గుపులుసు వాయువు లేక కార్బన్ డయాక్సైడ్ తీసికోడం మానేస్తాయి. ఇలా చనిపోయిన ప్రాణుల, చెట్లు చేమలలో యుండిన రేడియో కార్బన్ కొంచం కొంచంగా క్షీణించడానికి ప్రారంభిస్తుంది. సగం భాగం రేడియో కార్బన్ క్షీణించడానికి 5568+30 సంవత్సరాలు పడ్తాయని విజ్ఞాన శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. దీన్నే హాఫ్ లయిఫ్ ఆఫ్ రేడియో కార్బన్ అంటారు. ఈ పద్ధతి నుపయోగించి కాలం కొంతవరకు నిర్ణయించ వచ్చు.

మట్టి కుండలు, మట్టి బొమ్మలు వీటి కాలం కనుక్కోడానికి మరొక సాధనం ఉంది. దీనినే 'ఆర్కియో మేగ్నిటిజం' అంటారు.

'పోలెన్ అనాలిసిస్' అనేది మరొక పద్ధతి. వాస్తు శాస్త్రానికి చాల పని కొస్తుంది. ఈ పద్ధతి మూలాన ఎన్నో వేల సంవత్సరాల క్రింద యుండిన చెట్ల, చేమల స్థితిగతులు ఆకాలం నాటి 'వాతావరణం' తెలుసుకో వచ్చు. అంతేకాదు, ఆ కాలం నాటి మానవుని జీవితం, అతని పరిసరములు (ఎన్వయిరన్‌మెంట్), ఇంకా ఎన్నో విషయాలు తెలుసుకో వచ్చు.

కాలమానాన్ని Chronology కనుక్కోడానికి మరో పద్ధతి కూడ ఉంది. దీన్ని డెండ్రో క్రోనాలజీ అంటారు. ఒక కర్ర పలక తీసి చూడండి. గీతలు కనిపిస్తాయి. ఆ గీతలను ట్రీరింగ్స్ అంటారు. ఈ ట్రీరింగ్స్‌ని పరిశీలన చేసి ఆ కర్ర పలక కాలం చెప్పవచ్చు.

విజ్ఞాన శాస్త్రాన్ని ఉపయోగించి ఆ కాలంలో వాడుకలో ఉండిన ధాన్యాల దినుసులు, వృక్షాలను గురించి కొంతవరకు చెప్పవచ్చు. యిరోపాలో బాగ్‌మెన్ అనే శవాలని పరీక్ష చేస్తే, వాని ప్రేగులలో 66 చెట్ల రకాల వృక్షాహారాన్ని కనుగొన్నారు. అంతేకాదు. ఆ కాలంలోని చెట్ల రోగాలు కూడ కని బెట్టారు.

పురావస్తు శాస్త్ర పరిశీలనకు ఎముకలు చాల ఉపయోగ పడుతాయి. చాల ప్రాచీనమయిన చోట్లో త్రవ్వేటప్పుడు ఎముకలు దొరికాయ్ అనుకుందాం. పురాశాస్త్రజ్ఞుడు, జువాలజిష్టు కలిసి ఆ ఎముకలు ఏ జంతువునై ఉండవచ్చు? అది ఎలాంటి జంతువు? శాఖాహారియా? మాంసాహారియా? అలాంటి జంతు విప్పుడున్నదా? అని ఆలోచిస్తారు. ఆలోచించడమే కాదు. కొంతవరకు కనుక్కుంటారు కూడాను.

ప్రాచీన కాలంలో భూమిపై నివసించినకొన్ని మృగాలు పూర్తిగా నశించాయి. అలాంటప్పుడు ఈ ఎముకల మూలాన అంతరించిన జంతువుల గురించి తెలుసుకో వచ్చు.

ఎన్నో లక్షల సంవత్సరాలకు ముందు మన భూమిపై బ్రహ్మాండమైన జంతువులు నివసించాయట. అవి 100 అడుగుల పొడుగుండేవట. వాటిలో డిప్లొడకస్, జైజన్‌టోసరస్ అనేవి శాఖాహారులు. ఈ మృగాలు అంతరించాయి. ఇలాంటి జంతువు లుండేవని 'ఫాస్సిల్స్' మూలాన మనకు తెలిసింది.

ఇలా విజ్ఞాన శాస్త్ర మ్నుపయోగించి ప్రాచీన కాలంలో నివసించిన మనుష్యుల జీవితాలు, ఆ కాలంలో ఉండిన జంతువులు, అవి ఎలా ఉండేవి, మరి యింకా ఎన్నో విషయాలను కనుక్కోడానికి వీలవు తుంది.

—నీలం శంకరనారాయణ



ఎన్నో లక్షల సంవత్సరాల క్రింద నివసించిన మృగం. ఈ మృగాలను డినోసరస్ అంటారు.



# హెచ్చరిక!

న్యూట్రీన్ టాఫీలను
మీ తుంటరి అబ్బాయికి
అందకుండా భద్రపరచండి!
ఎందుకంటే న్యూట్రీన్ మిఠాయిల అతి
మాధుర్యము అబ్బాయి కంత ఆకర్షణ!!






'న్యూట్రీన్'
మిఠాయిలు, టాఫీలు

*తయారుచేయువారు:*
న్యూట్రీన్ కన్ఫెక్షనరీ కంపెని
ప్రైవేట్ లిమిటెడ్
చిత్తూరు - ఆంధ్ర ప్రదేశ్








భక్తులు కూడా మానవమాత్రులే కాబట్టి, ఎంత గొప్ప భక్తి వున్నవారి కయినా ఒకప్పుడు కాకపోతే మరొకప్పు డయినా మనస్సు చలించడానికి అవకాశం వుంటుంది. అలా చలించకుండా వుండ డానికి అప్పుడప్పుడు భగవంతుడు పరీక్ష చేసి వారి మనస్సును దృఢతర మైనదిగా చేస్తూ ఉంటాడు. ఇట్టి పరీక్షల్లో సుశీల అనే పతివ్రతను చేసిన పరీక్ష ఒకటి!

ఒక వూళ్లో సుశీల అనే ఉత్తమ బ్రాహ్మణ యువతి విష్ణు భక్తురాలు ఉండేది. అనురూపులైన వధూ వరులను బ్రహ్మ కూర్చడం చాలా అరుదుగదా! ఆమె భర్త మిక్కిలి లోభి. అతడికి డబ్బే ప్రధానం. అందర్నీ యాచించి డబ్బు సంపాదించి యెక్కువ వడ్డీకి అప్పులిస్తూ ధనాన్ని కూడబెట్టేవాడు. పండిన పంటలను పాతర లలో దాచిపెట్టి ముక్కిపోయిన ధాన్యాన్ని పిచ్చుకొలత కొలిచి పూటబత్తెంగా ఆమెకు వంట కిచ్చేవాడు. ఆ పతివ్రత భర్తను పల్లెత్తుమాట అనకుండా, కొంచెమైనా విసుగుకోకుండా తన కృత్యాలు నెర వేర్చేది.

ఇలా వుంటూవుండగా, ఒకనాడు ఆమె యింటికి వామనావతారమూర్తివలెనే ఉన్న ఒక పొట్టి వటువు ఆకలితో బాధపడుతూ వచ్చాడు. అతడు ఆమెను దీవించి 'అమ్మా! నేను కొందరు మిత్రులతోకూడా తీర్థ యాత్రలకు బయలుదేరాం. మార్గంలో అయిదు రోజులనుంచీ తిండి దొరకనందున నేను అన్నంకోసం వెనకబడిపోయి యిక్క డికి వచ్చాను. వేగంగాపోయి మా వాళ్లను కలుసుకోవాలి. కాస్త అన్నంపెట్టి కసిన్ని నీళ్లు ఇయ్యి. చద్దన్నమయినా సరే! ఆలస్యం అయితే ప్రాణాలు నిలిచేటట్లు లేవు' అన్నాడు. సుశీల, వంట అయేవరకూ ఆ వటువు ఓర్చి వుండడని గ్రహించి, గ్రామాంతరం వెళ్లుచున్న భర్తకు పాథే యంగా యివ్వగా మిగిలిన చద్ది అన్నాన్ని, నీరుఓడ్చి అరటాకులో పెట్టి యింతపెరుగు పోసి వ్యంజనాలతోకూడా పెట్టింది. ఆ వామనుడు ప్రాణాహుతులైనా తీసుకోకుండా క్షణంలో విస్తరి ఖాళీచేసి, కదలకుండా కూర్చున్నాడు. 'ఇంకా ఆకలి తగ్గలేదు; కుండ వూడ్చి ఏమైనా కొన్ని మెతుకు లుంటే పెట్టు' అన్నాడు. అన్నం ఒక్క మెతుకూ మిగలకుండా మొదటే ఆమె పెట్టివేసింది. ఆమె కొంచెం ఆలోచిం చింది. ఎవ్వరో యిచ్చిన భక్ష్యాలను తన భర్త తనకు తెలియకుండా అటకమీద దాచి వుంచినట్లు ఆమెకు జ్ఞప్తికి వచ్చింది. తర్వాత ఏమిజరిగినా జరగనిమ్మని, తన భర్త విధించే శిక్షకు సిద్ధపడి ఆమె వాటినన్నిటినీ తెచ్చిపెట్టింది. ఆ వటువు ఇవతలివాళ్లు అవతలివాళ్లకు అందించి నంత శీఘ్రంగా వాటిని తినివేశాడు. ఆ తర్వాతకూడా ఆకలిగా వున్నదన్నాడు. సుశీల మిక్కిలి ఆశ్చర్యపడి, ఆ వటువు మానవ మాత్రుడు కాడనీ, తన్ను అనుగ్రహించ డానికి మారు రూపుతో వచ్చిన శ్రీమన్నారా యణుడే అని మనస్సులో నిశ్చయించి 'స్వామీ! కొంచెంసేపు తాళండి. నేను క్షణంలో వంటచేసి మీకు పెట్టి మీకు సంతృప్తి కలిగిస్తాను' అనిచెప్పి కూర్చో పెట్టి వంటింట్లోకిపోయి అగ్నిదేవతను ప్రార్థించినది. అగ్ని ఆమె భక్తికి సంతో షించి సమస్త పదార్థాలు క్షణంలో సిద్ధంచేశాడు.

సుశీల పాకగృహంలోంచి వచ్చి చూడగా బ్రహ్మచారి కనబడలేదు, అతనికి బదు లుగా శ్రీమన్నారాయణుడే ప్రత్యక్షమై ఆమెకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించాడు. ఆ దేవదేవుడు 'అమ్మాయీ! నీ భక్తికి చాలా సంతోషించాను. నిన్ను పరీక్షించ డానికే యీ రీతిగా వచ్చాను. నీ భర్తను కఠినుడుగానూ, లోభిగానూ ఏర్పరచడం కూడా యిందుకోసమే! ఇకమీద నీకు ఎట్టి శ్రమలూ వుండవు. నీభర్త సత్ప్రవర్తన కలిగి ఉత్తముడై ఎంతో అనుకూలంగా వుండగలడు. మీకు యోగ్యులైన పుత్రులు కూడా కలుగుతారు. చాలాకాలం సంసార సుఖాలు అనుభవించి, ఆ మీదట నీ భర్తతోకూడా నా సాన్నిధ్యం చేరగలవు'అని చెప్పి మాయమయ్యాడు.

కొద్దిరోజుల్లో గ్రామాంతరం నుండి వచ్చిన భర్త ఎంతో ఆప్యాయంగా మాట లాడి అనుకూలుడైనాడు. అతని మనస్సు పూర్తిగా మారిపోయింది. ఆ దంపతులు ఎన్నో దానధర్మాలుచేసి, ఉత్తమ పుత్ర సంతానం పొంది, వాళ్లు పెరిగి పెద్దవా ళ్లయాక సంసార బాధ్యతను అప్పగించి, వయస్సు పరిపక్వంకాగా దేహాన్ని విడిచి, తమకువచ్చిన విమానంలో వైకుంఠం చేరు కున్నారు. ●

# వరలక్ష్మి

వేదుల శకుంతల

పది గంటలవేళ!

రిక్షాలు సైకిళ్లు బస్సులు కాలినడకలవాళ్లు ఒకటే తీర్థ ప్రజ! అందరికీ తొందరే.

క్షణం తీరికలేని ఈ మనుష్యులందరిలో - ఎందరో స్వార్థపరులు— కొందరు ఉపకారస్థులు. రంగురంగుల చీరలు ... గొట్టం ప్యాంట్లు ... గళ్ళ బుష్ కోట్లు! ఖాదీ లాల్చీలు!

కళగా పులగంగా ... కుమ్మరించిన కూరగాయల్లాగ పొట్టి ... పొడుగు— సన్నం...లావు —రకరకాల మనుష్యులు. వెంట్రుకల వాసిలో ప్రమాదాన్ని తప్పించుకోగల్గే అదృష్టవంతులు ... రేపటిని గూర్చి ఆలోచించక్కర్లేని నిరాశావాదులు!!

ఎంద రెందరో కన్పిస్తున్నారు ఆ కిటికీ నుంచి. అందుకే వాలుకుర్చీలో కూర్చుని గంటకుపైగా అలా బయటి ప్రపంచాన్ని చూస్తూ కూర్చుంది, వరలక్ష్మి.

ఎదురింట్లో క్రింది వాటాలో—కిటికీ ప్రక్కనుంచుని వల్లభరావూ చూస్తున్నాడు వరలక్ష్మిని!

బిగించి వేసుకున్న జడ...పెద్ద బొట్టు ...కళ్లనిండుగ కాటుక...ఆ కళ్లల్లో దాగిన నిర్లిప్తత...అతన్ని కదిలించేస్తున్నాయి. (!)

వారం రోజుల క్రితం ఆ ఇంటి కిటికీ తలుపులు మూసివుండేవి. కిటికీ వూచల మీద పేరుకుపోయిన దుమ్ము మూలలకి పట్టిన బూజులు ఓ శుభ ముహూర్తాన దులపబడ్డాయి. ఎవరో ఆ ఇంట్లో దిగుతారని తెలుసుకున్న రోజున...





వాళ్ళకి వరలక్ష్మిలాంటి అందమైన పెళ్ళి కాని ఆడపిల్ల వుంటుందని ఊహించలేదు. రెండు రోజులనుంచి ఆ అమ్మాయి ఆ కిటికీ దగ్గర కూర్చోడం చూసేక ... వల్లభరావుకి బోలెడంత సానుభూతి...మరేదో అనుభూతి లాంటివి కలగడం ప్రారంభించేయి. ఆ అమ్మాయి పేరు వరలక్ష్మి అని మాత్రం తెలుసుకోగల్గేడు. ఆ క్షణం నుంచే అతని మనస్సులో ఆ అమ్మాయిని ఓదార్చడం మొదలెట్టేడు.

'వరం నువ్వలా చూడకు. నాకు చాలా బాధగ వుంది. నీలాంటి పెళ్ళికాని ఆడపిల్లలందరూ అలాగే చూస్తారు జాలిగ! మీ నాన్న కట్నం ఇచ్చి పెళ్ళి చేయలేడనే గదూ ఆ దీనమైన చూపులు ... అవును అంతులేకుండా కట్నాల రేటును పెంచుకొస్తున్న తల్లి దండ్రులకి భయపడే పిరికి సన్నాసిరావులు నీలాంటివాళ్ళ దీనాలాపనలు అర్థం చేసుకోలేరు. నీ మూగబాధ వినపడదు. వినిపించినా అమ్మా నాన్నల మాటని అతిక్రమించలేరు. కాని నాకు ఆ గొడవలేమి లేవు. నేను స్వతంత్రుణ్ణి. ఉన్న ముసలి మేనత్త అక్కయ్యదగ్గర వుంది. నా భవిష్యత్తుకు అడ్డుపడగల సమర్ధురాలు కాదు. అందుచేత నేను మీ నాన్నగారితో మాట్లాడుతాను. బాధపడకు వరం! నే నున్నాగ? ఒక్కసారి ఇలా నా కిటికీవైపు చూడు నీకే తెలుస్తుంది. ఎంతసేపలా రోడ్డునే చూస్తావు? ఒక్కసారి ఇటు...నావైపు చూడు...'

'నాన్నా ఈ పరికిణీ కట్టుకోనా?' నాల్గేళ్ళ చిట్టి వల్లభరావు చెయ్యి లాగే సరికి ఊహలు చెదిరి వాస్తవంలో పడ్డాడు.

రెండేళ్ళ క్రితం భార్యపోయిన వల్లభరావు ఇద్దరు పిల్లలతో చేసుకోవడం ఎంత ఇబ్బందో అనుభవ పూర్వకంగ తెలుసుకున్నాడు. ఎప్పటి కప్పుడే మేనత్తని రమ్మని రాయాలనుకుంటు మళ్ళీ ఆవిణ్ణి శ్రమపెట్టడ మెందుకని వూరుకునేవాడు. మరొక ఆడదక్షత ఎంతో అవసరమని తెలుసు. తను సిద్ధంగానే వున్నాడు. కట్నం ఇచ్చుకోలేని ఆడపిల్లల తండ్రులమీద ఈ మధ్య విపరీతమైన జాలి కల్గుతోంది. అందునా ఎదురింట్లోనే తటస్థపడే సరికి మరీ తట్టుకోలేక పోతున్నాడు!

'చూడు వరం. రెండో పెళ్ళివాణ్ణికదా అని సంశయించకు. బోలెడన్ని బాధ్యతలున్న మొదటి సంబంధపు పెళ్ళికొడుకు కన్న వేయిరెట్లు నయం. పెళ్ళి కెదిగిన ఆడబడుచులు, చదువుకొచ్చిన మరుదులు— సాధించే అత్తగారు, నీ కుండరు. నానా పాట్లుపడి కట్నాలిచ్చి చేసే సంబంధాలలో నిజానికి అవే వుండేవి. సుఖం వుందా చెప్పు? మీ నాన్న ఏ తిప్పలు పడక్కర్లేదు. నువ్వు అలా దిగులు పడక్కర్లేదు. నేను మీ నాన్నతో మాట్లాడేస్తాను...'

'నాన్నా అన్నం తిందామురా నాన్నా'— బాబు కూడా పిల్చేసరికి వల్లభరావు కిటికీ వదలి వంటింటివైపు కదిలేడు. కదుల్తూ 'వరం, త్వరగా నీవు ఈ బాధలన్నీ తీసుకోవాలి మరి'—అనుకున్నాడు.

సరిగ్గా ఆ సమయంలోనే పై అంతస్థులో బాల్కనీలో నుంచునివున్న అన్నపూర్ణమ్మ—ఆ ఇంటి యజమానురాలు—వరలక్ష్మి కూర్చున్న కిటికీవైపు చూసింది.

'కొత్తగా దిగారు కాబోలు. అమ్మాయి చక్కగ వుంది. పెళ్ళి కావల్సిన పిల్లే! బోసి మెడ తెలుస్తునే వుంది. అబ్బో?! ఆడపిల్ల పెళ్ళి, అందునా మధ్యతరగతి కుటుంబీకుల్లాగే వున్నారు—ఎన్ని పాట్లు పడాలి?...అందం చందం కొలమానం కాదు ఈ రోజుల్లో—కోరిన కట్నం ఒక వైపు, పిల్లవాడి నొకవైపు వుంచి త్రాసు సమంగ తూగితేనే ఆడపిల్ల మెళ్ళో తాళి బొట్టు పడేది! హూఁ! బాగా ఈడువచ్చిన పిల్లలాగానే వుంది. సరిగా కనిపించటంలేదు కాని ఎత్తరిగానే వుంటుంది...'

అన్నపూర్ణమ్మ దృష్టి మరల్చి రోడ్డు చివరదాకా చూసింది. ఎక్కడా కొడుకు వస్తున్న జాడ కన్పించలేదు. అంత భారీ మనిషి—ఎంతో క్రుంగిపోయినట్టు నిట్టూర్చుకుని మరొకసారి వరలక్ష్మిని చూసి లోపలికి వెళ్ళింది. వెళ్ళి హాల్లో సోఫాలో కూర్చుని కళ్ళు మూసుకున్నది.

అన్నపూర్ణమ్మ ధనవంతురాలు. చేయెత్తు మనిషి. ఠీవి దర్పంగల నిండైన అందం. ఒక్కగా నొక్క కొడుకు రాజా. ఎంతోముద్దు ముచ్చట్లలో పెరిగిన రాజాకు లేని దురలవాటు లేదు. వివాహ ప్రయత్నం జరుగుతుండగానే తండ్రిపోయేడు. రాజాకు స్వేచ్ఛ ఎక్కువైంది. పిల్ల నివ్వడానికి సిద్ధపడ్డ వాళ్ళు వెనక్కి తగ్గేరు. రాత్రిళ్ళు త్రాగి వచ్చేవాడు. ఒక్కోసారి ఆ రావటం మానేసేవాడు. అన్నపూర్ణమ్మ కొడుకు బెంగతో చిక్కి శల్యమవుతోంది.

రాత్రినుంచి ఇంటికిరాని కొడుకును గూర్చి తల్చుకుంటూ కళ్ళుమూసుకుంటే ...అప్పుడే చూసి వచ్చిన వరలక్ష్మిరూపం లీలగ కన్పించింది. 'ఆ అమ్మాయైతే వాణ్ణి దారిలో పెట్టగల్గుతుంది. పైపై కట్నం ఇచ్చుకో అక్కర్లేదని చెప్తే... ఆ పిల్ల తండ్రి ఎంత సంతోషిస్తాడో! ఆ అమ్మాయిని చూస్తే రాజా తప్పకుండా ఒప్పుకుంటాడు. ఆ పిల్ల తండ్రిని పిలిపించి ఒక్కసారి మాట్లాడితే...సంగతి వింటే అతను ఎంతలా పొంగిపోతాడో!? కాదూమరి? రాజా తాహతుకు సరితూగే వాళ్ళేనా? వాడు ఇలా తయారవబట్టి తను అంతస్థు దిగి రావల్సి వస్తోంది. క్రిందమెట్టు మీదున్న సంబంధమైతే తమకి నయం. వాణ్ణి సరియైన దారిలో పెట్టగల్గుతుంది...'

అన్నపూర్ణమ్మ కళ్ళుతెరచి టేబుల్ మీదున్న గడియారం వంక చూసింది. గంట పదకొండు చూపెడుతోంది. కాని రాజు రాలేదు. గడియారం ప్రక్కనే ఫ్రేంలో బిగించిన రాజాఫోటో నవ్వుతోంది. ఆఫోటో ప్రక్కన కిటికీవెనుక కూర్చున్న వరలక్ష్మి రూపాన్ని అమర్చుకుని — తృప్తిగా గాలి పీల్చుకున్నది. అన్నపూర్ణమ్మ.

తొమ్మిదిగంటలనుంచి పదకొండు గంటలదాకా కిటికీ ప్రక్కన వాలు కుర్చీలో కూర్చున్న వరలక్ష్మికి కొంచం చికాకు లాంటిది కల్గింది. నడుంనొప్పి తీరేదాకా వళ్ళు విరుచుకుని, బద్ధకంగా ఆవులించి వంటింట్లో వున్న తల్లి దగ్గరకి నడిచింది.



## గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥







# వరలక్ష్మి

వంటంతా పూర్తి చేసుకుని మధ్యాహ్న ఫలహారానికి పిండి కలుపుతున్న సత్యవతమ్మ కూతుర్నిచూసి 'నీవు తినేయరాదుటే వాళ్ళకోసం ఎంత సేపు చూస్తావు?'— అన్నది.

'సరే ఐతే పెట్టు'— అన్నది వరలక్ష్మి ఇష్టం లేకపోయినా.

అందరితో కలసి తినాలని సరదాగా వున్నా తల్లి ముందు చెప్పలేక పోయింది. పెరట్లో పంపుదగ్గర కాళ్ళు కడుక్కుందుకు వెళ్ళింది.

బాదంచెట్టున్న వా గాలో వెంకటలక్ష్మి తొంగి తొంగి చూసింది వరలక్ష్మిని. బాగా ఎత్తరిగా, తగిన వొళ్ళుతో పొందికగ వున్న వరలక్ష్మిని చూడగానే 'ఎంత బాగుందో?' అనుకుంది.

'ఇంకా పెళ్లికాలేదుట! అందుకేమరి తెలుస్తూనే వుంది. ఆకళ్ళలో దిగులు, నీర్సం గుబులు...(!)'

'నిజమే మరి? ఇరవైయేళ్లేనా వుంటాయి కదా! పెళ్లి పెటాకులు లేవుగ? దిగులుగా వుండకపోతే కళకళ లాడుతుం దేమిటీ?'

పంపుదగ్గర కాళ్ళు కడుక్కుంటుంటే మోకాళ్ళవరకు కనుపిస్తున్న వరలక్ష్మి కాళ్ళు నాజూగ్గా తెల్లగ అరటిదూటల్లాగ కనిపించేయి. ఒక్కొక్కడుగు వేసుకుంటు వెళ్ళిపోతూవుంటే — లయవేస్తున్నట్టున్న ఆ బారుజడ — అచ్చం సినిమాలో నాట్యసుందరిలా ముచ్చట గొలిపాయి.

అప్రయత్నంగ తన కాళ్ళవైపు చూసుకుంది వెంకటలక్ష్మి.

ఇంకా మడిబట్ట విప్పలేదేమో— వంటలో వున్నప్పుడు పనితొందరలో తుడుచుకున్న మానెమరకలు, సగం తడి, అక్కడక్కడా పసుపు, నలిగి అంచులు ముడుచుకుపోయి రంగు వెలిసిపోయిన చీర కచ్చాకట్టు — పిక్కలదగ్గర గోక్కున్నప్పుడు రేగిన తెల్లనిపొట్టు చారికలు, గీరలు—పాదంనిండా పసుపు అరకాళ్ళల్లో పగుళ్లు అక్కడక్కడ రక్తం చిమ్మిన గుర్తులు...

సిగ్గుపడి గభాల్న ఇంట్లో కెళ్ళిపోయింది.

'బాగుంది మరి సంసారం, పిల్లలు, భర్త వీళ్ళందరివి చూసుకుంటుంటే అంత నాజూగ్గా వుండటానికి వీలుంటుందేమిటి? రేపు తనకు పెళ్ళైతే ఇంత శృంగారంగా కులుకగలదా? అయ్యోరాత, అదిలేకేగా ఆ అమ్మాయి దిగులంతా! ఆ ఈడుకు నేనప్పుడే బుజ్జిని, నానిగాణ్ణి కన్నాను. పాపం ఇంకా పెళ్ళే లేదు. అసలు ఆ ప్రయత్నాలూ లేవు (ఉన్నట్టు కనిపించలేదు!) అయినా కట్నాలు ఇచ్చుకోలేక ఎంతెంత వాళ్ళు పిల్లల్ని ఇలా చెట్లల్లా ఎదగబెట్టేస్తున్నారు. ఆ తల్లి తండ్రులకి మాత్రం బాధ ఆరాటం వుండవేమిటీ?! — పోనీ తన తమ్ముడికి చేసుకుంటే! —

'పిల్ల భేషుగ్గానే వుంది. కట్నం ఏదో శక్తికి మించిపోకుండా తీసుకుంటే సరి... వాడు స్కూల్ ఫైనల్ ప్యాసై నూటాయాభై సంపాదించుకుంటున్నాడా, బొత్తిగ కట్నాలు లేకపోతే ఏం బాగుంటుందీ? చిలకా గోరింకల్లా వుంటారు. వాడు కాస్త లావన్న మాటేగాని ఎర్రగ వుంటే దొరలాగుంటాడు! నా మాటంటే వాడికీ, అమ్మకి నాన్నకి ఎంతో గురి.

ఎలాగో ఈ పెళ్లి జరిపించేస్తే... ఈ పిల్ల, ఆ తల్లి తండ్రులు ఎంత ఐదైపోతారూ? నేనంటే ఎంత గౌరవం చూపిస్తారు? మరి కాదా?! ఈనాడు ఇంత దీనంగా చూస్తున్న ఈ పిల్లే రేపు 'నా మరదలైతే...ఎంత కళకళలాడిపోతుంది?!... ఎంతైనా ఆడపిల్ల అత్తారింట్లోనే సుఖపడాలి...' పాతికేళ్ళ వయస్సులో నల్గురు పిల్లల తరువాత మళ్లీ నెల తప్పిన వెంకటలక్ష్మి సంసార సుఖం ఎరగని కన్నెపిల్ల మీద జాలిపడుతోంది.

* * *

మధ్యాహ్నం మూడు గంటల సమయంలో ఒక టాక్సీ ఆగింది, వరలక్ష్మి వాళ్ళింటి ముందు. అందులో నుంచి ఫుల్ సూటులో వున్న ఒక వ్యక్తి సూటుకేస్ చేతపట్టుకుని దిగేడు. టాక్సీ చార్జి ఇచ్చేసి ఇంట్లో కెళుతున్న అతని చుట్టు వరలక్ష్మి తమ్ముళ్ళు మూగేరు! 'బావ వచ్చాడే అమ్మా' అంటూ.

వల్లభరావు ఆ సమయంలో ఆఫీసులో ఆఫీసర్ చెప్పిన అర్జెంటు ఫైళ్ళు చాలా అర్జెంటుగా చూస్తున్నాడు. అతని కిటికీ తలుపులు మూసి వున్నాయి. కాళ్ళు కడుక్కుందుకు నీళ్లిచ్చి 'ఉదయమే వస్తావని ఎదురుచూసేము' అన్నది సత్యవతమ్మ.

'అవే రావేవనుకో. రాలేకపోయాము

అత్తయ్యా' అన్నాడు ప్రసాదు. ప్యాంటు ఒక చేత్తో పైకి పట్టుకుని కాళ్ళు కడుక్కుంటు 'మామయ్య స్టేషన్‌కి వచ్చా డేమిటి?' అన్నాడు.

'నేను ఒక్కణ్ణే కాదు ఈ పిల్లలూ వచ్చారు చూసి చూసి విసిగెత్తి చక్కా వచ్చాం' అన్నారు నారాయణరావుగారు.

సత్యవతమ్మ నవ్వి 'మా మాటకేం గాని —అంటు గుమ్మంవైపు చూసి—అది ఇవాళ ప్రొద్దుటనుంచి ఆ గదిలో కిటికీ దగ్గర అతుక్కుపోయింది' అనేసి వంటింట్లోకెళ్ళింది కాఫీ తేవడానికి.

గదిలో వరలక్ష్మికి తల్లిమీద కోపం ముంచుకొచ్చింది—ఛ, ఏమిటో అలా చెప్తే ఏంబాగుంది ఇందరిలో!

గదిలోకి వచ్చి చిలిపిగ నవ్వేడు ప్రసాదు 'నిజమా!' అన్నట్టు.

మొగ్గలా ముడుచుకుపోయి రెండు చేతుల్లో ముఖం దాచుకున్నది వరలక్ష్మి.

దగ్గరగావచ్చి చెవిదగ్గర వంగి మెల్లగ అన్నాడు.

'నువ్వు ఇప్పుడు చదువుకున్న అల్లరి పిల్లలా లేవు...అచ్చమైన పెళ్ళికూతురు. నాకోసం...నారాకకోసం ఎదురుచూసే ప్రేమమూర్తిలాగున్నావు. నాకీ అనుభూతి ఎంత బాగుందో తెలుసా? ఇంకెంత మళ్ళీ వారంలోనేగా?'... చేతులు తీసేడు ముఖం మీద నుంచి—

వరలక్ష్మి కళ్ళల్లో వింత వెలుగు! మెరపు! సిగ్గు!...

పాపం వెంకటలక్ష్మి వేవిళ్ళ బాధతో తిన్నదంతా వాంతిచేసుకుని, ఏడాది పిల్లని పక్కలో వేసుకుని నీరసంగ నిద్రపోతోంది. కలలో తల్లిని తండ్రి తమ్ముణ్ణి ఒప్పిస్తోంది, పెళ్ళికి. వరలక్ష్మి దీనపు చూపులకు కలలో కదలిపోతోంది!

రెండురోజుల తరువాత నారాయణరావు గారు శుభలేఖలు ఇవ్వడానికి అన్నపూర్ణమ్మ గారి మేడమెట్లు ఎక్కేరు.

ఆ సమయానికి ఆవిడ గదిలో మంచం మీద కొడుక్కి పట్టీలు, మర్దనాలు చేయడంలో వుంది. మూడురోజుల క్రితంనుంచి ఇంటికిరాని రాజు క్లబ్‌లో పేకాడి బాగా తాగి, ఎక్కడెక్కడో తిరిగి. (!) ఎవర్నో నోటికివచ్చిన బూతులు తిట్టేస్తే వాళ్ళు చితగ్గ చావగొట్టి కాలవప్రక్కన పారేసేరు. తెలిసినవాళ్ళు 'పాపం' అని ఇంటికి చేర్చాయి.

'నీకెంత ఖర్మ పట్టిందిరా రాజు'— అని ఆవిడ వాపోతూ కొడుకు శరీరం మీద తేలిన దద్దుర్లు రక్తం చిమ్మిన చారికలు చూసుకుంటూ చేతితో నిమురుతూ ... కన్నీటి పొరల్లో రెప్పలార్చుకుంటోంది.

శుభలేఖ చూసింది.

వరలక్ష్మి బి. య్యేను ప్రసాదు ఎమ్. యస్‌సి. కిచ్చి తిరుపతిలో పెళ్ళి! సోఫాలో నీరసంగ జారబడి 'కట్నం ఎంతిస్తున్నారు' అన్నది.

నారాయణరావుగారు నిండుగ నవ్వేరు.

'కట్నం ఏమిటండీ? వాడు మా మేనల్లుడే. పుట్టినప్పట్నుంచి అనుకుంటున్న సంబంధమే! ఆ మధ్య మా అక్కయ్య వేళాకోళానికి 'ఒరేయ్ ప్రసాదు ఈ చదువుకున్న కోడలు నాకొద్దురా' అందిట!— 'అయితే నేను జన్మంతా బ్రహ్మచారిగ వుండిపోనా?'— అన్నాట్ట వీడు. అదంటే వాడికి అంతప్రేమ! అమ్మాయికి అంతేననుకోండి. ఆ! మరి వస్తా చాలా పనులున్నాయి' — ఆయన మెట్లు దిగి వెళ్ళిపోతూంటే అన్నపూర్ణమ్మగారు కొడుకు మంచం వున్న గదివైపు జాలిగ చూసుకున్నది!

# రచయితలకి మనవి

*దీపావళి కథలపోటీకి మాకు వచ్చిన కథలలో బహుమతిపొందినవి కాక మామూలుగ ప్రచురణకి స్వీకరించిన కథలని ఈ దిగువ యిస్తున్నాము. ఈ కథల రచయిత(త్రు)లకి వేరే కార్డులు—తమ కథలని ప్రచురణకి స్వీకరించినట్లు—పంపటం లేదు. మిగిలిన కథలు ప్రచురణకి స్వీకరింపబడవని. ఈ సందర్భంలో దీపావళి కథల పోటీ నిబంధనలని మరొకసారి రచయితలకి గుర్తు చేస్తున్నాము.*

సంపాదకుడు
ఆంధ్ర సచిత్ర వారపత్రిక.

ఇంటిబావి—పొలసుగు వెంకటేశ్వర రావు

ఇదీ ప్రపంచం—దాసర్న మహేశ్వరీ దేవి

ఊరపిచ్చుకలు—మాటూరు శివరాఘవులు

ఊరు పూరుకుంది — లేళ్ళపల్లి వెంకట లక్ష్మీనారాయణ

ఎంతదూరమీ రాత్రి?—పి. ఎస్. నారాయణ

ఎక్కవలసిన రైలు—హేమశ్రీ

ఎర్రదీపం—యం. పినాకి

ఏకాకి—యర్రంశెట్టి శాయి

ఏటిలోని కెరటాలు — వి. సీతాలక్ష్మి

ఒక పువ్వురాలింది—అమా

కడలి గర్భంలో కాపురం — కె. పట్టాభిరామయ్య

కన్నీటి బ్రతుకులు—కొండలి మల్లిఖార్జున రావు

కల్యాణీ! కల్యాణి!!— మొక్కపాటి శివాజీ

కొత్తసీసాలో పాతసారా—వై. రఘునాధ రావు

గాజుకళ్ళు—కామిశెట్టి శివశంకర్

గార్డు—బారు నరహరిరావు

గాలివాన — తాతినేని వెంకట నరసింహారావు

గోడలేని జైలు—శ్రీ నాధుడు

చెట్టుకింద ప్లీడరు — కప్పగంతుల మల్లికార్జునరావు

చేతిలోని గీతలు—అప్పాజీ

చేదుమాత్ర—రుక్మిణి

జామిమొక్క — గోవిందరాజు శ్రీనివాసమూర్తి

జీవితంలో ఒకరాత్రి—కృష్ణ

తలుపు—సి. మధు

తెరలు—జి. చిరంజీవి

నీరుపల్లమెరుగు—మంథా వెంకట రమణారావు

నేను అర్హుణ్ణికాను—పి. వి. యస్. హెచ్. కృష్ణమోహన్

నేను మామూలు మడిసిని—ఎస్. ఎస్. మణ్యం

పరిభ్రమణం—కావేరి—సావేరి

పునాది — కాటూరు రవీంద్ర త్రివిక్రమ్

ప్రతిబింబాలు—గన్నిశెట్టి వెంకటేశ్వరరావు

ప్రేమ—పన్నాగం—అమర్

బాంధవ్యం—కాశీనాథ్—కాశీనాథ్

మనసు బ్రతకాలి—వేమకోటి సీతారామశాస్త్రి

మనిషి చావలేదు—కటకం

మలుపుతిరిగిన మనసున మల్లెలు—కమల

మమత — భ్రమత—తాళ్ళూరు నాగేశ్వర రావు

ముగ్ధ—కొడవంటి కాశీపతిరావు

ముగింపు—భవాని

మృత్యువు నవ్విన రాత్రి—సింగరాజా లింగమూర్తి

మైనమ్మ దేవత—పవన్ కుమార్

యుగసంధి—పెళ్ళకూరు జయప్రద

రుక్కు—చిన్న చిక్కు— ముద్దా చిట్టిబాబు

రెడ్ ట్రయాంగిల్ — కొడవంటి కాశీపతిరావు, వి. వి. సూర్యనారాయణ

లహరి—గుండిమెళ్ల అరవిందాదేవి

వసంత రాజీయం—ర్యాలి సూర్యనారాయణ

శారద—జ్యోతి

సంతృప్తి—పి. వసుంధరా రాజగోపాలరావు

సప్తపది—చోడవరపు పట్టాభి

సుగుణ — గుడిసేవ వెంకటేశ్వర రావు

సూర్యోదయం—పి. సత్యవతి

సృష్టిలో చెల్లనిది—రాఘవేంద్ర

హత్య—పుసుపులేటి మల్లికార్జున రావు.



కె. రామలక్ష్మి

# ప్రేమవివాహాలు ...... పరిణామాలు

[ప్రేమ వివాహాలకి బాధ్యత ఎక్కువ అన్నదే ముఖ్య పరిణామంగా భావించే నేను – తప్పుగా ఆలోచించి ఉండవచ్చు. ఎందుకంటే ప్రేమ పేరిట జరుగుతున్న అన్యాయాలు, మోసాలు యీనాడు అందరికీ తెలిసిందే. 'ప్రేమించానం'టూ పెళ్ళాంపిల్లలని నట్టేటముంచి పరస్త్రీని 'ఉంచు'కుంటున్న రోజులివి! ముఖ్యంగా ఆర్థికంగా బాగా స్తోమతు ఉన్నవారు, పూర్వపు జమీందారులు వేశ్యలని పోషించినట్టు ఈ నాడు అదనపుస్త్రీలని పోషించడం ఫాషనుగా తయారు అవుతోంది. దీనికంతకీ ప్రేమే కారణం అంటున్నారు - ఎవరో వీరిని సంజాయిషీ అడగనక్కరలేదు - వారి అంతరాత్మలకే తెలుసు అసలు నిజం. అలాంటి పరిస్థితులలో ప్రేమ వివాహాలకి ఏమంత విలువలేకపోవడంలో ఆశ్చర్యం లేదు. ప్రేమవివాహాలు మంచివా? పెద్దలు నిర్ణయించినవి మంచివా? అన్న చర్చ చాలా పాతకాలపుది. ప్రస్తుతం ప్రేమ వివాహాలు చేసుకోవాలా! కట్నాలకి బలికావాలా అన్నది ఆలోచించాలి. అందుకు ప్రేమకు సరియైన నిర్వచనం ఆలోచించాలి. మీరేమంటారు?]

'ఇదేం ప్రేమ వ్యవహారమా? దొంగపెళ్ళా, రిజిస్టర్ మేరేజి చేసుకుందుకు?' అంటూ సూటిగా ప్రశ్నించిందో స్నేహితురాలు —యీమధ్య. 'అదేమిటే? ఉద్యోగస్థులు,ఇష్టపడి చేసుకుంటున్నారు— ఇది ప్రేమవివాహం కాదా? రిజిస్టర్ మేరేజి చేసుకున్నంత మాత్రాన దొంగపెళ్ళి అయిపోతుందా?' అని నేనూ అడిగాను. అంటే స్నేహితురాలి మాటలకి అర్థం తెలియక కాదు. ఏ కడుపో కాలో వస్తేనే రిజిస్టరు పెళ్ళి చేసుకుంటారనీ, అప్పుడే దాన్ని 'మాది ప్రేమవివాహం' అంటూ చెప్పుకుంటారని కొందరి గట్టి నమ్మకం. అంతేకాని బాగా వయస్సు వచ్చాక, కోరి పెళ్ళి చేసుకుంటునప్పుడు బాజాభజంత్రీలూ, అనవసరపు డబ్బు కర్చూ ఎందుకని సింపుల్‌గా సివిల్ మేరేజి చేసుకుంటారని చదువుసంధ్యలున్న వాళ్ళకే తోచడం లేదే—అలాంటిది పాతకాలపు ధోరణికి స్వస్తి చెప్పలేని పెద్దలకి మటుకు ఎలా తోస్తుంది? అని వో దండం పెట్టి ఊరుకోవాలి. అంతేమరి.

"పూర్వకాలంలో పెళ్ళిళ్లన్నీ ప్రేమపెళ్లిళ్లే" అంటూ సాహిత్యం కోట్ చేస్తారు మావారు. 'మరి పూర్వం రోజులిక రావు' అంటాడు తాతయ్య. దానికీ దీనికీ క్లాష్‌వచ్చి ఎక్కడలేని నిరాశా నిస్పృహా ముంచుకు వస్తుంది.

'మేం ప్రేమించి పెళ్లి చేసుకున్నాం' అంటే పది పన్నెండుఏళ్ల క్రితమే 'మీరేం పిచ్చి వెధవలా ఏం' అన్నట్లు చూసేవారు. మరి ఈ నాటికంటే ఆరోజులలోనే దృక్పథం వైశాల్యం ఎక్కువగా ఉండేదని నా అంచనా. అలాంటిది ఇప్పుడు నిజంగా పిచ్చివాళ్లే అనుకోవడంలో ఆశ్చర్యం ఏముందీ?

'సత్యభామ ఎంత శృంగారపు దేవత అయినా రుక్మిణిలా కృష్ణుణ్ణి ప్రేమించి పెళ్ళాడలేదుకదా?' అంటూ ఏదో చెప్పపోతున్న నన్ను అటకాయించి అందుకే సత్యభామ అంటే పడిచచ్చే కృష్ణుడు రుక్మిణిన్నీ చూశావా..... అలాఅలా దూరంగా ఉంచాడు'అంది సుమతి. 'నాముఖం' అనడం కంటే ఏమీ అనలేకపోయాను. 'మేం ప్రేమించాం'అంటూ పోస్టు కార్డులు రాస్తారు. "మేం ఒకరికొకరం ప్రాణత్యాగమేనా చేస్తాం గాని వదిలి ఉండలేం. ఏం చెయ్యమంటారు?" అంటూ సుదీర్ఘంగా ఉత్తరాలు రాస్తారు. 'నేను ప్రేమించాను కాని, మా అమ్మ కట్నం కావాలంటోంది ఏం చెయ్యను?' అంటూ వాపోతాడో వయస్సు వచ్చిన పసివాడు. ఇక కాలేజీ పిల్లలు సరేసరి. దిలీప్‌కుమార్‌ని, నాగేశ్వర్రావుని ఇప్పుడు కృష్ణని ధర్మేంద్రని ఇంకా కావలిస్తే యద్దనపూడి సులోచనారాణి హీరోలని బాపూ వేస్తున్న బొమ్మలని—అన్నిటినీ ప్రేమిస్తున్నాం— అంటారు. కుర్రవాళ్ళ ఇలాంటి ప్రేమని—అదే హీరో వర్‌షిప్‌లాంటిదాన్ని సులభంగానే అర్థం చేసుకోవచ్చు. కాని 'ప్రేమించాను— కాని' అంటూ శంకలు వెళ్లపోసే యుక్త వయస్కుల వూహాలు వోపట్టాన అర్థం కావు. అసలు ప్రేమకు ఇలాంటివాళ్ళ ఇచ్చే నిర్వచనం ఏమిటి? అని ఆలోచిస్తే చాలా గమ్మత్తయినవీ, భయంకరమైనవీ వూహాలు వస్తాయి. ప్రేమంటే ఏమిటి?గుడ్డిగా ఒకటే అర్థం చెప్పుకుంటారు! అన్నా చెల్లెళ్ల మధ్య, స్నేహితుల మధ్య, తల్లీబిడ్డల మధ్య—వీళ్లందరిదీ ప్రేమకాదా? అంటూ ఆ మధ్య చాలామంది నన్ను కోప్పడ్డారు. కాని నాకప్పుడొక సందేహం వచ్చింది— 'చెల్లాయి నిన్ను ప్రేమిస్తున్నాను' అంటూ ఏ అన్నా చెప్పినట్లు నా చెవిని పడలేదు. 'పోవే మొద్దూ' అనే అన్నయ్య నన్ను ప్రేమించడం లేదను కోవాలా? ఇక ఇన్నాళ్ళూ అన్నా చెల్లెళ్లమధ్య అన్యోన్యత స్నేహితులమధ్య స్నేహ సౌహార్ద్రాలు, తల్లి బిడ్డల మధ్య ఆప్యాయత అనురాగం లాంటివి ఉంటాయి. నిజంగా ఒకరినొకరు గాఢంగా కోరుకునే యువతీయువకుల మధ్యఉండేదాన్నే ప్రేమ అంటారన్న వూహ ఒకటి మొండిగా నాలో నిలిచి పోయింది. అందుకనే 'నేను ప్రేమిస్తున్నా'నంటే 'ఎవరినీ?' అంటాను. 'పెళ్లి ఎప్పుడు చేసుకుంటారు' అంటాను. పిచ్చిమొద్దునే మరి!

'ప్రేమించాం' అంటే మేం స్నేహంగా ఉన్నాం, అనేగా అర్థం. యువతీయువకుల మధ్య ఈస్నేహం సర్వసాధారణంగా పెళ్లికి దారి తీయాలి. లేకుంటే ప్రేమే అవినీతి అనేస్తారు. కాని మన చుట్టూ ఉన్న ప్రేమికులు, ప్రేమవేరూ పెళ్లివేరూ అని ఎప్పుడో తేల్చుకున్నారు. అందుకే కొంచెం తెలివి మీరి ఈ మధ్య 'మేం ప్రేమించి పెళ్లి చేసుకున్నాం' అన్నా, 'కట్నం ఎంత? లాంఛనాలేపాటి" అంటూ అడిగేస్తున్నాను— ఎదుటివాళ్ళు ఏమేనా అనుకుంటారని!

ప్రేమవివాహాల సంఖ్య బాహటంగా (నిజానికి భార్యాభర్తలం అంటూ కలిసి జీవిస్తున్న స్త్రీ పురుషులని చట్టరీత్యా భార్యాభర్తలుగా గుర్తించి—వారి వివాహం అయినట్టే లెక్క. సెల్ఫ్‌రెస్పెక్టు మేరేజి అది— అని ప్రభుత్వం ఒప్పుకుంటూంది) పెరగకపోవడానికి కారణాలు ఏమిటయి ఉంటాయని తీవ్రంగా ఆలోచించాను. దరిదాపు పదమూడేళ్ల

వైవాహిక జీవితాన్ని వెనుక పెట్టుకున్న నాకు ఈ ప్రేమవివాహాలంత బాధ్యతతో కూడుకున్నవి కావు, మామూలు పెళ్లిళ్ల అనిపించడంతో అబద్ధం లేదు సరికదా—అది పచ్చి నిజం అంటే మీరు నమ్మాలి.

'హాయిగా ప్రేమ పక్షులలాగా విహరిస్తూ ప్రేమ జీవిస్తూ ప్రేమ భోజనం చేస్తూ ప్రేమనే మాట్లాడుకుంటూ బ్రతికేస్తారు, ప్రేమించి పెళ్లి చేసుకున్న వాళ్లు' అంటూ భావావేశ తీవ్రతలో కళ్లు తేలవేసి చెప్పుకు పోతూందో చిన్నారి. 'స్టాప్' అన్నాను. ఏం? అంది. 'ఏమేమిటి? ప్రేమించి పెళ్లి చేసుకుంటే దానివల్ల కష్టసుఖాలు చాలా వుంటాయి. ప్రేమించి పెళ్లి చేసుకున్నా పెద్దలు ఒప్పించితే పెళ్లి చేసుకున్నా— ఫలితం ఒకటే— ఇద్దరు కలిసి జీవించడం అది. ఇద్దరు కలిసి జీవించడం అంటే వినడానికి చాలా స్వీట్‌గా ఉంటుంది. కాని కలిసి బ్రతకడం ప్రారంభించాక కాని అదెంత




కష్టమో, ఎన్నిరకాల 'సర్దుకుపోవడాలు' కావాలో వీలా కలల్లో బ్రతికేవాళ్లకి చెప్పడం కష్టం' అన్నాను. ప్రేమించి పెళ్లి చేసుకుంటే అదేకదా సుఖం! ఒకళ్లనొకళ్లు బాగా అర్థం చేసుకోగల్గుతారు. పప్పులో ఉప్పులేకపోయినా అన్నం ఉడక్కపోయినా ప్రేయసి కళ్లలోకి చూస్తూ తినేస్తాడు' అంది చిన్నారి. 'పిచ్చి, అక్కడే ఉంది. సాధ్యమైనంత వరకూ ప్రేమించి వివాహమాడిన భార్య భర్తమీద ప్రేమ కొద్దీ అనురాగం కొద్దీ ఉప్పులో పప్పు అన్నంలో ఉయ్యం ఉండి పోనియ్యదు. అతగాడు సరదాగా తృప్తిగా తినడమే ఆమె ధ్యేయం కనుక ఒళ్లు దగ్గర పెట్టుకుంటుంది. అదే కట్నం భార్య అయితే నిర్లక్ష్యంచేసినా కొంపలంటుకోవన్న ధీమాతో ఉంటుంది' అన్నాను. అయితే ఎంత ప్రేమించి పెళ్లి చేసుకున్నా ఈ వంటావార్పూ గొడవా తప్పవా? అంటూ నీరసంగా అడిగింది .... 'హృదయానికి దారి కడుపులోంచే' అన్న సత్యాన్ని గ్రహించలేని అమాయకురాలు! అనుభవజ్ఞుల్ని

# ప్రేమవివాహాలు

వంటావార్పూతో ఆగని బాధ్యత లుంటాయి కోరి చేసుకున్న గృహిణికి. భర్తకి బాధకలిగేలా ప్రవర్తించే సాధారణ గృహిణికి ఉండే గయ్యాళితనం, సణుగుడు, దెప్పడంలాంటివి ఏ మాత్రం చుట్టుపక్కలకి రానియ్యలేదు. చూసి చూసి తన వేలితో తన కన్ను పొడుచుకున్నట్లు కదా? అని గ్రహిస్తుంది. అందుకే ప్రేమజంట మధ్యని నువ్వు నేను అనే కాని నీవాళ్లు నావాళ్లు అన్న ప్రసక్తిరాదు. తమ కష్టసుఖాలకి పూర్తిగా తామే బాధ్యులమని తెలుసుకున్న యీ రకం కొంచెం ఇంగితం ఎరిగి ప్రవర్తించుతారనడంలో సందేహం లేదు. అత్తవారింట స్వంత బాధ్యతమీద కాలుపెట్టిన కోడలు 'మా నాన్న నాగొంతు కోశాడు' అనడానికి లేదు. 'నే మాయింటికి పోతా' ననడానికి లేదు. (అందులో ముఖ్యంగా పెద్దలని ఎదిరించి పెళ్లి చేసుకున్నవాళ్లు!) తమ కష్టాలకి బాధ్యులెవరా అని వెనకనే అవసరం లేదు. అందుకనే ప్రేమవివాహాలు పటిష్టమై నాలుగు కాలాలపాటు నిలబడాలంటే — సాధారణ వివాహాలకంటే నోర్పూ నేర్పూ కూడా అవసరం. పదమూడేళ్ల సాంసారిక జీవితంలో ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొన్న నేను ఎప్పుడేనా ఇంటికి వెడితే 'భోజనానికి ఉండిపో' అనదు అమ్మ. ఎందుకని? నే ఉండను కనుక. మా వైవాహిక జీవితంలో నేను పుట్టింట గడపిన రోజులు పద్నాలుగో పదిహేడో. అంతే. ఎవరూ రావద్దనలేదు. పోవద్దనలేదు. అయినాకూడా, బాధ్యతల బరువు అలాంటిదని జీవితమే నేర్పిస్తుంది పాటాలు. నా స్నేహితురాలు ఐదో కాన్పుకి కన్నింటికి వచ్చి అదే వాపోయింది— నీ జీవితం ముందు నాది చాలా హీనంగా కన్పిస్తోందే. అంది మూడో నెలలోనో ఎప్పుడో పుట్టింటికి పురిటికి పంపి పాపకి అయిదో నెల వచ్చేదాకా కన్నవారిపై బాధ్యతలు వదేసి హాయిగా ఉంటారు అల్లుళ్లు. ఇక పెళ్లిచేసి చేతులు కాల్చుకుని పిల్లని పంపి ప్రయోజనం ఏమిటి? అంటున్నారు కన్నవాళ్లు—హాయిగా పెళ్లి చేసి అల్లుణ్ణి కూడా ఇక్కడే అట్టేపెట్టుకుంటే ఇద్దరూ ఉద్యోగాలు చేసుకుందురు. ఏలాపో పెట్టించితే యీ కాన్పుల గొడవ తప్పేది. అంటూంది కన్నతల్లి! నిజమే బాధ్యతల బరువంటే అర్థం తెలియని భర్తలున్న గృహిణులు ఇటు కన్నవారికీ అటు అత్తవారికీ కూడా లోకువ. నేనెప్పుడూ అనుకునేదాన్ని పురిటి ఖర్చులు భర్తే భరించాలని. 'నోరుమూయి' అంటూ కోప్పడేవారు. అప్పటికే పెళ్లిళ్లు అయిపోయిన స్నేహితులు—'అప్పుడే కదా పిల్లలు కూడా బాధ్యతలో ఓ భాగం అనీ, పిల్లలు ఎక్కువ అయిన కొద్దీ కృంగిపోవలసి వస్తుందనీ తెలుస్తుంది?' అని వాదించే దాన్ని. చూస్తోంగా? అన్నస్నేహితులీనాడు చూస్తున్నారుగా?

నువ్వేం తెచ్చావని నెత్తినెత్తుకోవాలి? అంటూ మావారు సాధించినప్పుడు అనిపిస్తూ ఉంటుంది— ఏం తేవాలి? ఏంతెచ్చి ఉన్నా అవన్నీ ఎవరోఇచ్చినవేగా? అని. 'మాది' అంటూ ధీమాగా సేకరించిన గృహ సామ్రాజ్యంలోని నువ్వైనా కొండంతగా కన్పించి తృప్తి నిస్తుంది. ఎవరిమీదా ఆధారపడలేని సంసారం కనుక రాబడి పోబడుల విషయంలో మెళుకువ లెరిగి బ్రతుకు నెట్టుకొస్తారు. కట్నం డబ్బుతో కారుకొన్న తృప్తికంటే స్వంత డబ్బుతో భార్యని జల్సాగా షైరుతిప్పిన తృప్తి ఎలా వస్తుంది?

ప్రేమ వివాహాలకి నేటి యువతరం అంత ఆసక్తి చూపక పోడానికి కారణాలు వెతకవచ్చు. బోలెడు దొరుకుతాయి. పెద్దవాళ్లు చూసిన సంబంధాలు చేసుకుంటే నిశ్చింతగా కాలం వెళ్లిపోతుంది. జీవితం నిత్యనూతనంగా ఉండకపోయినా! — 'నువ్వు పో నీ పుట్టింటికి' అని భార్యని గెంటేసే ఫ్రీడమ్ ఉంటుంది. మగవాడికంతకంటే కావలసినదేముంటుంది? అంటారు మావారు. 'చచ్చినట్టు పడుండు, లేకపోతే ఎట్లో దూకు' అని ఎవత్తెతోనో కులకడానికి ధైర్యంఉంటుంది— నలభై పైవడ్డ ప్రతి పురుషుడికీ యీ కొత్త అనుభవం కావాలని ఉంటుందట. జీవన్మరణ సమస్యలనేవి వేరుగా ఉండవు. నిత్యజీవితమే అది అనిపించేటు భార్యలని యథేచ్ఛగా వాడుకోవచ్చు— ఎవరేనా ఏమేనా అంటే అటుచేసిన వాళ్లనీ, ఇటు పిల్లనిచ్చిన వాళ్లనీ అటేడు తరాలూ ఇటేడు తరాలూ దెప్పవచ్చు—అదో తృప్తి. ఆడదానికి లొంగే మగవాడికి కూడా అడపాదడపా సాధించాలని ఉంటుంది. ఆ అవకాశం చిన్నచిన్న విషయాలలో ఇచ్చి మల్లెపూలే ఎందుకు పెట్టుకుంటావు: రోజా నాకిష్టం అంటే సరే—ఆ కవిగాడి పద్యం ఎంతో బాగుందంటే— ఏడిసినట్టుందనో దెబ్బలాడుకొండి—రసవత్తరంగా ఉంటుంది. అది ప్రేమించి పెళ్లి చేసుకున్నవాళ్లు చేస్తుంటారు. అది వారి జీవితం వారికి నేర్పిన తిరుగులేని పాటం) పెద్ద విషయాలలో ముఖ్యవిషయాలలో ఏకీభావం కన్పరిస్తే సద్దుకుపోతుంది. అని కట్టుకున్న పెళ్లాం చేయలేదు. ప్రేమించిన పెళ్లాం చేయకల్దు.

ప్రేమ వివాహాల ఫలితాలు కూడా గమ్మత్తుగా ఇంద్రధనస్సుల్లాగా ఉంటాయి కాబోలు. స్వేచ్ఛా వాతావరణంలో, సంకుచితత్వం లేని మనస్తత్వాల మధ్య పెరిగిన పిల్లలు హాయిగా ఉంటారనడంలో సందేహం అక్కర లేదు. నిజంగా కోరి పొందిన పిల్లలు వాళ్లు. తియ్యగా మోద్దామని తలదాల్చిన బాధ్యతలు వాళ్లు. తప్పనిసరి గొడవకాదు. సాంసారిక జీవితాలు చిక్కుముళ్లు పడిపోవడానికీ రసవిహీనం కావడానికీ చాలవరకు యీ పిల్లలు కారణం. వారిని అనురాగపూరిత వాతావరణంలో పెంచితే ఎంత ఆనందాన్నిస్తారో, కోపతాపాల మధ్య పట్టీ పట్టని అభిమానాల మధ్య పెంచితే పక్కలో ముల్లే అవుతారు. అందుకే కొందరిళ్లలో తల్లితండ్రీ కంటే

అమ్మమ్మ దగ్గరికో అత్త దగ్గరికో "సీతామో" అంటూ ఏడుస్తారు. పిల్లలు. అటువంటి అవకాశం ప్రేమించి పెళ్లాడిన తల్లి చూసిచూసి ఇవ్వ లేదు.

'ప్రేమించి పెళ్లి చేసుకుంటే ఏ గొడవా లేదనుకున్నాను' అంది చిన్నారి. 'గొడవ అప్పుడే ప్రారంభం అవుతుంది' అన్నాను. అంతేకదా మరి, "పెళ్లితో ప్రేమలు నశిస్తై' అనుకునే వాళ్లకేం చెప్పలేంగాని, పెళ్లితోనే ప్రేయసి పని మరీ భారం అవుతుంది. ఇన్నాళ్ళూ దూరంగా ఉండి మురిపించడం సులభమే. చెంతచేరి మురిపెం తీరాక కూడా మురిపిస్తూ జీవితాంతం ఉండగల నేర్పు ఎవరూ నేర్పిస్తే వచ్చేది కాదు. కోపం వచ్చి పుట్టింటికి వెళ్లలేని భార్య భర్తతో ఏకాంతంగా నాలుగు రోజులు గడిపి నూతనోత్సాహాన్ని ఆనందాన్ని పొందు కోల్పుతుంది. అది ప్రేమ యిచ్చే నేర్పు. అందుకే మా అన్నయ్య అంటూ ఉంటాడు 'నీకేమే, నీకున్న లాంటి మొగుడే నాకుంటే హాయిగా కాలం గడిపేద్దు'నని!— ఆడపిల్ల కానందుకు అసూయపడే మగవాళ్లు కూడా ఉంటారన్నమాట!

'అయితే అమ్మ చెప్పిన సంబంధమే చేసుకోవడం సుఖం' అంది చిన్నారి. ప్రేమ వివాహం అంటే చిచ్చుతో పూహించుకుంది. ఇంత బుజాలమీద బరువని అనుకోలేదు.

'నిజమే కొన్ని గుణాలు, కొన్ని అవకాశాలు లేనప్పుడు పెద్దలు చెప్పిన పెళ్లి చేసుకోవడం తేలిక— సుఖమైన బాట కోరుకోవడం తేలిక కదా? మనిషిపై మనిషిగా గౌరవం, ఆత్మగౌరవం, శాశ్వతంగా ఇవ్వగలస్తోమతున్న మగవాడే ప్రేమపెళ్లికి దిగాలి. లేకుంటే ఇద్దరికే అది నరకంగా తయారై— మూడురోజుల ముచ్చట అయి పూరుకుంటుంది. శాశ్వతమైన విలువ తాను కట్టుకున్నవాడికివ్వగల దూరదృష్టి కల ఆడదే ఇలాంటి వివాహానికి దిగాలి. లేకుంటే— ఇదొక కొని తెచ్చుకున్న బెంగ అవుతుంది. నిన్ను చేసుకోవట్లేగాని' అంటే 'ఎవరు చేసుకోమన్నార'న్న ప్రశ్న వెంటనే వస్తుంది. ఇలా దెప్పుకుంటూ జీవితం ఎన్నాళ్ళు సాగుతుంది? ఆర్థికంగా ఎవరి మీదా ఆధారపడనవసరం ఉండకూడదు. మానసికంగా ఎక్కడెక్కడో ఉన్న ఆత్మీయతలని తను ప్రేమించిన వ్యక్తిపై కేంద్రీకరించగల సాహసం కావాలి. ఇన్నింటికి పైగా "మనం మన కోసమే"—'ఎవరో ఏదో అంటారని' అంటూ సంకోచం ఉండకూడదు. అందుకే నా స్నేహితురాలు 'ఇదేం ప్రేమ పెళ్ళి, దొంగపెళ్ళి'అంది— ఆ సంకోచం వేరుపురుగు లాంటిది. ఎప్పటికైనా పెంచుకున్న ఆశలని మొదలంటా కొరికేస్తుంది. అందుకే ముందే ఆలోచించుకోవాలి.




'నేను ప్రేమించాను' అనేముందే చాలా ఆలోచించాలి. ఎందుకంటే— మగవాడికి ప్రేమ వేరు, జీవితం వేరు. ఆడదానికి అలా కాదు. ప్రేమే జీవితం. ఆమె రెండింటినీ వేరుగా చూడలేదు. వివాహంతో ఆమెకు ఈ రెండూ ఒకటైపోతాయి.

"ప్రేమే నేరమవునా?" అంటూ వాపోయాడో యువకుడీ మధ్య. మరి కూడనిచోట ప్రేమ నేరమే— ప్రేమించానంటూ పక్కవాడి భార్యని ప్రేమిస్తే ఎలా? ప్రేమించానంటూ కడుపొచ్చాక గైరుహాజరైతే ఎలా? ప్రేమించానంటూ 'మనం పెళ్లి చేసుకోవద్దు— ఇలాగే ఉండిపోదాం' అంటే ఎలా? ఇవన్నీ 'ప్రేమించాను' అని అనేముందే ఆలోచించుకోవాలి —ఇద్దరూ. ప్రేమ వేరూ స్నేహం వేరుగా ఉన్ననాళ్ళు భయంలేదు. ఆ రెండు ఒకటిగా చేయదల్చిన నాడు భవిష్యత్తులోకి చాలా దూరంగా ఆలోచించి— మరీ అనాలి ప్రేమించానని

చీకట్లో సముద్రం హోరు వింటున్నప్పుడు, అమావాస్యరాత్రి మిలమిలలాడే నక్షత్రాలని చూస్తున్నప్పుడు కట్టమరనేల మీద కూర్చుని ఉదయించే చంద్రుణ్ణి చూస్తున్నప్పుడు, అర్థం పర్థం లేకుండా అడ్డమైనవీ చర్చిస్తున్నప్పుడు, దారి తెన్నూ లేకుండా తాంబరం నుండి బీచి స్టేషను దాకా రైల్లో తిరిగినప్పుడు చెయ్యీ, చెయ్యీ కలిపి మాటామంతీ లేకుండా కూర్చున్నప్పుడు — పదిహేనేళ్ల క్రితం ఎలా అనిపించిందో—ఇప్పుడూ అలాగే నిత్య నూతనంగా అనిపిస్తుందినాకు. 'నీకళ్లు పొరలు కమ్మాయి' అంటారు మావారు. నిజమే, అవి తొలగిపోవడం నాకిష్టం లేదు!!



# నాటికీ నేటికీ ఒక్కడే



ఆత్మవిశ్వాసం కార్య సాఫల్యతకు దివ్య ఔషధం అని నిరూపించిన వ్యక్తి శ్రీ నాగేశ్వరరావు. 'నిండుకుండ తొణకదు' అంటారే, అలాగే అక్కినేని ఆదరింపులకు బెదరింపులకు చలించడు ; ఎన్ని అవాంతరాలు వచ్చినా అనుకున్న దాన్ని సాధించనిదే నిద్రపోడు; నిజాన్ని చెప్పి విశ్వాసాన్ని కొని తెచ్చు కుంటాడు; ఒక వ్యక్తియొక్క మంచి, చెడ్డలను మొదటి పరిచయంలోనే పసిగట్ట గలడు; వాదనలోనే వుంది మజా అంటాడు; కర్తవ్య నిర్వహణలో క్రమశిక్షణను ప్రదర్శిస్తాడు ; చెప్పినంతా చేసి చూపెట్టి 'భలే మొనగాడు' అనిపించు కుంటాడు.

నటుడిగా తాను నిర్వహించే ప్రతి పాత్రలో రాణిస్తాడు; తనకు వచ్చిన పాత్రలనే యెన్నుకుని, ఆయాపాత్రల్లో లీనమై నటించాడా అనిపించేవిధంగా ప్రేక్షకులచే కీర్తింపబడ్డాడు.

బడిచదువు అంతగా అబ్బక పోయినా, బయటి చదువులో పట్టభద్రుడయ్యాడు; ముఖ్యంగా మానసిక సంఘర్షణలలో కుమిలిపోయే విషాదపాత్రలను గంభీరంగా పోషించి సెభాష్ అనిపించుకుంటాడు.

మద్రాసునుండి హైద్రాబాదుకు తరలి వెళ్లాడు; సారథి స్టుడియోలో తన నిర్మిత చిత్రాల షూటింగులను జరిపించాడు; ప్రభుత్వానికి ఫిలిం పరిశ్రమ అభివృద్ధికై కొన్ని సలహాలిచ్చాడు.

నాగేశ్వరరావు యిచ్చిన సలహాలను, ప్రభుత్వం పరిశీలించింది. అందులో కొన్నింటిని అంగీకరించింది; మరి కొన్నింటిని ప్రభుత్వం ఆపాదించింది. అప్పటినుండి యిప్పటివరకు భాగ్యనగరంలో ఫిలిం పరిశ్రమ సాధిస్తున్న ప్రగతి మీకు తెలిసిందేగా.

చిత్రాల్లో అసభ్య శృంగారాన్ని అరికట్టాలని అనడంతోనే ఆగక, తాను నటిస్తున్న చిత్రాల్లో దాన్ని ఆచరణలో పెడుతున్నఉత్తమకళాకారుడు నాగేశ్వరరావు.

ఆనాడు హీరో నాగేశ్వరరావు హైద్రాబాదుకు తరలి వుండకపోతే, యీనాడు భాగ్యనగరంలో ఫిలింరంగం యింతటి ఔన్నత్యాన్ని పొందివుండేది కాదు, అక్కినేని తనబిడ్డల సౌకర్యార్థమై హైద్రాబాదుకు వెళ్లినా, పారిశ్రామిక రంగంలో ప్రవేశించాలని వెళ్లినా ఫిలిం పరిశ్రమ హైద్రాబాదులో వర్ధిల్లడానికి సూత్రధారు డయ్యాడనడం సత్యదూరం కాదని భావిస్తున్నాను. చిత్రరంగంనుండి విశ్రమిస్తానని ప్రకటించాడు, కానీ ప్రేక్షకుల అభిమానం అతన్ని యింకా ఆంధ్రుల అభిమాన కథానాయకుడిగా వుండాలని కోరుతూవుంది; అందుకే నాగేశ్వరరావు మున్ముందు యేంచేస్తాడో చూడాలనివుంది.

'కర్షేఫలేః' అన్న ఆర్యోక్తి యీ కళాకారుడిపట్ల సవ్యంగా వ్యవహరించింది. కర్షకుడిగా పుట్టి, కళాకారుడిగా మెట్టి నేడు పారిశ్రామికుడిగాకూడ నెట్టుకొస్తున్న అక్కినేనిని నటశిరోమణి అనడం అతిశయోక్తి కానేరదు.

1944 నుండి 1968 వరకు ఆంధ్రుల అభిమాన చలనచిత్ర కథానాయకుడిగా విరాజిల్లే అక్కినేనికి యీ సంవత్సరం రజతోత్సవ సంవత్సరం.

వ్యాసం : శ్రీనివాస్
ఫొటో : ప్రభాకర్



'కలసిన మనసులు'లో భారతి, రామ్మోహన్, మాలతి.

చిత్రసమీక్ష :

# కలసిన మనసులు

సెక్సు, దుష్టపాత్ర, స్టంటు ఆదిగాగల 'మసాలా'కి దూరంగా ప్రయోగాత్మకంగా నిర్మించిన చిత్రం కౌముదీవారి కలసిన మనసులు. నిర్మాత ఆదర్శం గొప్పది. ఈ ఆదర్శానికి ఎంతగా ఆదరణ లభిస్తుంది అనేది ప్రేక్షకులమీద ఆధారపడివుంటుంది.

'మోసం జరిగిపోయింది పెళ్ళికూతురును మార్చేశారు' అని పెళ్ళిపీటలమీద నుంచి పెళ్ళికొడుకు లేచిపోతాడు. అంతవరకు పెళ్ళికూతురు ఫలానా ఆమె అని అతను వూహించుకుంటూవుంటాడు. కలలు కంటూవుంటాడు. దానికి కారణం— మిత్రుడు చెల్లెలిని పిలిచినప్పుడల్లా అతని ప్రియురాలు పరుగెత్తుకురావడం! ఆమెనే స్నేహితుని చెల్లెలుగా భావించి ప్రేమించడం. చివర్లో—అసలు ప్రేమించింది మిత్రుని చెల్లెలినే అనీ, రూపంమాత్రం వేరొకరిది వూహించుకున్నానని ప్రేక్షకుల్ని తేలిగ్గా నమ్మించేద్దామనిచూస్తాడు. ఈ మాటలో పాత్రలకష్టాలన్నీ ఈడేరడం వల్ల కథ శుభాంతంగా ముగుస్తుంది.

కొన్నికొన్ని సన్నివేశాల చిత్రీకరణ అద్భుతంగావుంది. సంభాషణలో సహజత్వం కొరవడి అక్కడక్కడ అతికినట్లు అనిపిస్తుంది. చిత్రీకరణలో శ్రద్ధతీసుకొనివుంటే రాధామాధవుల అంతర్నాటకం మరింత మనోహరంగా వుండివుండేది. కథలో బలం ఖలాంటి చిన్న చిన్న లోపాలని కప్పిపుచ్చి చిత్రాన్ని హృద్యంగమంగా నడిపించింది. ఏ ఆర్భాటాలూ లేకుండా, నేడు విడుదలవుతున్న చిత్రాలతీరు తెన్నులకి విభిన్నంగా ఉత్తమ స్థాయిలో నిర్మించిన చిత్రమనక తప్పదు.

నటీనటులంతా తమతమపాత్రలని సామర్థ్యంతో చాకచక్యంగా నిర్వహించారు. ముఖ్యంగా వాణిశ్రీపాత్ర స్త్రీల సానుభూతిని బాగా చూరగొంటుంది. శోభన్ బాబు తనపాత్రని ఆద్యంతమూ అర్థవంతంగా పోషించాడు. తదితర ముఖ్యపాత్రలను రేలంగి, జగ్గయ్య, రాంమోహన్, అల్లు రామలింగయ్య, రావికొండలరావు, భారతి, మాలతి, హేమలత, మీనాకుమారి, జేవి శాంతికళ పోషించి చిత్రానికి బలాన్ని చేకూర్చారు.

కమలాకర కామేశ్వరరావు దర్శకత్వం వహించిన ఈ చిత్రం— సకుటుంబ సమేతంగా చూడతగ్గది. సంగీతం మాస్టర్ వేణు. నిర్మాత యం. యస్. రెడ్డి.

—సీతరాజు

# సినిమా డైరీ

● పద్మాఫిలింస్ నిర్మించే "ఏకవీర" చిత్రం యొక్క ప్రారంభపూజ అక్టోబరు 11న జరిగింది. ఈచిత్రానికి నిర్మాత డి. ఎల్. నారాయణ, దర్శకుడు సి. ఎస్. రావ్.

● మాధవి పిక్చర్స్ నిర్మించే "బందిపోటు దొంగలు" చిత్రం యొక్క అవుట్‌డోర్ షూటింగు అక్టోబరు 10 నుండి హైద్రాబాదు పరిసరాల్లో వారంరోజులపాటు జరిగింది. ఈ చిత్రానికి నిర్మాతలు జి. సుబ్బారావు, రాజేంద్రప్రసాద్, ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు., దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు.

● నవశక్తి ఫిలింస్ "నిండు సంసారం" షూటింగు సి. ఎస్. రావు దర్శకత్వంలో అక్టోబరు 11, 12 తేదీలలో వాహిని స్టుడియోలో జరిగింది. ఇందులో ఎన్. టి. రామారావు, ప్రభాకరరెడ్డి, కృష్ణకుమారి, పద్మనాభం, ఎస్వరలక్ష్మి, నాగయ్య, రేలంగి పాల్గొన్నారు.

● కౌముదీ ఫిలింస్ "కలసిన మనసులు" అక్టోబరు 11న, సూర్యచిత్ర "పెళ్ళిరోజు" అక్టోబరు 12న విశాలాంధ్ర అంతటా విడుదలయింది.

● నటి సావిత్రి నిర్మిస్తున్న "చిన్నారి పాపలు" తమిళ చిత్రంలో బాలమురళీకృష్ణ ఒక పాట పాడారు.

● సౌందర రాఘవన్ మూవీస్ "కల్యాణ కలియుగం" రష్యా చిత్రోత్సవానికి యెన్నికయింది.

● పి. ఎస్. ఆర్. పిక్చర్స్ "పేదరాశి పెద్దమ్మ" చిత్రంలో మాంత్రికుడి గుహకు సంబంధించిన షూటింగు వాహినీలో అక్టోబరు 12 నుండి జరిగింది. ఇందులో రాజనాల, రాజసులోచన పాల్గొన్నారు. ఈచిత్రానికి పింజలసుబ్బారావు నిర్మాత., గిడుతూరి సూర్యం దర్శకుడు.

● "గ్రామదేవతలు" షూటింగు సందర్భంగా ప్రముఖనటుడు శ్రీ జగ్గయ్య ఎం. పి. కి గాయాలు తగిలి వారిని మాధవి పిక్చర్స్ అధినేతలు హాస్పిటల్‌కి తీసికెళ్ళి ఎక్స్-రే తీయించినట్లు గతవారం "సినిమా డైరీ"లో వ్రాసాను. కాని జగ్గయ్యగారికి దెబ్బతగిలి పదాదిరోజులవరకు వారి ఆరోగ్యం విషయములో ప్రత్యేకశ్రద్ధను కనబరుస్తున్నది. ఖర్చులన్నీ భరిస్తున్నారు. "గ్రామదేవతలు" నిర్మాతలేనని తెల్పుతున్నాను.

# క్రయిమ్ చిత్రాలు ఎలా తీస్తారు?



'పడమంత్రపుసిరి'లో జోల్డ్ రింగ్ విధానంలో ఫైట్ చిత్రీకరణ.

నేర పరిశోధన ప్రధానంగా గల చిత్రాలకు 'టేకింగ్'లో ఒక ప్రత్యేక విధానం ఉన్నది. మామూలు కథా చిత్రాలకన్న క్రయిమ్ చిత్రాల చిత్రీకరణలో 'కెమెరా' కెంతో ప్రాముఖ్యత వున్నది. 'అసాధ్యుడు' చిత్రం యీ విషయాన్ని నిరూపిస్తుంది. ఆ చిత్రం చూసినవారికి క్రయిమ్ చిత్రాలలో కెమెరాకుగల ప్రాధాన్యత ఎంతటిదో సుబోధకం అవుతుంది.

ఈ తరహా చిత్రాలకు కథ ఎపుడూ 'ఫ్లేష్ నేరేషన్' లేకుండా వుండాలి. అసాధారణ పద్ధతిలో చెప్పాలి. ఆర్టిస్టు మూవ్‌మెంట్‌కంటే కెమెరా మూవ్‌మెంట్‌కి ప్రాముఖ్యత చాలా ఎక్కువగా ఉంటుంది చిత్రాలలో...క్రైమ్‌లో ఛేజ్ షాట్స్ తీసేటపుడు ఆడ్ యాంగిల్స్ (అసాధారణ భంగిమలు) ఎంతో సహాయ పడుతవి. కాంట్రాస్టు (లైట్ అండ్ షేడ్స్) ఫోటోగ్రఫీ కూడా ఇందుకు ఎంతగానో తోడ్పడుతుంది. దీనికి ఉదాహరణగా జయశ్రీ లక్ష్మి పిక్చర్స్ వారి 'చెల్లెలి కోసం'లో హోటల్ రూమ్‌లో విజయలలిత డెత్‌సీనును చెప్పవచ్చును.

ఫైట్స్ తీసేటప్పుడు రెగ్యులర్ స్టడీ కెమెరా కంటే జోల్డ్ రింగ్ (ఆడటం) బాగా సహాయం చేస్తుంది. 'అసాధ్యుడు'లో హీరో కృష్ణ బోట్ హవుస్ ఫైట్—ముక్కామల యింట్లో కృష్ణను అతిథిగా తీసుకెళ్లి బంధిస్తారు. తర్వాత మూడు తలుపుల్లోంచి ముగ్గురొచ్చి 'కృష్ణ'ను ఎటాక్ చేసింతర్వాత వచ్చే ఫైట్‌ను ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఈ సీను అంతా చేతితో కెమెరాను పట్టుకుని తీశారు (ఆడారు) కెమెరామన్ స్వామి. అలాగే పడమంత్రపు సిరిలో క్లైమాక్స్‌లో హరనాథ్, రాజనాలల ఫైట్‌కూడా తీశారు. కెమెరామీద బాగా గ్రిప్ ఉన్నవాళ్ళు తప్పితే—ఈ పద్ధతిలో అంతా తీయలేరు.

## ఛేజింగ్స్

ఆర్టిస్టులతో పాటు కెమెరాకూడా వేగంగా వెళ్లటాన్ని 'ఛేజింగ్స్' అంటారు. ఇవి సాధారణంగా పతాక సన్నివేశాల్లో (క్లైమాక్స్) వస్తూ ఉంటవి. ఇందుకు 'అసాధ్యుడు' చిత్రంలోనిదే మరొక ఉదాహరణ — నర్స్‌ఛేజ్. నర్స్ సైకిలుమీద వెళ్తూండటం, రవుడీలు తరుముతూండటం — ఆ తర్వాత పడటం, లేవటం— ఇలాగే అదేచిత్రంలో; టాంగాలో కె. ఆర్. విజయ, కృష్ణ పారిపోతుంటే వెల్లాల కాంతారావు కారులో వెంబడించే దృశ్యాలు—

వ్యాసం : మోహన్‌కుమార్



తాలా ప్రొడక్షన్స్ వారి 'బంగారు సంకెళ్ళు'లో ఏ బూరు అవుట్ డోర్స్‌లో తీసిన గుమ్మడి, బాలయ్యల ఎడ్లబళ్ల పందేలను మరొక ఉదాహరణగా చెప్ప వచ్చును.

## స్టంట్స్

స్టంట్స్ తీసేటప్పుడల్లా — స్టంట్ మాస్టరు ఫైట్ కంపోజు చేసింతర్వాత అతన్ని సెట్లో రెండు మూడు సార్లు చెయ్యమని — డైరెక్టరు, కెమెరామన్ చూస్తే, బాగా చక్కగా తియ్యడానికి వీలవుతుంది. ఇదివరలో స్టడీ షాట్స్ తీసే వారు. అంటే వైడర్ ఫీల్డ్ పెట్టి కెమెరా స్టడీగా వుంచి తీసేవారు.

## స్టంట్స్‌లో లేటెస్ట్ టెక్నిక్

ఫైట్స్ తీసేటప్పుడు కెమెరా చేతితో (ఏరీ ఫ్లెక్స్) హేండిల్ చెయ్యటంవల్ల మంచి ఫలితం వస్తుంది. ఇద్దరు ఆర్టిస్టులు ఫైట్ చేస్తుంటే ఒక ఆరిస్టు ఇంకో ఆర్టిస్టుకు బదులుగా—కెమెరాతో ఫైట్ చేస్తుంటే మంచి ఎఫెక్టివ్‌గా ఉంటుంది అంటే కెమెరా లెన్స్‌లోకి చేతితో గుద్దటం, మనిషి వెనక్కి పడి పోవటం లాంటివి ... ఉదాహరణకి : వడ మంత్రపు సిరి చిత్రంలో క్లైమాక్స్ ఫైట్—హరనాథ్ డబ్బుపెట్టె తీసుకొచ్చి నపుడు, రాజనాల ఎదుర్కోవటం జరిగిన దృశ్యంలో ఈ విషయాలను చూడవచ్చును.

స్టంట్స్‌లో ఈ కొత్తవిధానం ప్రవేశ పెట్టిం తర్వాత ఆ విధానంలో తీసిన చిత్రాలను చూడటానికే ప్రేక్షకులు ఆస క్తిని కనపర్చుతున్నారు.

(ఈ వ్యాసరచనలో తోడ్పడిన ప్రసిద్ధ ఆర్టిస్టు ఛాయాగ్రాహకుడు శ్రీ వి. యస్. ఆర్. స్వామికి కృతజ్ఞతలు—

రచయిత)

వచ్చేవారం : ట్రిక్ ఫొటోగ్రఫీ.

# దీపావళి - టపాకాయ

## నటి రాజశ్రీ

దేశాన్నంతా దీపాలకాంతులతో వికసింప చేసే పర్వదినం దీపావళి. ఈ దీపావళికి ఆంధ్రపత్రిక పాఠకావళికి నా కృతజ్ఞతాంజలి. ఈరోజు మీనాల్కల్లో నామాట ప్రస్తావింపబడడం నా అదృష్టం. ఈ సంతోష సమయంలో మీకు తెలియని ఒక సంగతిని బయటపెడ్తున్నా.

నాకు అప్పుడు నాల్గో యేడు అనుకుంటా, మా యింట్లో అందరూ ఆ రోజు వేకువనే నిద్రలేచి,అభ్యంగన స్నానాలు ముగించి, నిద్రపోతున్న నన్ను తట్టి లేపారు. నాకు అసలువిషయం తెలిసిరాలేదు. నేను లేవకుండా మారాం చేశాను. మా అమ్మమ్మ నన్ను బుజ్జగించి "అదికాదే-యీరోజు త్వరగా నిద్రలేచి స్నానపనులు త్వరత్వరగా ముగించేసి టపాకాయలు కాల్చాలి నా అమ్మవుకదూ, నా బుజ్జివి కదూ" అంటూ నన్ను ఓదార్చింది. 'అమ్మమ్మా, ఏమిటె టపాకాయ అంటే' అన్నాను. అప్పుడు మా అమ్మమ్మ ఒక అట్ట గొట్టాన్ని తెచ్చియిచ్చింది. ఆ గొట్టం లాంటి దానికి ఒక తోక వుండడాన్ని చూచాను. నాకు యేంచెయ్యాలో తోచలేదు. అమ్మమ్మా యిదేమిటే, యెలా దీన్ని కాల్చేది అని బిక్కముఖం వేసాను. మా అమ్మమ్మ నన్ను దగ్గరగా తీసుకొని ఒక దీపందగ్గరికి తీసికెళ్ళింది. ఆ తోకను నిప్పుకు అంటించి దూరంగా పారేసింది. 'ఢాం' అన్న శబ్దంతో వీధంతా దద్దరిల్లింది. 'అది సరేనే, యింతవరకు బాగానేవుంది. అసలు టపాకాయను యీరోజు యెందుకు ప్రేల్చాలి' అని ప్రశ్నించాను. 'పిచ్చిదానా, యీదినం నరకాసురుడు చచ్చిన దినం. మనందరికీ శుభదినం. ఈరోజు టపాకాయను ప్రేల్చి మన మనస్సుల్లోని బాధల్ని నిట్టూర్చడమే' అంది. ఆరోజు నుండి ప్రతిదీపావళికి అందరికన్నా ముందుగా మా యింట్లో దీపావళిరోజున తప్పకుండా టపాకాయల్ని కాలుస్తున్నాను. ఆ కాలంలో నరకాసురుడ్ని చంపడానికి కృష్ణుడు అవతరించాడు. ఈకాలంలోకూడ నరకాసురుడి లాంటివాళ్ళు అసంఖ్యాకంగా వున్నారు కాని వాళ్లను వాళ్ల చర్యలను పరిమార్చే నాధుడు యింతవరకు కన్పడడంలేదు.

ఈ దీపావళినుండయినా ప్రజల్లో మంచి మనస్సు, మంచిప్రవర్తన, మంచి అలవాట్లు మొలకెత్తగలవని, ఆ శక్తిని ఆకృష్ణుడు మనకి ప్రసాదించగలడని నమ్ము తున్నాను.





# పెరిగిపోతున్న సినిమా వ్యామోహం
# తరిగిపోతున్న చిత్ర ప్రమాణం

*తక్కువ ఖర్చుతో ఎక్కువ వినోదం! అన్నప్పుడు చటుక్కున మన కళ్ళముందు వెండితెర కనిపిస్తుంది. 'సినిమా'పై జనానికి విపరీతమైన వెర్రివుంది. చిత్రం ఎలాంటిదైనా, దానిని తొలి రోజునే, తొలి ఆటకే చూడాలనే తపన అధికంగా వుంటున్నది. అక్కడ టిక్కెట్లకోసం దుమ్ములాట! దీని కారణంగా పలుచోట్ల మరణాలు కూడా సంభవిస్తున్నాయి.*

ప్రేక్షకులకి సినిమాపై ఇంతటి వ్యామోహం వుంది కనుకనే చిత్రాలతోపాటు వారి సంఖ్య నానాటికీ పెరిగిపోతున్నది. అలానే నటీనటులు, ప్రేక్షకుల 'పిచ్చి'ని కనిపెట్టి నిర్మాతలు పెరుగుతున్నారు. నిర్మాతలతోపాటు డిస్ట్రిబ్యూటర్లూ పుట్టుకొస్తున్నారు. ఇది విచిత్రం! ఇదే నిష్పత్తిలో థియేటర్లు పెరుగుతున్నాయా? నిస్సంశయంగా, లేదు!

ఒక చిత్రం విజయవంతం కావాలంటే ప్రేక్షకులు ముఖ్యం. వారికి థియేటర్లు కావాలి. థియేటరులో గాలి ఆడదనుకుంటే విసనకర్రలు పట్టుకెడుతున్నారు. కూర్చోడానికి వుండదనుకుంటే చాపలు మోసుకెళుతున్నారు. నల్లుల్ని సహిస్తున్నారు. దుర్గంధాన్ని భరిస్తున్నారు. చిత్రాలు ఎంత ప్రయోగాత్మకంగా నిర్మించబడుతున్నా, ఇలాంటి అసౌకర్యమైన థియేటర్లు ఇంకా వుంటూనే వున్నాయి. అయినా జనం ఎగబడుతూనే వున్నారు. ముక్కు మూసుకుని మూడుగంటల చిత్రాన్నీ చూసి బయటికి వస్తున్నారు రొప్పుకుంటూ. థియేటర్లు ఇంతటి హీన పరిస్థితిలో వున్నా కొన్ని చిత్రాలు విజయవంతం కాకపోవడంలేదు. ఇక్కడ ప్రేక్షకుడి ఇబ్బందుల్ని తలచుకునే నాథుడు లేడన్నమాట వాస్తవం! ఇప్పటి మన చిత్రాలు, థియేటర్లు ఒకవిధంగా ప్రేక్షకుల ఓపికను పరీక్షిస్తున్నాయని చెప్పాలి.

చక్కని థియేటరు వుంటే అందులో ఎంత చెత్త చిత్రం ఆడుతున్నా చూడాలనిపిస్తుంది. ఆ చూసిన చిత్రం బాగున్నది అనే అనుభూతి కలుగుతుంది కూడా. చిత్రానికి ఆ థియేటరు కొంత ఘనతని చేకూర్చిపెడుతుందన్న మాట! థియేటర్లు ప్రేక్షకుల కష్టసుఖాలు గమనించేవిగా వుంటే చిత్రాలు ఎందుకు విజయవంతం కావు?



అనిరుద్ధా ఆర్కెస్ట్రా వ స్మృతి పూజ మహోత్సవం సందర్భంలో తీసిన ఛాయా చిత్రం. పాడుతున్నవారు జపేశ్వర్, బెంగుళూరు లత, హార్మోనియం వాయిస్తున్నవారు అనిరుద్ధ.

## ప్రేక్షకుల చర్య

చలనచిత్ర పరిశ్రమని పోషిస్తున్నవాడు 'ప్రేక్షకుడు' అని ఎక్జిబిటరు దగ్గర నుంచి డిస్ట్రిబ్యూటరువరకు తెలుసు మరి వారు ప్రేక్షకుడికి ఎలాంటి వసతుల్ని అమర్చగల్గుతున్నారు? ప్రేక్షకుడు ఇలా బాధపడవలసిందేనా? ప్రేక్షకుడు ఓపిక పట్టినంతకాలం ఏమీ జరగదు. ఎప్పుడో ఒకప్పుడు ఆ ఓపిక నశిస్తుంది. 'మాకు థియేటర్లు సౌకర్యంగా లేకపోతే మేము సినిమాలు చూడము' అని ప్రేక్షకులు బాయ్‌కాట్ చేస్తారు. అప్పుడు థియేటర్లు తప్పక బాగుపడతాయి! అలాంటి పరిస్థితి నెందుకు రప్పించుకోవాలి?

## థియేటర్ల ఎద్దడి

'రెండేళ్ళకి ముందు చిత్రాలు చాలా తక్కువగా వచ్చేవి. థియేటరు యజమానులు 'మీ పిక్చరు మాకివ్వండంటే మాకివ్వండ'ని ముందుగానే రిజర్వు చేసుకుంటూ వుండేవారు. కాని, ఇప్పటి పరిస్థితి అదికాదు. నెలకి సరాసరి ఆరు చిత్రాలు విడుదలవుతున్నాయి. థియేటర్లకి కాంపిటీషను పెరిగింది. రెండు

వారాల్లోనే కలెక్షన్లు పడిపోతున్నాయి. ప్రేక్షకులు రానున్న చిత్రంకోసం ఎదురు చూస్తున్నారు. వెంటవెంటనే చిత్రాలు మార్చడానికి థియేటరు యజమానులు తొందర పడుతున్నారు.' అన్నారు డి. వి. యస్. అధినేత డి. వి. యస్. రాజుగారు.

## నష్టపోతున్న నిర్మాత

ఒకచిత్రం నిర్మాణ పద్ధతిని తీసుకుందాం. పూర్తి నిర్మాణానికయ్యే ఖర్చులో చాలవరకు నిర్మాత భరిస్తున్నాడు. (ఇది నిర్మాత తాహతును బట్టి వుంటుంది,) అయితే, అతనికి వచ్చే ఆదాయం ఎలా వుంటున్నదో చూద్దాం:వందరూపాయిలు 'కలెక్షన్' వుంటే—అందులో రు. 35 నుంచి 40 వరకు వినోదపు పన్ను క్రింద పోతుంది. ఎక్సిబిటరు (మొదటి విడత చిత్రానికి) రు. 40 నుంచి 50 వరకు తీసుకుంటున్నాడు. మిగతాది డిస్ట్రిబ్యూటరుకు వస్తున్నది. అందులో రు. 15 నుంచి 20 వరకు అతను కమిషన్ మినహాయించుకుంటున్నాడు. ఆదాయంలో తనవంతు పెట్టుబడివాటా పూర్తిగా ముందు తీసుకుంటున్నాడు. ఇక మిగిలిందేమిటి? నిర్మాతకి వచ్చేది ఎంత? మిగిలేది ఎంత? 'ఓవర్‌ఫ్లో' మాట దేవుడెరుగు, కనీసం పెట్టుబడి అయినా గిడుతుందా?– ఇది ఇప్పటి మన నిర్మాత దుస్థితి.

'ఒక చిత్రానికయ్యే పెట్టుబడిలో డిస్ట్రిబ్యూటరు మూడువంతులు, నిర్మాత ఒక వంతు భరిస్తున్నాడనుకుందాం. అప్పుడు ఆదాయాన్నికూడా అదే నిష్పత్తిలో ఎప్పటికప్పుడు పంచుకుంటే నిర్మాతలకి ఎక్కువ ఇబ్బంది వుండదు; డిస్ట్రిబ్యూటరుతో గొడవలుండవు'— అని జనరంజనీ ఫిలింస్ అధినేత చలపతిరావు సూచించారు.

## నిర్మాత యోగ్యతలు

ఇప్పుడు చలన చిత్రాల ప్రమాణం పడిపోయిందీ అంటే కారణాల్లో చిత్రాల సంఖ్య పెరగడం కూడా ఒకటి. రెండవది నిర్మాతల్లో నిర్మాణానికి సంబంధించిన విజ్ఞానం కొరవడడం.

సినిమా లోకమంతా డబ్బు మయమని ప్రజల భావం. తారలంటే ఎంత మోజుందో అది చెప్పనవసరం లేదు. నిర్మాతగా వస్తే డబ్బులో ఈదవచ్చుననీ, తారలతో సరసాలాడవచ్చుననే అభిప్రాయాలు వున్నాయి. ఈ 'క్రేజ్' వున్న ధనవంతులంతా నిర్మాతలై కూర్చుంటున్నారు.

నిర్మాతలు వస్తున్నారు, పోతున్నారు. ఒక చిత్ర నిర్మాణానికి పదిమంది భాగస్తులు కలుస్తున్నారు. (బయటికి తెలిసేది ఇద్దరని మాత్రమే!) వారు ఎలాగైతేనేం—ఆ చిత్రాన్ని సాయంపడుతున్నారు. విడుదల చేస్తున్నారు. వెనువెంటనే అంతా ఎవరికివారుగా విడిపోయి స్వంతంగా నిర్మాతలై పోతున్నారు! అందరూ నిర్మాణం ఆరంభిస్తున్నారు. ఇందులో ఎన్ని చిత్రాలు విడుదలవుతున్నాయి?

సగంలో దెబ్బతిన్న ఈ నిర్మాతలు కష్టనష్టాలతో తమ తమ వృత్తుల్లోకి మళ్ళిపోతున్నారు. లేదా, 'అబద్ధపు నిర్మాతలు'గా మిగిలిపోతున్నారు.

## మేమంతా ఏం కావాలి?

ఆదినుంచివున్న నిర్మాతలున్నారు. వారికి చిత్రనిర్మాణమేవృత్తి. వృత్తి వేరుగా ఉండి చిత్ర నిర్మాణాన్ని సాగిస్తున్నారు కొత్త నిర్మాతలు. అప్పుడు పాతవారు పక్కకి నెట్టివేయబడుతున్నారు. ఎంతోకాలంగా పరిశ్రమ అభివృద్ధికోసం శ్రమపడిన ఈ నిర్మాతలంతా తెరమరుగుకు వెళ్ళిపోవలసిందేనా? ఇన్నాళ్ళ 'చలనచిత్ర నిర్మాణమే మా జీవితం' అని నమ్ముకున్న ఈనిర్మాతలు ఏం కావాలి? సరిగ్గా ఇదే ప్రశ్న వేశారు ఆరు చిత్రాలునిర్మించి పరిశ్రమలో నిలబడిన డి. వి. యస్. రాజుగారు.

అవును. ఇది చాలా పెద్ద సమస్య. సినిమాలపై వున్న మోజు డబ్బున్న వాళ్ళనందర్నీ నిర్మాతలని చేస్తున్నది. ఈ నిర్మాతల్ని అదుపులో పెట్టడం సాధ్యమా, దీని గురించిన 'సెల్ఫ్ రెగ్యులేషన్' అమలు పరచడం వీలవుతుందా? — ఈ ప్రశ్నలకి సమాధానాలు దొరికినప్పుడు చిత్రాల ప్రమాణం కూడా పెరగడం ఖాయం. (ఈ విషయంలో శ్రీ యన్. టి. రామారావు ధోరణి వేరుగా వున్నది.)

## డిస్ట్రిబ్యూటరు అంటే ఎవరు?

చిత్ర నిర్మాణం సక్రమ పద్ధతిలో జరగాలంటే అది చాల వరకు డిస్ట్రిబ్యూటర్ల చేతిలో వుంది. వీరు ఎక్కువ మంది నిర్మాతల్ని ప్రోత్సహించకూడదు. నిర్మాతల్లో యోగ్యతని కనిపెట్టి ప్రోత్సహించడం ముఖ్యం.

డిస్ట్రిబ్యూటరు అంటే ఎవరు? వడ్డీ వ్యాపారస్థుడా? ఇప్పుడు కొనసాగుతున్న వ్యాపారాన్ని బట్టి —డిస్ట్రిబ్యూటరు ఇదే అర్థంలో చలామణీ అవుతున్నారు. ఇలా వున్నందువల్లనే డిస్ట్రిబ్యూటరుకు నిర్మాతకి మధ్య పేచీలు వస్తున్నవి. ఒక చిత్రంలో కలిసి పనిచేసి రెండవ చిత్రంలో విడిపోతున్నారు. చలన చిత్ర రంగంలో అనుభవంవుండి, అతని ఆస్తిలో కొన్ని థియేటర్లు తప్పకుండా వుండివుంటేనే అతను సిసలైన డిస్ట్రిబ్యూటరు అవుతాడని ప్రముఖుల అభిప్రాయం.

డిస్ట్రిబ్యూటరు చేతిలో థియేటర్లు వున్నప్పుడు—వేరుగా 'ఎగ్జిబిటర్లు తెచ్చిపెట్టే గొడవ'వుండదు. అది—డిస్ట్రిబ్యూటరుకి నిర్మాతకీకూడా లాభసాటిగావుంటుందని శ్రీరాజు అన్నారు.

## కొత్త కేంద్రాల నిర్మాణం

చిత్రం విజయవంతంకావాలంటే ఎక్కువ థియేటర్లుకావాలని, ఇప్పుడున్న కేంద్రాలని అభివృద్ధిచేయడంకంటె—కొత్త కేంద్రాలని సృష్టించడం ఉత్తమమైనపద్ధతి అని ఆయన సూచించారు.

'ఫిల్మ్ కవున్సిల్'గురించి కొంత ఆందోళన సాగుతున్నది. 'ఫిల్మ్ కవున్సిల్' నిర్మాణం పరిశ్రమ అభివృద్ధికి చాలా దోహదం చేస్తుంది. లైసెన్సింగ్ పద్ధతి వున్నా నిర్మాతలతోపాటు చిత్రాలూ బాగు పడతాయి. ఆచరణలో కొన్ని సాధకబాధకాలు ఎదురవుతాయి. ఈ కృషి జయప్రదమైన నాడు చిత్రరంగం అభివృద్ధి చెందకపోదు.

బొంబాయిలోను కలకత్తాలోను జరిగిన తీవ్రమైన ఆందోళనలాంటి ఆందోళనని మనం కూడా రుచిచూడకుండా ముందుగా జాగ్రత్తపడడం అన్నివిధాలా శ్రేయస్కరం!

— సి. కనకాంబరరాజు

# సినిమా

విర్భాలోచనా పరుడై నడచిపోతున్నాడు రామకృష్ణ. ఇదేమిటండీ పరధ్యానంగా పోతున్నారే ? ఎక్కడికి ? అని ప్రశ్నించాను. 'ఇక్కడికి అల్లంతదూరాన గంధర్వ గుడి యేదో వుందట. వెళ్ళి చూచివద్దామని బయల్దేరాను.' 'గంధర్వగుడా? నాకు తెలియదే. మీకు యెవరుచెప్పారు?' అని అడిగాను. 'పేదరాశిపెద్దమ్మ చెప్పింది' అన్నాడు. 'అయితే నేను వస్తా పదండి' అని రామకృష్ణను వెంబడించాను. కొంత నడక సాగించామో లేదో గుడి కన్పడింది. నాకు భయం వేస్తోంది; మీరు వెళ్ళండి అని రామకృష్ణను లోనికి పంపించాను. నేను బయట నిలబడి పొంచిచూచాను. నాకళ్ళను నేనే నమ్మలేక పోయాను. గుడిలో దేవి విగ్రహం. విగ్రహానికిముందు తళతళమెరిసే బంగరు వీణ సాక్షాత్కరించాయి. రామకృష్ణకు ఆ వీణను మీటాలనిపించింది. అంతలోనే ఒకస్త్రీ ఆర్తనాదం వినవచ్చింది. రామకృష్ణ నాలుగు పక్కలా కలయ చూసాడు. ఎవ్వరూ కన్పడలేదు. ఇదంతా నిజంగా జరిగిందనుకునేరు సుమా! ఇలాంటి సన్నివేశం పి. ఎస్.ఆర్. పిక్చర్స్ నిర్మిస్తున్న 'పేదరాశి పెద్దమ్మ' చిత్రంలో చూడగలరు. అక్కడ గంధర్వుల గుడి ఎలా వచ్చింది? బంగరు వీణ యెలా వచ్చింది? ఆర్తనాదం యెవరిది? ఈ ప్రశ్నలకు సమాధానం 'పేదరాశి పెద్దమ్మ' చిత్రంచూస్తే మీకుతెలుస్తుంది. ఈ చిత్రానికి చిల్లర భావనారాయణ చిక్కటి సంభాషణలను వ్రాసారు. చిక్కటి సంభాషణలను ఆయన వ్రాస్తే చిక్కటి సంగీతాన్ని కోదండపాణి విన్పిస్తున్నారు. ఆంధ్ర ప్రేక్షకులకు ఒక వినూత్నమయిన కథను తెరకెక్కించే పింజల సుబ్బారావు అనేక వ్యయ ప్రయాసలకోర్చి నవరస భరితంగా నిర్మిస్తున్నారు. అన్ని తరగతుల ప్రేక్షకులకు నచ్చే విధంగా ప్రతి సన్నివేశాన్ని గిడుతూరి సూర్యం చక్కటి కోణాల్లో చిత్రీకరిస్తున్నారు. దర్శకుడు కోరేవిధంగా వేణు తన కెమెరాను పరిపిస్తూ, కన్నుల పండువయిన దృశ్యాలను మీముందు పెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. భారీయెత్తున నిర్మింపబడుతున్న యీ జానపద చిత్రంలో కృష్ణకుమారి, కాంతారావు నాయకీ నాయకులుగా నటిస్తున్నారు. ముఖ్య పాత్రలను రామకృష్ణ, ప్రభాకరరెడ్డి, విజయలలిత, రాజసులోచన, మిక్కిలినేని, బాలకృష్ణ, జయకృష్ణ, బలిరెడ్డి సుబ్బారావు ధరిస్తున్నారు.

* * *

సాంఘిక చిత్ర కథనంలో కొత్తదనం, నాగేశ్వరరావు గెటప్ లో నూతనత్వం, జగ్గయ్య ఆహార్యంలో వింత స్వరూపం, పాటల్లో లాలిత్యం, రంగారావు రూపంలో వ్యత్యాసం, జమున నటనలో నాట్యాత్మ, కాంచనకు ఒక కొత్తరకం వేషం మాధవి పిక్చర్స్ నిర్మిస్తున్న 'బందిపోటు దొంగలు' చిత్రంలోని ప్రత్యేక అంశాలు. పెండ్యాల నాగేశ్వరరావు విన్పించిన అన్ని పాటలు విన్న వాళ్ళను అలరిస్తున్నాయి. చిత్రం విడుదలై మీ ముందువుంటే అందులోని పాటలను మీరు వింటే నా అభిప్రాయంతో మీరూ యేకీభవిస్తారనుకుంటా. పెద్దయెత్తున, పేరు మోసిన తారాగణంతో ఖర్చుకు వెనుకాడక 'బందిపోటు దొంగలు' చిత్రాన్ని కె. ఎస్. ప్రకాశరావు సర్వజన రంజకంగా చిత్రీకరిస్తున్నారు. ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు సమర్పించే యీ చిత్రానికి సుబ్బారావు, రాజేంద్రప్రసాద్ నిర్మాతలు. ఈ చిత్రంలో శ్రీ శ్రీ వ్రాసిన తొమ్మిది నిమిషాలపాట మీ హృదయాల్లో తొమ్మిది వత్సరాలవరకు వుండే విధంగా పెండ్యాల స్వరకల్పన చెయ్యగా, ఘంటసాల, సుశీల, రాఘవులు అండ్ బృందం బ్రహ్మానందంగా పాడారు.

* * *



'పేదరాశిపెద్దమ్మ'లో విజయలలిత, రామకృష్ణ.



'ప్రార్థనా ఫిలింస్'లో విజయలలిత.

జయంతికి తోడుగా వుండేందుకు విజయలలిత ఒప్పుకుంది మిక్కిలినేని విజయలలితకు సకల సౌకర్యాలను కల్గించాల్సిందిగా తన సేవకులను ఆజ్ఞాపిస్తాడు. సత్యనారాయణ విజయలలిత అందాన్నిచూచి మత్తెక్కాడు ఆమెను పొందాలనుకున్నాడు; కీచకుడు అవలంబించిన పద్ధతిని చేపట్టాడు; తన అక్కయ్య సుధేష్ణతో చెప్పి ద్రౌపదిని రప్పించుకున్నట్టు, సత్యనారాయణ జయంతితో చెప్పి విజయలలితను తన యింటికి రప్పించు కుంటాడు. సత్యనారాయణ దగ్గరకు వచ్చిన విజయలలిత యేమంటుంది? అనుకున్నప్రకారం విజయలలితను పొందగలాడా? లేక ఆమెచేత తిరస్కరింప బడ్డాడా? ఈ ప్రశ్నకు సమాధానం గౌరి ప్రొడక్షన్స్ 'దేవుడిచ్చిన భర్త' వస్తే తెలుస్తుంది స్త్రీకి మాంగల్యమే జీవితరక్ష అని ప్రబోధించే వుత్తమ సందేశాన్ని కథగా యెన్నుకున్న భావనారాయణను అభినందించి తీరాలి. ప్రపంచంలో యేది జరిగినా విధి ననుసరించి జరుగుతుందేగాని, యే ఒక్కడి యిష్టాయిష్టాల ప్రకారం కాదని నిరూపించే చిత్రం 'దేవుడు యిచ్చినభర్త' పాలగుమ్మి పద్మరాజు రచన, దర్శకత్వం నెరపుతున్న యీ చిత్రానికి సత్యం సంగీత దర్శకుడు. ఈ చిత్రం

# సినిమా

లోని ప్రధానపాత్రల్లో కాంతారావు, రాజశ్రీ, జయంతి, రాజబాబు, సత్యనారాయణ, మిక్కిలినేని, ఎ. వి. సుబ్బారావు కాశీనాథ్‌తాతా కన్పడతారు. ఈ చిత్రం పూర్ణాపిక్చర్స్‌ద్వారా విశాలాంధ్రలో విడుదలౌతుంది.

* * *

భూసారం వెంకటేశ్వరరావు గారడీ చేస్తున్నాడని తెలిసి వెళ్ళాను. నేను వెళ్ళిన సమయానికి ఒకబుట్టనుండి ఒక అందాల చిన్నదాన్ని రప్పించాడు. రప్పించడమేగాక ఆమెచే డ్యాన్సు చేయిస్తాడు. ఇంతకీ ఆ పిల్ల యెవరనుకున్నారు? నాట్యతార జ్యోతిలక్ష్మియే. ఆమె ఏం పాడిందనుకున్నారు? 'మావో...ఓమావో' అని పాడింది. శ్రీశ్రీ వ్రాసిన యీ గమ్మత్తయిన పాటను ఎల్. ఆర్. ఈశ్వరి మత్తుగొలిపే విధంగా పాడింది. ఈ సంఘటన యెందులోదో తెలుసా? హృషికేష్ పిక్చర్స్ నిర్మిస్తున్న 'అందంకోసం పందెం' చిత్రంలోది. ఆమంచర్ల శేషగిరిరావు దర్శకత్వం వహించే యీ చిత్రంలో కాంచన, కాంతారావు నాయకీ నాయకులు. ఈ జానపద చిత్రాన్ని ఆంధ్రాలో అపరాజిత, నైజాంలో దివ్యదత్తా, మైసూరులో నటేష్‌సినీ ఎక్స్ఛేంజి విడుదల చేస్తున్నారు.

* * *

ఇప్పుడిప్పుడే వృద్ధిలోకి వస్తున్న నేపథ్యగాయకుడు బసవేశ్వర్. చక్కటి కంఠంవుంది; వినడానికి కమ్మగావుంటుంది; సంగీతంలో మంచి ప్రవేశంవుంది; దానికితగ్గ సాధన వుంది; కాని చిత్రాతి చిత్రమైన యీ సినిమారంగంలో యెప్పుడు యెవరు యెలా రాణిస్తారో వూహించడం అసాధ్యం ఏది యేమయినప్పటికీ, యిప్పుడు బసవేశ్వర్‌కు కాస్తమార్కెట్టు తగిలినట్టుంది. ఈ మధ్యన వాహినీపిక్చర్స్ 'బంగారు పంజరం' చిత్రంలో రాజేశ్వరరావు వద్ద

'చుక్క మెరిసెను, మొక్క పెరిగెను
కుక్క మొరిగెను బౌబౌబౌ
చీమ కరుచును, దోమకొరుకును
ప్రేమ కరచును లాలాలా'

అనెడి పాటను విభిన్నరాగాల్లో వైవిధ్యమైన సంగీతపు సంగతులతో పాడారు. తోడుగా స్వర్ణలతకూడ తన మధుర కంఠాన్ని జతపర్చింది. ఈ పాటను శ్రీశ్రీ వ్రాసారు! చిత్రంలో ప్రసాద్, గీతాంజలిపై చిత్రీకరించబడింది.

అక్టోబరు 7 వ తేదీన 'నా జీవితపు నవమాధురివి, ఇలనీవే కదా' అన్న పాటను కె. రాణితో కలసి గ్రామ్‌ఫోను కంపెనీకిగాను పాడారు. నిత్యానంద్ సంగీతం సమకూర్చిన యీ పాటకు రచన రత్నగిరి చేసారు. 'ఎందుకు మేడమ్ నాపై కోపం' అనెడి హుషారయిన పాటనుకూడ రికార్డు చేసారు హెచ్. ఎం. వి. గ్రామఫోను కంపెనీవాళ్ళు ఏరకంపాటయినా సమర్థనీయంగా పాడగలడని యీ పాటను వింటే తెలుస్తుంది. మీరు వినబోతున్నారుగా. విన్న తర్వాత మీరే తీర్పు చెప్పండి.

* * *

ఇంతవరకూ విజయలలిత ధరించిన పాత్రలన్నీ ఒక ఎత్తు; సురేష్ పిక్చర్స్‌లో యిప్పుడు నటించేపాత్ర ఒక ఎత్తు. విజయలలితపేరు వినగానే రెండు నృత్యాలు వుంటాయి, వ్యాంప్‌గా వస్తుంది అని నిర్ణయించే ప్రేక్షకులకు యీ చిత్రం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈ చిత్రంలో విజయలలిత మీ అందరి సానుభూతిని పొందే త్యాగమయి వేషాన్ని ధరిస్తుంది. ఈ పాత్రను అపూర్వంగా సృష్టించాడు కథకుడు శ్రీనివాసన్; పాత్ర మన హృదయాల్లో చొచ్చుకుపోయేట్టు జూనియర్ సముద్రాల సంభాషణలు సాగాయి. విఠ్ఠల్ దర్శకత్వంలో తయారయ్యే యీ జానపద చిత్రాన్ని రామానాయుడు నిర్మిస్తున్నారు. నవయుగ ద్వారా విడుదలయ్యే యీ చిత్రంలో విజయనిర్మల, కాంతారావు



'దేవుడుఇచ్చినవక్షత్రం'లో జయంతి, కాంతారావు, రాజశ్రీ.

పరిచయం:



సహకార దర్శకుడు

## గోపాలకృష్ణ

కళాశాల నాటిక, నాటకాల్లో పాల్గొన్న శ్రీ గోపాలకృష్ణకు బి. ఎస్. సి, డిగ్రీ పొందగానే సినిమా రంగాన్ని ప్రవేశించాలనిపించింది.

రాగానే ప్రముఖ దర్శకుడు శ్రీ తాపీచాణక్యకు సహాయకుడిగా పనిచేసే అదృష్టం "వాత్సల్యం" చిత్రంలో లభించింది. ఆ తర్వాత ప్రఖ్యాత నిర్దేశకుడు శ్రీ వి. మధుసూధనరావుకు సహాయకుడిగా అనేకానేక విజయవంతమయిన చిత్రాలకు పనిచేసి దర్శకత్వ శాఖలోని లోతుపాతులను క్షుణ్ణంగా అర్థం చేసుకోగలిగాడు.

ఇప్పుడు శ్రీ కమలాకర కామేశ్వరరావువద్ద "కలిసిన మనసులు" చిత్రానికి పనిచేసాడు. సెట్సు మీద టెక్నీషియన్లతోనయితేనేమి, నటీనటులతోనయితేనేమి కలుపుగోలు తనంగా వుంటూ వారివద్ద మాక్సిమమ్ పనిని రాబట్టుకోగలిగాడు.

ప్రముఖ దర్శకులకు అసోసియేట్‌గా వుండడంవల్ల, గోపాలకృష్ణ త్వరితగలిగిన ఆ శాఖలో పట్టభద్రుడు కాగలడు అవకాశం, అదృష్టం కలిసివస్తె తప్పక అభివృద్ధిలోకి రాగలడు అని వూహించవచ్చు.

# సినిషా

నాయకీ నాయకులు. ముఖ్య భూమికల్లో ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, రాజబాబు, సంధ్యారాణి, రమాప్రభ, ధూళిపాళ కన్పిస్తారు. వేణు సంగీతాన్ని, వెంకటరత్నం ఛాయాగ్రహణాన్ని, మార్తాండ్ కూర్పును, కె. ఎస్. రెడ్డి నృత్యాన్ని నిర్వహిస్తున్నారు.

* * *

'పావకోసం' 'కుళందైక్కాగ' అయింది. తమిళదేశంలో విజయఢంకా మ్రోగించింది. ఇప్పుడు ఉత్తరదేశాన్ని వుర్రూత లూగించాలనే వుద్దేశ్యంతో నాగిరెడ్డి హిందీలో నిర్మిస్తున్నారు. తాతినేని ప్రకాశరావు డైరెక్టుచేసే యీ చిత్రంలో పద్మిని, బేబిరాణి, ప్రాణ్, అజిత్, ముక్రి, ప్రభాకరరెడ్డి ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు. చిత్రంయొక్క షూటింగు అక్టోబరు 23 నుండి వాహినిలో ప్రారంభమవుతుంది.

* * *

డ్రైవర్‌గా వచ్చి, మేకప్ నిపుణుడిగా రూపొంది యిప్పుడు నిర్మాత అయ్యాడు వీరాజా. మొదటిచిత్రం 'రాజయోగం' వీరాజకు యోగాన్ని తెచ్చిపెట్టింది. దోనెపూడి కృష్ణమూర్తి అండదండలు వీరాజా ప్రగతికి ముఖ్యకారణం. ఇప్పుడు రెండవ చిత్రాన్ని ప్రారంభిస్తున్నారు. వీటూరి రచన సాగించిన యీ చిత్రంలో వాణిశ్రీ, కాంతారావు, రాజనాల, సత్యనారాయణ, మీనాకుమారి, ధూళిపాళ ముఖ్యపాత్రలను పోషిస్తారు. ఈ చిత్రానికి కూడ 'రాజయోగం' టెక్నికల్‌యూనిట్ పనిచేస్తుంది. ఎ. వి. ఎం. లో షూటింగు జరుగనున్న యీ చిత్రానికి సుబ్బరామదాస్ దర్శకుడు.



'నేనే మొనగాణ్ణి'లో షీలా, రామారావు.

* * *

హీరో కృష్ణ వస్తున్నాడన్న వార్త వింది కె. ఆర్. విజయ; ఆనందం వుప్పొంగింది; వుక్కిరి బిక్కిరయిన విజయ పాట పాడ ప్రారంభించింది. ఆమె ఏం పాడింది? యెందుకు పాడింది? యెవరు వ్రాసారు పాటను? పాడిందెవరు? ఏం చిత్రంలోది అని మీకు చెప్పాలిగా.

'ఆనందం నాలో పొంగేను
అనురాగం పొరలై పొరలేను
నే నీలో సగమై నిలిచేను
నా నోములు నేడే పండేను'

కృష్ణను గాఢంగా ప్రేమించింది విజయ; విరహంలో వున్న విజయకు కృష్ణ వస్తున్నాడన్న శుభవార్త అందింది; వుండబట్టలేక పాడేసింది; ఈ పాటను దాశరథి వ్రాసారు సుశీల కమ్మగా పాడింది. ఈ పాట శ్రీదేవి కంబైన్స్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలోనిది. హిందీలో 'వక్త్'గా వచ్చి ప్రేక్షకుల్ని గిలిగింతలు పెట్టిన కథను తోట సుబ్బారావు తెలుగులో తీస్తున్నారు. 'చుట్టరికాలు'తో దర్శకుడిగా పరిచయమయిన పి. కే. టి. శివరాం యీ చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నారు. అసలు సంగతి మరిచా. ఈ పాటకు స్వరకల్పన చేసిందెవరనుకున్నారు? మరెవ్వరో కాదు. గత రెండు దశాబ్దాలుగా తన కోమల కంఠంతో మనల్ని ఆనంద పరుస్తున్న ఘంటసాలే యీ పాటకు స్వరం చేసారు. పినిశెట్టి సంభాషణలను వ్రాసారు. షూటింగు కార్యక్రమం అక్టోబరు 23 నుండి వీనస్ స్టుడియోలో ప్రారంభమవుతుంది. మొదటి షెడ్యూలులో గుమ్మడి, పండరీబాయిలు పాల్గొంటారు. పి.కే.టి.కి సహాయకులుగా దయాసాగర్, బాల సుబీరాశ్ దర్శకత్వ శాఖలో పని



'చెల్లెలికోసం'లో చంద్రకళ.

చేస్తున్నారు. ఈ చిత్రాన్ని మహా శివరాత్రికి మీ ముందు పెట్టాలని నిర్మాత తోట సుబ్బారావు అభిప్రాయపడుతున్నారు. ఈ చిత్రం కాగానే రామారావుతో పేకేటి దర్శకత్వంలో మరొక సాంఘికం మొదలెడ్తారట.

* * *

ధైర్యసాహసాలకు డి. ఎల్. పెట్టింది పేరు; ఆయన యేం చేసినా అందులో న్యాయం, ధర్మం వుంటుంది. అపకారం, అన్యాయం అన్న పదాలకు యింతవరకు అర్థం తెలియని మంచి వ్యక్తి డి. ఎల్; అందుకే ఆయనకు అందరూ కలిసివస్తారు; సమయానికి ఆదుకుంటారు. ఇప్పుడు ఆయన చేపట్టిన కార్యం అనితరసాధ్యమయినది. ఏమిటాకార్యం అని మీరు అడుగుతారుగా. మరేం లేదు. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ మనోజ్ఞంగా వ్రాసిన 'ఏకవీర' ను తెరకెక్కించడమే. అంతే కాదు; యింతవరకు తన పాటలతో మనల్ని అలరిస్తున్న నారాయణరెడ్డిచే సంభాషణలు వ్రాయించడం మరొక విశేషం; కవి వ్రాసిన పాత్రల కనుగుణ్యంగా నటీనటులను యెన్నుకోడం మరొకవిశేషం; అన్నిటికన్నా మిన్నగా ఆయన చేసిన కార్యం ఒకటుంది. ఏమిటో మీకు తెలుసా? విద్యాధికుడు, అనుభవజ్ఞుడు అయిన సి. ఎస్. రావ్ ను దర్శకుడిగా నియమించడమే. ఇలాంటి కళాఖండానికి సంగీతం ప్రాణం. అందుకే కె. వి. మహదేవన్‌ను సంగీతసారథిగా తీసుకున్నాడు.

'ఏకవీర' చిత్రం శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు వ్రాసిన మధురమయిన పాట రికార్డింగుతో ప్రారంభమైంది. ఆ మహాకవి వ్రాసిన పాటయొక్క పల్లవిని మీకు విన్పిస్తాను.

'ప్రతిరాత్రి వసంతరాత్రి
ప్రతిగాలి పైరుగాలి
బ్రతుకంతా ప్రతినిమిషం
పాటలాగే సాగాలి!'

ఈ పాటను బాలసుబ్రహ్మణ్యం, ఘంటసాల తమ గానసుధామాధుర్యంతో మిమ్మల్ని చక్కిలిగింతలుపెట్టేలా పాడారు. అక్టోబరు 11 న జరిగిన పూజకు చిత్రపరిశ్రమకు చెందిన ప్రముఖ నిర్మాతలు, దర్శకులు, నటీనటులు, సాంకేతికులు వచ్చి డి. ఎల్. తలపెట్టిన యజ్ఞం నిర్విఘ్నంగా సాగాలని దీవించారు.

— శ్రీనివాస్

ఆటలు

# అమెరికాలో అవకాశాలు



ఆర్. కృష్ణన్ భారతదేశం తరపున మొట్టమొదటిసారిగా 1952 లో ఆడాడు. అప్పటికి అతను ఈదేశం ఆటగాళ్లందరిలో మా చిన్నవాడు. నాటికీ, నేటికీ భారత టెన్నిస్ క్రీడాకారులలో ప్రథముడు. ఇటీవల మళ్లీ తన దేశానికి మంచిపేరు తీసుకువచ్చాడు. పశ్చిమజర్మనీ నెం. 2 ఆటగాడయిన ఇంగో బుడింగ్‌ని సెమీఫైనల్స్‌లో ఓడించాడు. ఈ పోటీ మూనిక్‌లో జరిగింది. డేవిస్‌కప్ పోటీలో భారతదేశం సెమీఫయినల్స్‌కి రావటం ఇది ఏడవసారి. డేవిస్‌కప్‌లో తూర్పుజోన్ ఏర్పరచినప్పటి నుంచీ భారతదేశం టెన్నిస్‌లో ఏలుతూ వస్తోంది. ఫిలిప్పయిన్స్‌తో ఒకసారి మాత్రమే ఓడిపోయింది. జపాన్‌ని ఏడుసార్లు ఓడగొట్టింది.

1966 లో భారతదేశం పశ్చిమజర్మనీని ఢిల్లీలో, బ్రెజిల్‌ని కలకత్తాలో జయించి మొదటిసారిగా 'చాలెంజి రవుండు'ని ఆస్ట్రేలియాకెదురుగా ఆడింది. ఆస్ట్రేలియా ప్రపంచంలో కెల్లా మంచి టెన్నిస్ ఆటగాళ్లు కల దేశం. ఈ ఏడు మాత్రం ఆదేశం ఆటగాళ్ళు చాలామంది వృత్తి క్రీడాకారులు కావటంతో డేవిస్‌కప్ జట్టు అంత బలమయినదిగా లేదు. 1966 లో భారతదేశాన్ని ఆస్ట్రేలియా 4—1 చొప్పున ఓడించింది. గెలిచిన ఒక్క ఆటా డబుల్స్ ఆట. కృష్ణన్, ముఖర్జీలు న్యూకోంబ్, రోష్ లని జయించారు. ఈ ఆస్ట్రేలియా ఆటగాళ్ళు, ఇద్దరూ అంతక్రితం వింబుల్డన్ పోటీలో డబుల్స్ చాంపియన్‌షిప్‌లు గెలిచారు. మిగతా అయిదు ఇంటర్ జోన్ ఫయినల్స్‌లో భారతదేశం అ. సం. రా., స్పెయిన్, మెక్సికో, ఆస్ట్రేలియాలతో ఓడిపోయింది. అయినా కృష్ణన్ మాత్రం చాలా బాగా ఆడాడు.

ఈసారి పశ్చిమజర్మనీతో భారతదేశం ఆడినప్పుడు లాల్ (మూనిక్ మట్టి కోర్టుల మీద) బుడింగ్‌ని ఓడగొట్టాడు. భారత బృందం సరిగా ప్రాక్టీసు చెయ్యలేదని నేను భయపడ్డాను. కాని, లాల్‌కి ఇలా హఠాత్తుగా బాగా ఆడెయ్యటం అలవాటు! కృష్ణన్ బుంగర్ట్‌తో ఆడి ఓడిపోయాడు. ఇతను ప. జర్మనీ నెం 1. డబుల్స్‌లో భారతదేశానిదే గెలుపు. తిరిగి సింగిల్స్‌లో బుంగర్ట్ లాల్‌ని ఓడించాడు. కృష్ణన్‌తో నాలుగు సెట్లు ఆడాడు. లాల్‌తో అయిదు ఆడాడు. లాల్ మొదటి రెండు సెట్లు గెలిచి తర్వాత మూడూ వదులుకున్నాడు. మొత్తంమీద పశ్చిమజర్మనీ భారతదేశాన్ని 3—2 చొప్పున జయించింది.

ఇక మన జట్టు అమెరికాకి వెళ్లి అక్కడ ఫయినల్స్ ఆడిన తర్వాతనే ఆస్ట్రేలియాతో పోటీ చెయ్యగలదు.

మొన్న జర్మనీ నుంచి తిరిగివచ్చిన తర్వాత కృష్ణన్ నాతో అన్నాడు: ఇది చాలా పెద్దపని. అమెరికన్ నీగ్రో ఆటగాడు ఏష్ (అమెరికా నెం. 1) మంచి ఫారమ్‌లో ఉన్నాడు. అతని తోటి వాళ్లు కూడా బాగా ఆడుతున్నారు. అయినా తనూ, ఇతర భారతదేశపు ఆటగాళ్లూ మంచి దృఢనిశ్చయంతో ఉన్నారు.

పోటీలు నవంబరు రెండవవారం జరుగుతాయి. మన వారందరూ బాగా ప్రాక్టీసు చేసి కొంచెం ముందే అమెరికా చేరుకుంటే అక్కడివాతావరణానికి అలవాటు పడగలరు. ఇక చూద్దాము! — కె. ఎస్. నరసింహన్

# పుస్తకాలు

## జన్యుశాస్త్రము

రచన —జమ్మి కోనేటిరావు, శాస్త్ర విజ్ఞానము, చరిత్ర, తెలుగు, ఉర్దూ అకాడమి, హైదరాబాదు. 370 పేజీలు. వెల రు. 4-50.

కంటికి కనుపించే ప్రతి వస్తువునూ చూసి, ఆనందించే దశ దాటి, ఆ వస్తువును గురించిన విశేషాలు క్షుణ్ణంగా పరీక్షించి తెలుసుకోవాలనే కోర్కె మానవునికి పుట్టిననాడే సైన్సు (తదితర విజ్ఞాన శాస్త్రములు కూడా) ఉద్భవించి, ఆ కోర్కెలతో పాటు ఎదుగుతూనే వుంది.

జీవశాస్త్రంలో అతి ముఖ్యమయిన విభాగమే యీ జన్యు శాస్త్రము లేక—జనిటిక్స్. జీవులు అనేక జాతులకు చెందుతాయి. ఇవి వృక్షజాతికి చెందినా చెందవచ్చు, లేక జంతుజాతికి చెందినా చెందవచ్చు. మానవులంతా ఒకజాతికి చెందినా వారిలో కొన్ని నిశ్చయమైన మార్పులు వున్నాయి (పొట్టి, పొడుగు, లావు, సన్నం, ఎగుపు, నలుపు వంటివి.) ఇదేవిధంగా ఒకే కుటుంబంలో చెందిన వారిలో కొన్ని సామాన్య లక్షణాలు వుంటాయి. పిల్లలకు తలిదండ్రుల, మేనత్త మేనమామల, తాత ముత్తాతల పోలికలు, గుణాలు వస్తుంటాయి. ఇవి ఎందుకు సంభవించుతాయి. అనే విషయం సామాన్యులకు కొరుకు పడదు. ఒకే రక్తం పంచుకుని పుట్టారంటారంతే. అయితే తెలివైనవానికి తెలివైన వాడే పుడతాడా! నల్లటి వారికి తెల్లనివారు తెల్లనివారికి నల్లనివారు ఎందుకు పుట్టాలి? వంశపారంపర్యానికి, ప్రకృతి శక్తులకు జీవిపై గల ప్రభావం ఎంత? అసలే శక్తికి జీవిమీద ఎక్కువ ప్రభావం వుంటుంది. అన్న విషయాలు యీ జన్యుశాస్త్రం చర్చిస్తుంది.

పునరోత్పత్తి జరిగేటపుడు ప్రతిజీవీ తన వంటి జీవులనే ఉత్పత్తి చేస్తుంది గానీ, వేరే జీవులను ఉత్పత్తి చేయలేదు. పోలికలు రావడానికి యిది కొంత వరకూ కారణం. సంతానం అసలు తలిదండ్రులనుంచి వుద్భవించకుండా, ఏ నిర్జీవ పదార్థం నుంచయినా ఉద్భవించగలదా అనే విషయం మీద ఈ 20 వ శతాబ్దంలో ఘర్షణలు పడ్డారు. వానపాముా, కప్ప, కొన్ని పురుగులవంటివి నీరులో బురదలో, మన్నులో పుట్టాయని నమ్మేవారు. జీవపదార్థం నిర్జీవ పదార్థానికి పుడుతుందనుకోడం హాస్యాస్పదమనీ, జడ పదార్థం లోంచి జీవి పుట్టదనీ లూయీపాశ్చర్ అన్నాడు.

వైజమాన్ అనే ఆయన జర్మ్‌ప్లాజమ్ అనే సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టి ఎలుకల మీద కొన్ని ప్రయోగాలు చేశాడు. కొన్ని ఎలుకల తోకలు కత్తిరించి వాటి మధ్య సంయోగం కలిగించి చూశాడు. కొత్తగా పుట్టిన ఎలుకలకు నిశ్చయంగా తోకలున్నాయి. ఈవిధంగా 22 తరాల వరకూ 1592 ఎలుకలను చూశాడు. అనాటికి తోకవుంది. జీవియొక్క పునరుత్పత్తికి జీవపదార్థం (ప్రొటోప్లాజమ్) అవసరము. ఈ జీవపదార్థం రెండు రకాలుగా వుంటుంది. ఒకటి సెమటోప్లాజమ్. ఇది జీవితో ప్రతీ అవయవంలో లోనూ వుండి ఆ జీవికి వివిధ వ్యాపారాలూ చేసుకోడానికి వుపయోగపడుతుంది. ఇది ఆ తరంలోనే జీవితో నశిస్తుంది. రెండోది జర్మ్‌ప్లాజమ్. ఇది జీవియొక్క పునరూత్పత్తి అవయవాల్లో మాత్రం వుండి, జాతి అభివృద్ధికి ఉపయోగపడుతుంది. ఇది తరతరాలు వ్యాపిస్తుంది.

ఈశాస్త్రం ఓ రెండు దశాబ్దాలలో పొందే అభివృద్ధిని బట్టి అంచనా ప్రకారం ఈ నాడు జాతకాలు చూసి పెళ్ళిళ్లు చేసినట్టే ఇకనుంచీ క్రొమోజోముల పటాలను చూసి పెళ్ళిళ్లు స్థిర పరచుకోవచ్చు. అలా అయితే తనకనువైన సంతానం లభిస్తుందట.

మానవుని పుట్టించిన దేముడెంత మేధావో (సైన్సు యీ థియరీని వప్పదేమో) తెలీదుగానీ, దేముడు పుట్టించిన మానవుడు మాత్రం అఖండ మేధావి.

జన్యుశాస్త్రం అనగా నేమిటో చూచాయగా తెలిసిన వారికి కూడా యీ పుస్తకం అతి చక్కగా అర్థం అవుతుంది. సైన్సు విభాగమైనప్పటికీ తెలుగ భాష చాలా చక్కగా , చదువరికి అర్థమయ్యేలా రాసి, జన్యుశాస్త్రం మీద ఆసక్తి వున్నవారికి ఈపుస్తకాన్ని అందించిన శ్రీ జమ్మి కోనేటి కోనేటి రావుగారు అభినందనీయులు.

—భూపతి.

## మనుచరిత్రము

సమీక్ష. రచయిత సాహిత్యశిరోమణి, విద్వాన్ శ్రీ కర్రా వేంకటసుబ్రహ్మణ్యము, ఎం. ఏ., ఆంధ్రోపన్యాసకులు, ఎస్. డి. జి. ఎస్. కళాశాల, హిందూపురము, క్రౌను 80 పుటలు, వెల 2 రూ.

ప్రాచీన కవులలో తిక్కనను గురించీ, ప్రబంధ కవులలో పెద్దనను గురించీ వెలువడిన—వెలువడుతూ వున్న విమర్శనములకు లెక్కలేదు. అర్ధ శతాబ్దానికి పయిగా ఇవి వివిధ పద్ధతులలో వస్తూనే వునాయి. అందులో ఇది నూతనం. రచయిత సంస్కృతాంధ్రాలలో విద్వాంసులు, సాహిత్య తత్వాన్ని బాగా అవలోకనం చేసి గ్రహించే సమర్థులు. బహు పరిశ్రమ చేసి మనుచరిత్రలోని వైశిష్ట్యాన్ని గుర్తించి యిందులో వివరించారు. మనుచరిత్రలో కొందరు చూపే లోపాలకు సమాధానాలిచ్చి, దాని కీర్తికి మెరుగు పెట్టారు. నన్నయ మొదలు పెద్దన వరకూ వుండే కవితా రీతులు మనుచరిత్రలో పుణికి పుచ్చుకున్నట్లు సోదాహరణంగా నిరూపించారు. కథాంశాన్ని చక్కగా పరిశీలించి అనున్యూతంగా దాని ఔచిత్యాన్ని ఉదాహరణలతో వివరించారు. చివరకు "ఆంధ్ర సారస్వత విశ్వమున అల్లసాని పెద్దనార్యుడొక యుజ్జ్వలమైన తార. ఆ మహనీయుని గూర్చి యెంతయైనను జెప్పవచ్చును." అని ముగించడం, రచయితకు పెద్దనపై వుండే గౌరవం వ్యక్తమవుతున్నది.

ఎంతో శ్రమించి వ్రాసినా, యీ విమర్శ సాహిత్యంలో ఎక్కువ ఆసక్తి వున్న వారికిగాని బోధపడదు. రచన చాలా ప్రౌఢంగా ఉన్నది. అందరికీ అందుబాటులో వుండేటట్లు ద్వితీయముద్రణంలో దీన్ని సులభ శైలిలో వెలువరించడం మేలు!

—ఆంగీరస

## భవాని

కథల సంపుటి రచన: శ్రీ కొలకలూరి, క్రౌన్ ఆక్టావో 298 పేజీలు. వెల: రు. 6— మేలు ప్రతి రు. 7—ప్రచురణ: విజయసారధి పబ్లికేషన్స్, విజయవాడ—2.

'కథలు రాయుడ మెలాగ?'— అనే సమస్యను గురించి పలు భాషలలో రకరకాల పుస్తకాలు, వచ్చాయి. తెలుగు భాషలోనూ వచ్చాయి. అయితే ఏవో కొన్ని సూత్రాలూ, నియమాలూ విధించి, ఇదీ పద్ధతి అని చెప్పటం కాదు కావలిసింది. ఈ కథ ఇలా ఉండాలి, ఉండితీరాలి అని ఎవరూ హద్దు తేర్పరచలేదు. ఏమైనా అంటే— ఒక్కొక్క కథకుడి దృక్పథాన్ని బట్టి ఒక్కొక్కలా నడుస్తుంది కథ. ఒక్కొక్కరి రచన ఒక్కొక్క పంథా తొక్కుతుంటే, ఒక్కొక్క కొత్త తీరును చూపుతుంది.

అదే కథను విశ్వనాథవా రెలా రాస్తారు? కుటుంబరావు ఎలా మలుస్తారు? రాచకొండవారి ధోరణి ఎలా వుంటుంది? రంగనాయకమ్మ గారి పద్ధతి ఏమిటి?— అని మాదిరి చూపించాలి. ఆ తరవాత మీరే ఆ కథ నెలా సృష్టిస్తారు? అని అడగాలి. ఇక అభ్యుదయ భావాలు విరజిమ్మే నేటి యువ కథకుల సరికొత్త పోకడలను పరిశీలించాలి.

ఇప్పుడు—మన కొలకలూరి వారే ఉన్నారు. 'శైలి రీతి, రచనా పద్ధతి, పాఠకుల ఉత్సుకతను రేకెత్తించి, కథను చదివింప జేసేవిగా ఉండా'లని వారి ఆశయం. అదే దృక్పథంతో, నక్షత్ర మాలికలాగ చిత్రించిన ఇరవయ్యేడు కథానికల సంపుటి ఇది. అలా అని, అన్నీ ఉత్త కథలు కావు. కథా రచనకు ఆదర్శమైన మచ్చుతునకలు, కళాఖండికలు, మామూలుగా అన్ని కథల్లాగా ఒకసారి చూచి పారెయ్య తగ్గవి కావు. మళ్లీ మళ్లీ చదివి చదివి, మననం చేసుకుని, భద్రపరుచుకోవలసిన వచనం. తీరిక సమయంలో, నెమరు వేసుకోవాల్సిన ఉత్తమ కథా సాహిత్యం. 'మెడుల్లా మెలిక'తో ప్రారంభిస్తే, 'అగరొత్తి కాలిపోయి' చుర్రుమనేదాకా మనకి తెలియనే తెలియదు.

కారణం? —

చదవగల శక్తి పాఠకుడిలో లేదు.

చదివించే శక్తి రచనలోనే వుంది.

—శివకుమారి.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

